

పద్మశ్రీ కమల్ హాసన్
సమర్పించు
దశరథ సంగిశెట్టి సారథ్యంలో
సాగరసంగమం
స్వాతిముత్యం
వరుసలో మరో
మహత్తర చిత్రం...
SURESH DIGITALS
సిరి సాయి సూర్య మూవీస్
సత్యమే శివం
సంగిశెట్టి సబిత
G.లక్ష్మినారాయణ
సుందర్.C.
విద్యాసాగర్
MUSIC ON
LEO
వెన్నెలకంటి • ఆర్థర్.A.విల్సన్ • విక్రమ్ ధర్మ • M.ప్రభాకరన్ • బృందా...దినేష్ • ఐ.అర్జున్ రావు

# 'హాసం'

హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

## ఇవీ సంగతులు

34

# హాస్యం - సంగీతం








'సెంటర్ స్ప్రెడ్'లో - 'ఫూల్స్', 'సత్యమే శివం' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: కుమారి శ్రీదేవి




డియర్ రాజా గారు,

**1-2-2003 'హాసం' పత్రిక ఇన్నర్ కవర్ పేజీలో సంగీతంలో హేమాహేమీలైన మహానుభావులెందరో కలిసి దిగిన గ్రూప్ ఫోటో చూసి చాలా సంతోషించాను.**

**లతా మంగేష్కర్, సాలూరి రాజేశ్వరరావు గార్ల దగ్గర్నుంచి ఎందరో సంగీత దిగ్గజాలు దిగిన ఆ గ్రూప్ ఫోటో ప్రచురించిన మిమ్మల్ని అభినందించకుండా ఉండలేకపోతున్నాను.**

**ఈ ఫోటో పబ్లిష్ చేసినందుకు మీకు, మరియు ఇంతటి గొప్ప సంగమానికి కారకులైన శ్రీ బాలు గారికి పాదాభివందనాలు తెలియజేసుకుంటూ... "ఇంత మంచి ఫోటోలో నేనుంటే ఎంత బాగుణ్ణో కదా" అని అనుకుంటూనే మిస్సయినందుకు ఫీలవుతున్నాను. కాని ఏం చేస్తాం అప్పటికి నేను చాలా చిన్నవాడ్ని (ఇండస్ట్రీలో ఎంటర్ కాలేదు).**

**ఆ ఫోటో కాపీ ఒకటి మా స్టూడియో (సంగీత్ ప్రాడిజి)లో భద్రపర్చడానికి పంపగలరని అభ్యర్థిస్తున్నాను.**

**మీ మిత్రుడు**
**ఆర్.పి.పట్నాయక్,**
**మ్యూజిక్ డైరెక్టర్.**

నేను హైదరాబాద్‌లో ఉండగా మా అబ్బాయి 'హాసం' పత్రిక తీసుకొని వచ్చాడు. చదవగానే నాకు నచ్చింది. వెంటనే సం॥ర చందా కట్టేము. మేం బరంపురం వచ్చేసరికి చాలా Prompt గా పంపిన 'హాసం' నాకు చేరింది. మీకు నా ధన్యవాదాలు.

సంగీతం, సాహిత్యం, హాస్యంతో కూడుకున్న ఈ పత్రికలో చాలా కొత్తదనం కనబడింది. కార్టూన్‌లలో కూడా ఓ ప్రత్యేకత ఉంది. భరణిగారి పేజీ ఈ పత్రికకు ఓ హైలెట్. మాకు తెలియని ఎన్నో విషయాలను అందజేస్తున్న 'హాసం' పత్రికకు నా హాట్సాఫ్!

**-డి.జె. కుమారి, బరంపురం.**

16-31 జనవరి 2003 చిరంజీవి, పవన్ కళ్యాణ్‌లతో వెలువడిన సంచిక ఆద్యంతం ఆనంద లహరిలో ఓలలాడించింది. ముఖ్యంగా ఆచార్య తిరుమల గారి పద్యాల్లో ఏడుపులు చదువుతుంటే కొండొకచో నవ్వులు కూడా పుట్టించాయి. 'హాసం'లో హాస్య, సంగీతాలే కాక నవరసాలు అందిస్తున్నందులకు సంపాదక మహాశయులు అభినందనీయులు!!

**-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.**

ఏడుపులు కూడా పద్యాలుగా విరబూసి నవ్విస్తాయని శ్రీ ఆచార్య తిరుమల గారి నవ్వుటద్దాలు చదివి అర్థమయింది. అక్షయ పాత్రల్లాంటి కావ్యాలను శోధించి పక్షం పక్షం పంచభక్ష్యాల్లాటి పద్యాల్ని సరళసుందరమైన వ్యాఖ్యానంతో అందిస్తున్న కవి పండితులయిన వారికి వెయ్యిన్నూట పదహారు జోహా(రా)ర్లు(లు)

**తనికెళ్ళ శంకర్, సికింద్రాబాద్.**

'హాసం' పత్రికను ప్రారంభ సంచికనుండి చదువుతున్నాను. హాస్యప్రియులు సంగీత ప్రియులు అందరు చదివి ఆనందించేలావుంది. భరణిగారి శాస్త్రీయ సంగీత కళాకారుల విశేషాలు, లలిత సంగీతం, తెలుగు, హిందీ సినిమాపాటలను అందిస్తూ ఆపాటలలోని సాహిత్య, సంగీత ఉదాత్తతలను మీ విశ్లేషణలో తెలియజేయడం చాలా నచ్చింది. ప్రత్యేకంగా మీరు ప్రచురిస్తున్న 'ఆపాత మధురం'లోని ఆణిముత్యాల్లాంటి పాటలు వాటిపై మీ విశ్లేషణ చాలా బాగుంది. ఇది పాటల సంకలనం చేసే నాలాంటి వారికి ఎంతో సహాయపడుతుంది.

కొత్త పాటల 'ఆడియో రివ్యూ'లు కూడా చాలా బాగుంటున్నాయి. ఇంత చక్కని పత్రికను చక్కగా నిర్వహిస్తున్న మీకు నా అభినందనలు.

**- పి.శేషగిరిరావు, విశాఖపట్నం.**

వచ్చేసంచిక నుండి ప్రారంభం కాబోయే "గీత కోశం"లో సినిమాపేరు, సంవత్సరం, పాట పల్లవి, రచయిత పేరు, సంగీత దర్శకుని పేరు, పాడినవారి పేర్లు ఇస్తున్నట్లు తెలియచేసారు. ఇక్కడ నాదొక చిన్న మనవి. పైన తెలియచేసిన అన్ని వివరాలతో పాటు 'ఆ పాట ఏ రాగంలో పాడబడినది' అన్న విషయం కూడా తెలియచేస్తే ఒకే దగ్గర అన్ని విషయాలు తెలుస్తాయి.

**-తెలికిచర్ల రామకృష్ణ, విజయనగరం.**
**(సాధ్యపడదు. క్షమించాలి-ఎడిటర్)**

ఎంత చదివినా ఇంకా చదవాలనిపించే విధంగా 'హాసం' పత్రిక కళాభిమానులకు చేస్తున్న సేవ అపూరూపం. తాజాగా వచ్చిన మీ సంచికలో (1-15) ప్రచురించిన ఫోటోగ్రాఫ్ (ఘంటసాల విగ్రహ ప్రతిష్టాపన సందర్భంగా తీసిన ఫోటో) ఒక ఆణిముత్యం. ఈ ఘనత దక్కించుకున్న శ్రీ బాలుగారు ఎంతైనా అభినందనీయులు. "'నాదబ్రహ్మ త్యాగరాజు' గూర్చిన భరణిగారి వ్యాసం మాలాంటి వారికి ఒక పాఠ్యపుస్తకం. ఆచార్య తిరుమలగారి "చమత్కార పద్యాలు" సాహిత్యం పట్ల ఆసక్తిని రేకెత్తిస్తూ పత్రికకే హైలెట్. హాస్యబ్రహ్మ బ్రహ్మానందంగారి ఫోటోలతో మీరు చేసిన "గిమిక్రీ" మాకు బ్రహ్మానందాన్ని కల్గించింది. మీరు ప్రచురించబోయే ఆడియో లైబ్రరీ క(వి)నాలని ఎంతో ఆశగా ఎదురుచూస్తున్నాం.

**-నారాయణరావు, శ్రీకాకుళం.**

హాసం ప్రారంభ సంచిక నుంచి ఎందరో సాహితీ ప్రియులను, సినిమా ప్రియులను ఆకట్టుకుంటూ వచ్చింది. ముఖ్యంగా కిశోర్‌కుమార్ జీవిత కథ 'కిశోర్ జీవన ఝరి' చదువుతుంటే ఆయన ఇప్పటికీ జీవించినట్టు కళ్ళెదుట నిలిచినట్టూ అనిపిస్తుంది. కొంటె చేష్టల కిశోర్ పేరుకి తగినట్టు కడుపుబ్బ నవ్వించినా, నవరసాలను పండించి ఆలపించే గీతాలను పాడినా ఆయనకు ఆయనే సాటి. స్వాతి గారు వివరంగా ఆయన జీవిత చిత్రాన్ని మా ముందు వుంచడం ఎంతో ఆనందంగా ఉంది. ఎందర్నో నవ్వించిన ఆయన జీవితంలో విషాదమే తొంగి చూసింది. హిందీ సినీగీత ప్రియులు ఎన్నటికీ మరువలేని మధుర స్వర, సుర గాయకుడు కిశోర్‌కుమార్. ఇంతగా అలరించిన హాసం పత్రికకు శుభాకాంక్షలు, అభినందనలు.

**-ఎ. అన్నపూర్ణ, పద్మనాభం, హైదరాబాద్.**

తెలుగుపాటకు ప్రాణంపోసి తాను లేకపోయినా, తన పాటల ద్వారా మన అందరికీ హాయిని, ఉల్లాసాన్ని అందించిన అమృతమూర్తి ఘంటసాల గారు. అలాంటి మహనీయుడి వర్ధంతి (ఫిబ్రవరి 11) సందర్భంగా సుగుణగారి జ్ఞాపకాలు మనసును కదిలించాయి. పదేళ్ళక్రితం ఆయన విగ్రహ ఆవిష్కరణ రోజు తీసిన ఫోటోను ప్రచురించిన మీకు ధన్యవాదాలు తెలుపు కుంటున్నాను. ఎందరో అతిరథ మహా రథులను అందించిన ఈ ఫోటోలోని కొందరు కాలగర్భంలో కలిసిపోయిన వారి స్మృతి చిహ్నంగా వుంటాయి. ఇలాంటి ఫోటోలు ప్రచురించి పాత తరం అభిమానులను ఉత్సాహపరచాలని కోరుకుంటున్నాను. ఈ సంచికలో బలరాంగారి "సాంగులే బంగారు రాజా", రావెళ్ళగారి "పెళ్ళాంఊరెళితే" కడుపుబ్బ నవ్వించాయి.

**-ఆల్వాల్ సురేష్‌కుమార్, హైదరాబాదు.**

'హాసం' 1-15 ఫిబ్రవరి సంచికలో మా అభిమాన హాస్యనటులు శ్రీ బ్రహ్మానందం పుట్టినరోజు సందర్భముగా కలర్ ఫుల్ చిత్రాలు మాకు బాగా నచ్చాయి. హాస్యానికి మారుపేరు మా బ్రహ్మానందం గారు. చిత్ర జగతిలో నాడు శ్రీ రేలంగిగారు, నేడు బ్రహ్మానందంగారు మా అభిమాన హాస్యనటులు. బ్రహ్మానందంగారు కలకాలం నవ్వులు పండించాలి. నిండు నూరేళ్ళు జీవించాలని మా ఆశ, ఆకాంక్ష.

**-తాళాభక్తు శేషుబాబు, నాగాయలంక.**

ఒకప్పుడు పుంఖానుపుంఖాలుగా రాసి సుమారు 8 సంవత్సరాలై కథలు రాయడం మానేసిన నన్ను 'హాసం' మేలుకొలిపింది. అసభ్యత, అశ్లీలత, ఆడంబరంలేని పక్ష పత్రిక. 1సంవత్సరంగా చందా కడదామంటే పోస్ట్ భయం. మా ఊరు పత్రిక రాదు. పార్వతీపురం నుండి పత్రిక తెప్పించుకుంటున్నాను- బస్సుల దగ్గర పడిగాపులుకాచి. నా కథలు ప్రచురించి పారితోషికాలు, కాంప్లిమెంటరీలు పంపిప్రోత్సహిస్తున్న మీకు కృతజ్ఞతలు. సంగీత సాహిత్యాలలో అంతో ఇంతో అనుభవమున్న నాకు గొప్ప తృప్తినిచ్చిందీ పత్రిక. ఇలాగే మీ(మా) పత్రిక దినదినాభివృద్ధి పొందాలని ఆకాంక్షిస్తూ

**-ఐ.వి.నరసింహం, గుమ్మలక్ష్మీపురం**

మా ఇంట్లో వారంతా 'హాసం' అభిమానులం. క్రమం తప్పకుండా చదువుతాం. మీరు ప్రచురించిన వార్త చదివి వందేమాతరం శ్రీనివాస్ గారు నిర్వహించిన 'అమ్ములు' సినిమా పాటల పోటీలో పాల్గొని బహుమతి గెలుచుకున్నాను. ఆయన సంగీతంలో తదుపరి చిత్రాల్లో పాడే అవకాశం ఇస్తామన్నారు. మాలాంటి ఔత్సాహిక నూతన గాయనీగాయకులకు మీ వంతు సహకారం ఇలాగే కొనసాగాలని ఆశిస్తూ...

**-బి.ఝాన్సీలక్ష్మి, శ్రీరంగపట్నం**

సంపుటి : 2 సంచిక:10

16-28 ఫిబ్రవరి 2003

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

34

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

మనసుకు ఉల్లాసం కలిగించే సాధనాలలో క్రీడలుకూడా ఒకటి. అందునా 'గ్లామర్' తోడయితే మరీనూ. గత పక్షం ఫిబ్రవరి 2న ఆంధ్రరాష్ట్రంలో చలనచిత్ర పరిశ్రమ ఓ సంచలనాన్ని కలిగించింది. తమ ఆటపాటలతో, నటనాచాతుర్యంతో జనాల్ని మురిపించే తారలు ఆటల్లో మేటి గ్లామరున్న క్రికెట్ 'పిచ్'పై దిగివచ్చి ప్రేక్షక జనాలను పిచ్చెక్కించారు. ఆ రోజు ప్రత్యక్షంగానూ, 'మా టి.వీ' కెమెరాల ద్వారానూ వీక్షించిన కోట్లాది ప్రజలకు అబ్బురం కలిగించిన విషయాలెన్నో ఉన్నాయి.

ఒకటి సాంకేతిక పరమైనది. ఎలాటి ఒడిదుడుకులు లేకుండా, శాంతి భద్రతలకు లోటు రాకుండా, అపార జనసమూహం అదుపు తప్పకుండా, వివిధ శాఖల మధ్య సమన్వయం సాధించి ప్రదర్శనను నిజంగా 'లైవ్'లో చూపించడం జరిగింది. ఆట జరుగుతూండగా 'హాసం' ప్రతినిధి వ్యాఖ్యాతలలో ఒకరితో చేసిన వాక్చమత్కారాన్ని ఆ వ్యాఖ్యాత బహిరంగంగా వెల్లడించడం ఈ విషయానికి తార్కాణం.

మరొకటి - అగ్రతారల మధ్య కనబడిన సంఘీభావం, క్రీడాస్ఫూర్తికి ఎక్కడా విఘాతం కలుగకుండా అగ్రతారలు అన్ని జాగ్రత్తలూ తీసుకొన్నారని విశదమయ్యింది. సినిమా తీసేటప్పుడు హీరోలకు సమాన ప్రాముఖ్యత ఈయడం కోసం సాధారణంగా కథ బలయిపోతూ ఉంటుంది. కానీ ఈ క్రికెట్ 'పిచ్' మీద ఎలాటి స్క్రిప్టు ముందుగా రాయబడలేదనిపించింది - సూపర్‌స్టార్లు కూడా ఔటయి పోతూ ఉంటే! దీన్ని బట్టే మన తారలందరూ స్పోర్టివ్ స్పిరిట్ కలవారన్న విషయం తేటతెల్లమై అందరికీ ఆహ్లాదం కలిగించింది. 'మాచ్ ఫిక్సింగ్' జాడ్యం సినీ క్రికెటర్లను అంటలేక పోయిందన్న విషయం ఎంతో సంతోషాన్నిచ్చింది.

ఆటలో కొట్టవచ్చినట్టు కనబడిన విషయం - నటులు చూపిన సంయమనం. ఎప్పుడు సీరియస్‌గా ఆడి మెప్పించాలో ఎప్పుడు రిలాక్స్ చేసి ప్రేక్షకులను సంతోషపెట్టాలో బాగా తెలిసిన సూత్రధారులని నిరూపించుకున్నారు. ఆటను ఆషామాషీగా కాక అసలైన ఆటగాళ్లంత దీక్షగా ప్రాక్టీసుచేసి ఆటకు వన్నె తెచ్చిన కళాకారులతో బాటు ఈ కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించిన 'మా' సంస్థ, 'మా టి.వీ.' అందరూ అభినందనీయులే.

ఈ కార్యక్రమం ద్వారా వృద్ధ కళాకారుల సంక్షేమానికి 75 లక్షల రూ.ల నిధుల సేకరణతో బాటు 'వరల్డ్ కప్'లో పాల్గొనే భారత్ టీమ్‌కు ప్రజల ఆకాంక్ష తెలుపుతూ సందేశం ఇవ్వడం అనే మరొక లక్ష్యంకూడా ఉంది. ప్రజల దృష్టిని ఒక ప్రత్యేకమైన అంశం వైపు ఆకర్షించడానికి, విషయంపై ప్రజాభిప్రాయాన్ని మూటగట్టడానికి కూడా ఇటువంటి కార్యక్రమం మంచి సాధనం అవుతుందని నిరూపణ అయింది. ఆ అంశం దేశరక్షణ కావచ్చు, రాష్ట్రసమైక్యత కావచ్చు,మతసామరస్యం కావచ్చు, లేదా లలిత కళలపట్ల ప్రజల అనురక్తిని పెంచడం కావచ్చు.

కళాకారుల కుటుంబం సంఘటితంగా కదలినప్పుడు స్పాన్సర్లు, ప్రజాసందోహం వారి వెంట నుంటారన్న విషయం మరొక్కసారి నిర్ధారించడబడింది కాబట్టి 'మా' వారు మరిన్ని ప్రజాహిత కార్యక్రమాలు చేపట్టి ప్రేక్షకులకు ఆహ్లాదం పంచడంతోబాటు, సామాజిక ప్రయోజాన్ని కూడా సాధించాలని 'హాసం' ఆకాంక్షిస్తోంది.





# బంటీ ఈజ్ ది సీక్రెట్ ఆఫ్ మై ఎనర్జీ

- వాలి హిరణ్మయీదేవి

**భీమారావ్ నిద్రపట్టక దొర్లుతున్నాడు.** సాయంత్రం పేపర్లో, టీవీలో విశేషాలు అతని కళ్లఎదుట తిరుగుతున్నాయి -

'దొంగల బీభత్సం-పెట్రోల్ బంక్ దోపిడి'

దోపిడిదొంగలు మరోసారి రెచ్చిపోయి గురువారం అర్థరాత్రి నుండి హైదరాబాదు శివారు ప్రాంతాల్లో బీభత్సకాండ సృష్టించారు. ...' పేపర్ చదువుతున్న భీమారావ్‌కి చెమట్లు పట్టాయి. మనసు డైవర్ట్ చేసేందుకు టీ.వి. ఆన్ చేశాడు.

"సూరారం గ్రామంలో దోపిడి చేసి కొందరి మరణానికి గూడా కారకులైన దోపిడి దొంగలు ఒక రోజయినా గడవకముందే 'దుండగల్' పరిధిలోని రహదారిపై దారిదోపిడీకి పాల్పడ్డారు."

వెంటనే టీ.వి. ఆఫ్ చేశాడు. ఎక్కడయినా - ఎవరినోటయినా ఈ దొంగల ప్రస్తావన తప్ప మరోటి లేదు.

చూడటానికి మాత్రమే భీముడిలా ఉన్న భీమారావ్‌లో ధైర్యం మాత్రం నిండు సున్నా - పిల్లంటే మరీనూ.

కానీ ఆ పిల్లెమో బెడ్‌రూమ్ కిటికీలో కూర్చోని భీమారావ్ వంకే కళ్ళార్పకుండా చూస్తూ మీసాల్ని రకరకాలుగా తిప్పుతూ "మై ఆవూ" అన్నట్లుగా "మియ్యావూ" అంటూంటుంది. బోడి వెధవ పిల్లి మై ఆవూ.. అంటూ పర్మిషన్ అడగడం ఒకటి అని మనసులో తిట్టుకుంటూ దాన్ని తాను నిరంతరం మంచం పక్కనే పెట్టుకొన్న కర్రతో అదిలిస్తూ ఉంటాడు, అయినా దాని పని దానిదే.

భీమారావ్‌లోని ఈ పిరికితనం వల్లే గాలి వీస్తే పడిపోయే పర్సనాలిటీ ఉన్న అతని భార్య సరళ, అతని మీద ఆధిపత్యం సంపాదించింది. అతన్లోని పిరికితనాని క్కారణం - అతడి చిన్న తనంలో అతని ఇంటిమీద దొంగలు పడి తండ్రి తలను బాది చంపిన సంఘటన! వయసుతో బాటూ ఆ భయమూ పెరుగుతూ వస్తోంది మరి.

"ఏవయిందండీ! అలా గజగజ వణుకు

తున్నారు - నిద్రలో కూడా ఆ చెమటలేంటి? ఓ.. మళ్ళీ పేపర్‌గానీ టి.వి. గానీ కలలోకి వచ్చిందా?" అంది సరళ కాస్త చిరాగ్గా.

"మంచినీళ్ళు" సైగ గూడా చేస్తూ ఎలాగో గొంతు పెగిలించుకొని అడిగాడు భీమారావు. సరళ ఫ్రిజ్ తెరిచి - చల్లటి నీళ్ళ బాటిల్ అందించింది. దాన్నందుకొని ఏకబిగిని గటగటా తాగి ఐదు నిముషాలు కళ్ళు మూసుకొంటే గానీ తెప్పరిల్లలేక పోయాడు భీమారావ్.

"సరూ! మనం కొన్నాళ్ళు బాగా జనసమ్మర్దం ఉన్న ప్రాంతాల్లో ఎక్కడన్నా రెంట్‌కి ఇల్లు సంపాందించి ఉందాం - నగర శివార్లలో దొంగల బెడద ఎక్కువైంది కదా" అంటూ సరళకి నచ్చజెప్ప బోయాడు.

"ఇంత వసతిగా ఇల్లు కట్టించుకుని, ఆ జన సమ్మర్దంలో - అగ్గి పెట్టెల్లాంటి గదుల్లో - మూడ్రోజులకోసారి వదిలే నీళ్ళతో నానా చావూ చావాలి. నావల్లకాదు బాబూ" ఒక్కమాటలో తేల్చి చెప్పేసింది సరళ.

"అలాగంటె ఎలా? బతికుంటె బలుసాకు తినొచ్చన్నారు పెద్దలు" భీమారావ్ మాటింకా కంప్లీట్ కాకముందే "ఊ ఊ । నాకా బలుసాకు కావాలి" అంటూ నిద్రలేచి ఏడ్పుకి లంకించుకున్నాడు వారి పుత్రరత్నం బంటి. వాడికి 'తిండి' పేరు వింటే చాలు ఒళ్ళు తెలీదు - అప్పటి కప్పుడు ఆకలి పుట్టుకొస్తుంది.

"మీకెన్ని సార్లు చెప్పినా బుద్ధిరాదేంటండీ! 'తిండి' పదార్థం పేరెత్తకుండా మాట్లాడలేదూ అంటూ సరళ విసుక్కొంది.

"ఊ.. ఊ.. నాకు బలుసాకు కావాలి" మళ్ళీ రిపీట్ చేస్తూ ఈసారి మరింత గట్టిగా ఏడ్పు మొదలెట్టాడు.

"ఇదుగోరా" అంటూ మర్నాడు పూజకని దాచిన తమలపాకుల్ని రెండింటిని అందించింది సరళ.

వెంటనే తన నోటికి పని చెప్పాడు బంటి.

"మహానుభావుడు "కాదేది కవిత్వానికి అనర్హం" అన్నాడు - అలాగే వీడికి తినడానికి పనికిరాని వస్తువులేదు" అన్నాడు భీమారావ్.

"ఛ - కన్నతండ్రై అలా దిష్టి పెడతారేం టండి?" అంది కినుకగా సరళ. అని "ఇవాళ పనిపిల్ల రత్నాలు వచ్చి 'అమ్మగోరూ, మా అమ్మ ఇయ్యాల్టినుండి జల్దీ రమ్మన్నది, దొంగలు తిరుగుతున్నారంట కదా' అంది. ఇదోగోల." అంది.

"నిజమే సరళా - తొందరగానే పంపించేస్తూ ఉండు. లేకుంటే ఎటుపోయి ఏదొచ్చినా కష్టం" కాస్త భయపడుతూనే అన్నాడు భీమారావు.




ఏ కళనుందో గానీ సరళ 'సరే' అంది నిద్ర కుపక్రమిస్తూ..

* * *

మర్నాడు ఆఫీస్‌లోకి అడుగుపెడుతూనే వాతావరణంలో ఏదో మార్పుని కనిపెట్టాడు భీమారావ్.

"ఏంటీ అందరూ అదోలా ఉన్నారు" ఆగబట్ట లేక అడిగేశాడు భీమారావ్

"ఏంటేంటండీ బాబూ! మన ఆఫీసర్ గారింట్లో దొంగలుపడి ఆయన్ని, మేడంని కొట్టి బంగారం, డబ్బూ ఎత్తుకెళ్ళార్ట దొంగలు" చెప్పాడు కొలీగ్ కోమట్రావ్.

"ఆ...." గుండెలు గజగజలాడాయ్ భీమారావ్‌కి చెమట్లతో నిండి పోయిన అతని మొహాన్ని చూస్తూనే అడక్కుండానే నీళ్ళు తెచ్చి అతని కిచ్చాడు అటెండర్ ఆనందం. మంచినీళ్ళు గటగటా తాగి కాస్త తేరుకొన్నాక అడిగాడు భీమారావ్.

"ఎందరొచ్చారూ, ఎలా జరిగింది" అంటూ

"తలుపులు ధన్నధన్న కొట్టిరంట, ఎవళ్ళని అడిగితే 'పోలిసోల్లం' అన్నరంట. నిజమనుకొని తలుపులు తెర్వంగనె వస్తవస్తనే దుడ్డుకర్రలతో కొట్టి, వాళ్ళని ఒక రూమ్‌లో ఏసి గొళ్ళెంబెట్టి ఉన్నయన్ని ముల్లెగట్టి పరారైంరంట" టూకీగా చెప్పాడు ఆనందం.

ఇక ఆరోజుంతా ఎవరూ ఆఫీసులో పని చేయలేదు. 'దొంగల' టాపిక్కే! ఎవరెవరు దొంగలవల్ల ఏమేం పోగొట్టుకున్నారో ఎన్నెన్ని పాట్లు పడ్డారో చెబుతూ ఉంటే భీమారావ్‌కి ముచ్చె మటలు పోశాయ్. పనిచేయబుద్ధికాలేదు. తిండి తిన బుద్ధి కాలేదు. నాల్గింటికి ముందరపరచి పెట్టుకొన్న ఫైళ్ళన్నింటిని మూసి లేచాడు.

తమ కాలనీలోకి స్కూటర్ మళ్ళిస్తూ అక్కడున్న గుంపుని చూసి తత్తరపడ్డాడు. గుండెలు దడదడలాడ్తుండగా బాగా పరకాయించి చూశాడు. తమ కాలనీలో వాళ్ళతో బాటు ఇద్దరు ఇన్‌స్పెక్టర్లు, నల్గురు కానిస్టేబుళ్ళని చూస్తూ, స్కూటర్‌ని ఓ పక్కగా ఆపి, ఆ గుంపులో చేరి వాళ్ళు చెప్పేవి వినసాగాడు.

"ఆ..ఇప్పటిదాకా చెప్పింది బాగా సమ జయిందా? మల్ల ఇంకోపాలిజెబ్తున్న బాగా ఇనుకోండ్రి-



ఒకటి : దర్వాజ (తలుపులు) లెవరన్న కొట్టంగనె తియ్యొద్దు కిటికీల నుంచి చూసి తెర్వాలె.

రెండు : ఇంట్ల బంగారం, డబ్బు, పట్టుచీరల్, ఎండిసామాన్లు ఉంచొద్దు. మెడలో ఏసుకొని తిరగొద్దని మీ ఆడాళ్ళకి గూడ చెప్పాలి.

మూడు : ఇంట్ల మస్తు 'కారం' పొడి స్టాకు పెట్టుకోండ్రి. దొంగోడు రాంగనె కళ్ళలోకి కొట్టనీకి.

నాల్గు : మీ మంచాల తాన దుడ్డుకర్రలు, బరిశెలు కత్తుల్ పెట్టుకోవాలె. కాలనీల ఎవరన్న కొత్తోల్లొస్తె బాగా పరీచ్చగ చూడాలె.

ఐదు : కుక్కల్ని పెంచుకోవాలె.

ఆరు : వేం ఉంటాంగానీ, మీ కాలనీలోంచి దినాం నల్గురు వచ్చి మాతో పెట్రోలింగ్ చెయ్యాలె.

ఏడు : ప్రతి ఇంట్ల విజిల్ పెట్టుకోండ్రి. దొంగలొస్తె బాగా ఊదుండ్రి. ఆ విజిల్ వినంగనే అందరూ ఆ చప్పుడు వినొచ్చిన ఇంటికి ఒక్కసారి ఉర్కాలే..ఆ..సమజైందా. ఈ ఏడు పాయింట్లని ఫాలో కండ్రి. బస్.. అంటూ తన ఉపన్యాసం ముగించాడా ఇన్‌స్పెక్టర్.




* * *

ఇంటికి వెళ్ళడంతోనే సరళని కూర్చోబెట్టి అన్నీ వివరించి చెప్పాడు.

"అబ్బ, మీరిప్పుడు చెప్పారుగానీ, నేను ఎప్పుడో నా నగల్ని లాకర్‌లో పెట్టేశాను, కారంపొడి రెండు డబ్బాల్నిండా నింపి ఉంచాను" అంది చిన్నగా నవ్వుతూ.

"అమ్మ నా పెళ్ళామా, నీకెంత తెలివో" అన్నాడు మురిపెంగా. తనలా ఏ సమస్యకి భార్య జడవకపోవడం, క్విక్‌గా నిర్ణయాలు, పరిష్కారాలు చెప్పడం అతని కెప్పటి కప్పుడు వింతగా, కొండొకచో గొప్పగా తోస్తాయి - కానీ ఇంకో భయం.

ఇంట్లో బంగారం, డబ్బూ లేదు కాబట్టి పోయే సమస్యలేదు కానీ కొందరు దొంగలు తమకేదీ దొరక్కపోతే ఉక్రోషం కొద్దీ, మరికొందరు ఇంత చేతకాని వాళ్ళు బంగారం, డబ్బూ సంపాదించలేనోళ్ళు బతికి లాభం ఏంటని, మరి కొందరు తమని ముందు ముందు గుర్తుపడతారే మోనని దొరికిన వారిని కొట్టడం, చంపడం, గాయపర్చటం, చేస్తున్నారు. ఆ భయంతో మళ్ళీ నిద్రపట్టడం మానేసింది భీమారావ్‌కి.

పదిరోజులెలాగో గడిచాయ్. కాస్త బెదురు తగ్గింది భీమారావ్‌లో. మళ్ళీ ఎప్పటిలా నిద్రపోగల్గుతున్నాడు.

ఆ రాత్రి అతనట్లా మంచి నిద్రలో ఉండగా ఎవరో తట్టిలేపినట్లయింది.

"అ..అంటూ ఒక్కసారిగా బెదిరిపోతూ కళ్ళు విప్పాడు. ఎదురుగా బంటీ.

"నాన్నా, ఆకలేస్తోంది నాన్నా, అమ్మని లేపితే లేవరు ఏమన్నా తిండానికి పెట్టునాన్నా" అంటూ ఏడ్పు మొదలెట్టాడు.

"అర్థరాత్రి అంకాళమ్మ శివాలన్నట్లు, నీకి అర్థరాత్రి తిళ్ళు అలవాటేగా! కానీ మీ అమ్మ, మనల్ని బాగా డబ్బున్న వాళ్ళని దొంగలెక్కడ అనుకుంటారోనని మునుపట్లా ఫ్రిజ్‌లో స్వీట్స్, బిస్కెట్స్, పిజ్జాలు, బగ్గర్‌లూ ఉంచటం లేదు కదరా బాబూ..ఇప్పుడెలా" అంటూ తలపట్టుకున్నాడు. షెల్ఫ్‌లో వెదకాలన్నా చీకటి. కరెంట్ పోయింది మరి. సడెన్‌గా గుర్తొచ్చింది. దేవుడి దగ్గర నైవేద్యంగా పెట్టిన పళ్ళ సంగతి. అవి తేవడానికి మెల్లగా తడుముకుంటూ లేచాడు. దేవుడి షెల్ఫ్ అనుకొని మలో షెల్ఫ్‌లో చెయి పట్టగానే అతని చేయి తగిలి ఏదో కింద బడింది.

"అరె, ఇటుగదా దేవుడి షెల్ఫ్" అనుకొంటూ అక్కడ తడిమి నాల్గు అరటి పళ్ళు దొరికితే పట్టుకొచ్చి ఇచ్చాడు. "నాయనా ఇవి శుభ్రంగా మింగి బజ్జోరా నాయనా! లేస్తే ఇక దొంగల భయంతో నిద్రపట్టడం లేదు" అని తన కష్టాన్ని కొడుక్కి చెప్పుకుని నిద్ర కుపక్రమించాడు. అతని అదృష్టం బావుండి వెంటనే నిద్రపట్టింది.

గంటన్నా గడవకముందే మళ్ళీ భీమారావ్ భుజం మీద చేయిపడింది.

"మళ్ళీ ఏంట్రా నాయనా" అన్నాడు కళ్ళు తెరవకుండానే.

"ష్..ఉఠో..చాబీదేవ్" కర్కశంగా విన్పించొదక స్వరం.

ఎదురుగా నల్లటి ముసుగుల్లో కత్తులతో ఉన్న ఇద్దరు వ్యక్తులు. వాళ్ళు దొంగలని గ్రహించి భీమారావ్ గొంతువిప్పేలోగానే ఒకడు కత్తి తీసి భీమారావ్ గొంతుకానించాడు. తల తిప్పకుండా సరళ వంక కళ్ళు తిప్పి చూశాడు. ఆమెనలాగే మంచానికేసి కట్టేశారు. నిద్రాభంగం కల్గకుండానే. తాళం చేతులకని వెదికి దొరక్కుంటే భీమారావ్‌ని లేపారు. "నాదగ్గర తాళం చేతుల్లేవు" వణుకుతూ చెప్పాడు.

"ఫిర్ కిదర్ హై" ఉరుముతున్నట్లే అడిగాడు మరొకడు.

"చికెన్ మే..నహీ నహీ కిచెన్ మే..రైట్‌సైడ్ షెల్ఫ్ మే" తడబడుతూ చెప్పాడు భీమారావ్. అతని కరచరణాలాడటం లేదు వాళ్ళని చూస్తుంటే.

"అరె..తుమ్ జాకే లేకే ఆ..రే" అంటూ రెండో వాడిని పంపాడు మొదటివాడు, భీమారావ్‌కి అలాగే



కత్తి ఆనించి.

"ఠీక్ హై" అంటూ వెళ్ళినవాడు తిరిగి రాలేదు.

"బేవకూఫ్ - కిధర్ గయెతో ఉధరీ మర్తే - ఏక్ కామ్ భీ ఠీక్ సే నహీ కర్తే" అని వాడిని తిడుతూ వెనక్కి ఓ అడుగేశాడు, వేసి దబ్బున పడ్డాడు. ఇదే అదనుగా తను పిల్లిని కొట్టడాన్ని పెట్టుకొనే కర్ర తీసి వాడినెత్తిన నాల్గు గబగబా బాదాడు భీమారావ్. వాడు పెట్టిన అరుపులకి మెలకువొచ్చిన సరళ "ఏంటండీ" అంది.

'బంటి తిని పారేసిన అరటి పండుతొక్క మీద కాలు వేయబట్టి పడటం, పడ్డవాడిని తను బాదటం జరిగాయి. లేకుంటే గొంతుకు కత్తి ఆనించినవాడ్ని తను కొట్టగలిగేవాడా?' అనుకుంటూ, ఇవేమీ చెప్పకుండా ఆమె కట్లు గబగబా విప్పి వంటింట్లోకి వెళ్ళాడు భీమారావ్ కర్రతో. వెనగ్గా కారంపొడి పట్టుకొని సరళ వెళ్ళింది.

కానీ అక్కడ అంతకుముందు అరటిపళ్లు వెతుకుతూ భీమారావ్ ఒంపేసిన నూనె మీద కాలు వేశాడ్లా ఉంది, కాలుజారి గోడకో, సింక్‌కో తలగొట్టుకొని మూర్ఛపడి ఉన్నాడా దొంగ. వాడిని లాక్కొచ్చి ముందున్న సోఫాకికట్టి, బెడ్‌రూమ్‌లో పడ్డ దొంగనలాగే మంచం కోడుకి కట్టి, బంటికి విజిల్ అందించి ఊద మన్నారు భీమారావ్, సరళలు.

వాడికా విజిల్ ఊదటం వెన్నతో పెట్టినవిద్య. ఆ విజిల్ చప్పుడికి కాలనీ వాళ్ళంతా లేచి వచ్చారు. పెట్రోలింగ్ చేస్తోన్న పోలీసులు ఈ దంపతుల్ని అభినందించి దొంగల్ని పోలీస్‌స్టేషన్‌కి తీసుకెళ్ళారు. పోలీసు ఇన్‌స్పెక్టర్ మెచ్చుకుంటున్నప్పుడు భీమారావ్ ధైర్యంగా దొంగని కొట్టకపోతే తమగతి ఏమయ్యేదోనని సరళ అనుకోసాగింది. పిరికివాడని తను వెక్కిరించిన భీమారావ్‌లో అంత ధైర్యం ఉన్నందుకు మనసారా గౌరవించింది. ఇది భీమారావ్‌కి ఎంతో ఆనందం కల్గించినా, మనసులో ఏదో మూల గిల్టీ కాన్షస్. ఎందుకంటె బంటికి చెందాల్సిన మెప్పు తను పొందు తున్నందుకు. బంటిగాడి తిండి పిచ్చే తమని రక్షించిందని అతని నమ్మకం. బంటిగాడి మూలంగానే తను వంటింట్లోకెళ్ళాడు. నూనె వంపేశాడు, పొరపాట్న, తన అదృష్టం, ఆ దొంగ దురదృష్టం కొద్దీ వాడలా పడి ఉండక పోతే వాడొచ్చి తనని అటాక్ చేసేవాడు.




ధైర్యసాహసాలకి మారుపేరయిన దంపతులుగా భీమారావ్, సరళలు ఆ రాత్రికి రాత్రి పేరు గడించారు. పోలీసుస్టేషన్ నుండి 'నగదు బహుమతి' అందింది. ఆఫీస్‌లో గౌరవం పెరిగింది.

అయినా అతనిప్పుడూ ముందులాగే నిద్రకు దూరమవు తున్నాడు. బంటీపట్ల గిల్టీ కాన్షస్‌నెస్ ఒక కారణమయితే, ఇంకో కారణం - అతనిప్పుడు కాలనీ వాసుల దృష్టిలో "హీరో"నాయె. ఎవరు, ఏ క్షణం తన సహాయం కోసం తలుపు తడతారోనన్న భయంతో, అలా వచ్చిన వారికి ఏ సాకు చెప్పి తప్పించుకోవాలా అన్న ఆలోచనలతో నిద్ర దూరమవుతోంది.

న్యూస్ న్యూస్

## హాసం కు 'కళావేదిక' - 'ఈటా' అవార్డు

ఆంధ్రప్రదేశ్ కళావేదిక ప్రకటించిన 'ఆర్ట్స్ అవార్డు 2002' విజేతలలో 'హాసం' కూడా ఉంది. ఈ అవార్డు విజేతలకు యూరోపియన్ తెలుగు అసోసియేషన్ (ఈటా) 'ఈటా మ్యూజిక్ అవార్డుల' ను అందజేస్తారు.

గత పక్షం ఫిబ్రవరి 9న కళావేదిక కార్యదర్శి ఆర్.వి.రమణమూర్తి మార్చిలో హైదరాబాదులో అవార్డుల ప్రదానం జరుగుతుందని ప్రకటించగా, మార్చి 30న బర్మింగ్‌హామ్‌లో జరిగే ఉగాది వేడుకల్లో పాల్గొనమని విజేతలను ఈటా అధ్యక్షురాలు డా॥ చాపరాల భారతి ఆహ్వానించారు.

### అవార్డుల వివరాలు

| | | | |
|---|---|---|---|
| ఉత్తమ గీత రచయిత | సిరివెన్నెల | ఏచోట ఉన్నా | నువ్వే - నువ్వే |
| ఉత్తమ సంగీత దర్శకుడు | ఆర్.పి.పట్నాయక్ | 'జయం' చిత్రానికి, 'నీ కోసం' చిత్రంలో చినుకు తడికి అనే పాటకి | |
| ఉత్తమ నేపథ్య గాయకుడు | ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం | ఘల్లు ఘల్లున, రా రమ్మని...రా రా.. | ఇంద్ర, ఔనువాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు |
| ఉత్తమ నేపథ్య గాయని | ఉషా | దిల్ దీవానా, చినుకు తడికి | జెమిని, నీ కోసం |

ప్రజాదరణపొందినపాట 'రానురానంటూనే చిన్నదో' (జయం), జ్యూరీ అవార్డు గ్రహీతలు కీరవాణి, చక్రి, కౌసల్య.

సినీగీతాలతో 'మంచి పాట' కోసం విశేషంగా కృషి చేస్తూ అందరి ప్రశంసలు అందుకుంటున్న పత్రిక హాసం

☆ శ్రీ నాగరత్నమ్మ సంగీత విద్యాలయం, అద్దంకి వారు తమ ప్రథమ వార్షికోత్సవ సందర్భంగా 23-02-03న రాష్ట్రస్థాయిలో శాస్త్రీయ, లలిత సంగీత విభాగాలలో (గాత్రం) పోటీలు జరుపబడతాయని ఒక ప్రకటనలో తెలిపారు. పూర్తి వివరాలకు శ్రీ నాగరత్నమ్మ సంగీత విద్యాలయం, డా॥గోపాలరావు వీధి, అద్దంకి-523 201, ఫోన్ (08593) 225271 లేదా శ్రీ మట్టుపల్లి ప్రభాకరరావు, కరస్పాండెంట్, ఫోన్ : (08593) 223429

☆ ప్రఖ్యాత కర్నాటక సంగీత విద్వాంసుడు శ్రీ నేదునూరి కృష్ణమూర్తిని గతపక్షం ఫిబ్రవరి 9 న హైదరాబాదులో జరిగిన ఆంధ్ర సంగీత అకాడెమీ మూడో వార్షిక సంగీత ఉత్సవాల సందర్భంగా 'సంగీత విద్యానిధి' బిరుదుతో సత్కరించారు. ప్రసారభారతి సి.ఇ.ఓ. శ్రీ కె.యస్. శర్మ హాజరయి ఆయనను ఆకాశవాణి తొలి నేషనల్ ఆర్టిస్టు కేటగిరీకి ఎంపిక చేసినట్లు ప్రకటించారు.



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-7402993

# లలిత సంగీతం

## ఏనాటికీ రాడు

ఏనాటికీరాడు ఏలాటి ప్రియుడే
ఈలాగువేచి నేనెన్నాళ్ళుసైచేనె ॥ఏనాటికీ రాడు॥
తానే కదా వలపు లోన రేపేనే
ఉండుండి నా మనసు ఊయలూపేనే
సారెసారెకులోన సందేహాలాయె
ఊరకే ఏవేవో ఊహలొచ్చాయె ॥ఏనాటికీ రాడు॥
తాను వచ్చేదారి నా ప్రేమ చల్లి
ద్వారాన చూపుల తోరణాలల్లి
ఎన్నాళ్ళు నా కళ్ళు ఎదురుచూసేనే
ఏలాగులూ విరహ బాధ మోసేనే ॥ఏనాటికీ రాడు॥



| | |
|---|---|
| రచన | : కీ॥శే॥దేవులపల్లి కృష్ణశాస్త్రి |
| సంగీతం | : కీ॥శే॥ రమేష్‌నాయుడు |
| గానం | : శ్రీమతి రావుబాలసరస్వతీ దేవి |
| రాగం | : కాపి (కర్ణాటక సం॥) |
| తాళం | : ఖండచాపు (కర్ణాటక సం॥) |
| | పీలు (హిందుస్తాని సం॥) |

22వ మేళకర్త ఖరహర ప్రియరాగ జన్యం

| | |
|---|---|
| ఆరోహణ | : స రి మ ప ని స |
| అవరోహణ | : స ని ద ని ప ద ప మ గ మ రి స |

ని=కైవకి నిషాదం ద=శుద్ధ దైవతం గ=సాధారణగాంధారం
ని=కాకలి నిషాదం ద=చతుశృతి దైవతం గ=అంతరగాంధారం

షడ్జము, చతుశృతి రిషభం, శుద్ధమధ్యమం, పంచమం, కాకలి నిషాదం ఆరోహణలోను, తారషడ్జము, కైశికి నిషాదం, చతుశృతి దైవతం, కైశికి నిషాదం, పంచమం, శుద్ధ దైవతం, పంచమం, శుద్ధ మధ్యమం, అంతరాగాంధారం, శుద్ధ మధ్యమం, సాధారణగాంధారం, చతుశృతి రిషభం అవరోహణలోను వున్న స్వరాలు యీ రాగంలో.

వక్ర సంచారంగల యీ రాగంలోని స్వరాలన్నీ వివిధ రకాలుగా ఉపయోగించబడతాయి. కాపి రాగంలోని యీ స్వరాలే హిందూస్తాని రాగమైన పీలులో వున్నా రాగసంచారంలోను, ప్రయోగాలలోను స్వరాల పోకడలు వైవిధ్యంతో రక్తిని కలిగిస్తాయి. కాపి, పీలు - యీ రెండు రాగాలు భక్తి, శృంగార రసాలకు అనుకూలమైనవి. శృంగార ప్రధానమైన జావళీలు, అనేక ప్రేమగీతాలు యీ రాగాలలో మనకు ఎక్కువగా తారసపడాతాయి.

అది 1977వ సంత్సరం. మైసూర్‌లో నివాసముంటున్న శ్రీమతి రావు బాల సరస్వతీ దేవి యొక్క లలిత సంగీత కార్యక్రమాన్ని ఆకాశ వాణి హైదారాబాదు కేంద్రం ఏర్పాటు చేసింది.




ప్రముఖ స్వరకర్త రమేష్‌నాయుడు స్వర రచన చేయడానికి ఆమెతో కలసి హైదరాబాదుకు వచ్చారు. అంతకు ముందు ఎప్పుడో ఒకానొక సందర్భంలో కృష్ణశాస్త్రి గారు బాలసరస్వతికి రాసి యిచ్చిన ఒక పాటను ఆమె హైదరాబాదు వచ్చినప్పుడు రమేష్ నాయుడుకు యివ్వగా ఆయన దానికి బాణీని కూర్చారు. అదే 'ఏనాటికీ రాడు ఏలాటి ప్రియుడే' అనే విరహగీతం. కాపిరాగంలోని స్వరాలను స్వతంత్ర సంచారాలతో ఆ పాటకు ఉపయోగించి అందమైన ప్రముఖంగా కల్పించారు స్వరకర్త. అంతర గాంధార, చతుశృతి దైవతాల ప్రయోగం ప్రముఖంగా కనిపించే యీ బాణీ బాలసరస్వతి గళంలో సముచితమైన భావ ప్రకటనతో రాణించి శ్రోతలను పరవశింప జేసింది. ఆకాశవాణిలో పనిచేసే వాద్య బృందం కళాకారులతో అక్కడ స్వరకర్తగా పనిచేస్తున్న నాకు ఎక్కువగా అలవాటు వుంటుందని రమేష్‌నాయుడుగారు


దేవులపల్లి కృష్ణశాస్త్రి

నన్ను రిహార్సల్సు కండక్టు చెయ్యమన్నారు. ఆయన స్వరపరచిన బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ ను నేను నొటేషన్ రాసుకుని ఆర్కెస్ట్రా వారి చేత రాయించి, రిహార్సల్సు వగైరా పనులు నేను చేయించడం జరిగింది. నా పని తీరు ఆయనకు నచ్చి, ఆయన బాణీలు కూర్చిన మూడుపాటలలో ఒక పాటకు నన్ను ఇంటర్లూడ్స్ కంపోజ్ చెయ్యమని అడిగారు. ఆయన కోరిక ప్రకారం ఒక పాటకు ఇంటర్లూడ్స్ కూర్చి ఆ కార్యక్రమాన్ని నేనే రికార్డు చేయడం






జరిగింది. ఆ తరువాత చాలా సార్లు బాలసరస్వతి హైదరాబాదు ఆకాశవాణిలో చాలా పాటలు పాడారు.

### కీ॥శే॥రమేష్‌నాయుడు

సుప్రసిద్ధ చలన చిత్ర సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు మొదట బొంబాయిలో హిందీ, మరాఠీ చిత్రాలలో పనిచేసి మంచి అనుభవాన్ని గడించుకొన్నారు. ఆర్కెస్ట్రైజేషన్ టెక్నిక్స్, హిందుస్తాని సంగీత పద్ధతులు, మరాఠీ బాణీలు మొదలగువాటిని బాగా ఆకళింపు చేసుకున్న ఆయన మెలోడీకి ప్రాధాన్యతనిస్తూ సంగీతం కూర్చేవారు. సినిమా సంగీతంలో కాలానుగుణంగా వచ్చే ట్రెండ్స్‌కు తగినట్లుగా సంగీతాన్ని అందిస్తూ కూడా మెలోడీని విడిచి పెట్టకుండా శ్రావ్యమైన పాటలను కంపోజ్ చేసిన ఘనుడాయన. కలకాలం జ్ఞాపకముండే, హాంట్ చేసే పాటలెన్నో ఆయన సృష్టించారు.


కీ॥శే॥రమేష్‌నాయుడు

'దాంపత్యం' చిత్రంలో బాలసరస్వతి పాడిన లాలిపాట 'వెన్నెల రాజావేగమె రావా', ఎ.ఎమ్.రాజా, బాలసరస్వతి పాడిన 'తానేమి తలంచేనో', 'మనోరమ' చిత్రంలో తలత్ మహమూద్ పాడిన 'అందాల సీమసుధా నిలయం', 'గతిలేని వాణ్ణి గుడ్డి వాణ్ణి బాబయ్యా', సుశీల-తలత్ పాడిన యుగళగీతం 'మరచిపోరాదోయ్ చేసిన బాసలు', 'మీనా' చిత్రంలో సుశీల పాడిన 'శ్రీరామ నామాలు శతకోటి', 'తూర్పు-పడమర'లో ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం పాడిన 'శివరంజని నవరాగిణి', సుశీల పాడిన 'స్వరములు ఏడైనా', 'అమ్మమాట'లో సుశీల పాడిన 'ఎంతబాగా అన్నావు ఎవ్వరు నేర్పిన మాటరా', 'ఎప్పుడూ మీ పాఠాలంటే ఎలాగండీ సార్', 'సంఘం చెక్కిన శిల్పాలు'లో బాలసరస్వతి పాడిన 'పోయిరావే అమ్మ పోయి రావమ్మా', యింకా శివరంజని, ముద్దమందారం, చిల్లరకొట్టు చిట్టెమ్మ, జీవితం, జయసుధ, మేఘసందేశం మొదలైన చిత్రాలలో ఎన్నో మంచి పాటలను స్వర పరచారు రమేష్‌నాయుడు. జోరు మీదున్నావు తుమ్మెదా, లలిత కళారాధనలో, గోరువెచ్చని సూరీడమ్మా - యిలా ఎన్నో పాటలు ఆయన అందించిన రసగుళికలు.

1950వ దశకంలో 'కినిమా' అనే సినిమా పత్రిక వుండేది. మధుమూర్తి

ఆ పత్రిక సంపాదకుడు. ఆ పత్రిక తరపున ఆయన నూతన నేపథ్య గాయకులను ఎంపిక చేయడం కోసం 1957లో విజయవాడలోను, మద్రాసులోను పాటల పోటీలు నిర్వహించారు. రమేష్‌నాయుడు న్యాయనిర్ణేతగా వ్యవహరించారు. సుప్రసిద్ధ వైణిక విద్వాంసులు ఈమని శంకర శాస్త్రిగారి మేనల్లుడు, వైణికుడు అయిన ఎమ్.ఎన్.శ్రీరామ్ (తరువాతి కాలంలో 'పెళ్ళిరోజు' మొదలగు చిత్రాలు నిర్మించి సంగీత దర్శకత్వం వహించారు. ఆకాశవాణి కేంద్రాలలో ప్రోగ్రామ్ ఎక్జిక్యూటివ్‌గాను, అసిస్టెంట్ డైరెక్టర్ గాను పనిచేశారు) సహన్యాయ నిర్ణేత. విజయవాడలోజరిగిన పోటీలో నేను పాల్గొన్నాను. మద్రాసులో కూడా పోటీ జరిపిన అనంతరం నన్ను మొదటి బహుమతి విజేతగా ప్రకటించి 'కినిమా' పత్రిక తరపున మధుమూర్తిగారు నన్ను అభినందిస్తూ లేఖరాశారు. 'కొలంబియా' రికార్డింగు కంపెనీ వారు 2 ఏళ్ళ కాంట్రాక్టు కూడా నాకు పంపారు. రమేష్‌నాయుడుగారు కూడా నాకు అభినందనలు తెలుపుతూ నన్ను వారి వద్దకు రమ్మని కబురు చేశారు. కొన్ని కారణాల వలన ఆ సమయంలో ఆ అవకాశాన్ని సద్వినియోగ పరచుకోవడం నాకు వీలు పడలేదు. ఆ తరువాత 1977లో బాలసరస్వతిగారు హైదారాబాద్‌కు వచ్చినపుడు రమేష్‌నాయుడు నన్ను గుర్తుపట్టి 'మీకు నేను బాకీ వున్నాను. పిక్చర్‌లో పాడిస్తాను' అని చెప్పి 'సూర్యచంద్రులు' చిత్రంలో 'ఒకే మనసు రెండు రూపాలుగా' అని (ఎస్పీ బాల సుబ్రహ్మణ్యం, నేను పాడిన గీతం) అనే పాటను పాడించారు. అది ఆయన నా పట్ల చూపిన సహృదయతకు నిదర్శనం.

1950వ దశకంలో వచ్చిన హిందీ చిత్రం 'నాగిన్'లోని పాటలు సూపర్‌హిట్ అయినాయి. అందులో లత పాడిన 'జాదూగర్ సయ్యాఁ ఛోడో మోరీ బయ్యాఁ హోగయా ఆధీరాత్ అబ్‌ఘర్ జానేదో' అన్న పాటకు స్పందించి ఆరుద్ర 'నడిరేయి దాటింది వదిలేయి నా చేయి వస్తానులే రేపు ప్రియతమా' అంటూ ఒక పాట రాశారు. దానికి రమేష్‌నాయుడు చక్కని బాణీ కూర్చారు (చారుకేశి రాగం ఆధారంగా). 1955లో హైదరాబాద్‌లో జరిగిన ఆకాశవాణి వారోత్సవాలలో ఆహూతుల సమక్షంలో ఏర్పాటు చేసిన లలిత సంగీత కార్యక్రమంలో ఆ పాటను బాలసరస్వతి శ్రావ్యంగా పాడారు.

డా॥ సి.నారాయణరెడ్డి గారు రచించిన నాలుగు తెలుగు మీరాభజనలకు రమేష్‌నాయుడు సంగీతం కూర్చగా బాలసరస్వతి పాడగా ప్రైవేటు రికార్డుగా వెలువడింది. ప్రియసఖి, నీల మోహనుడు నా కన్నులలో నిండిపోయెనే, కాసంత యిటు చూడవోయి, నీవు లేక నేను లేను అనే చక్కని పాటలు ఆ రికార్డులోనివి.

జీవించినంతకాలం మెలోడీకే ప్రాధాన్యతనిస్తూ శ్రమించిన రమేష్‌నాయుడు తనువు చాలించినా, ఆయన పాటలలో కలకాలం జీవించే మంచి స్వరకర్త.

## కాపి / పీలు రాగాలు ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1.కోతిబావకుపెళ్ళంట | మల్లీశ్వరి | భానుమతి | ఎస్.రాజేశ్వరరావు |
| 2.ఎలాఎలాఎలాతెలుపను | నువ్వులేకనేనులేను | ఉష | ఆర్.పి.పట్నాయక్ |
| 3.భువనమోహన.... (వేంకటేశ్వరస్వామిపైపద్యాలు) | ప్రైవేటు రికార్డు | ఘంటసాల | ఘంటసాల |
| 4.రమతేయమునాపులినవనే | ప్రైవేటు రికార్డు | ఘంటసాల | ఘంటసాల |
| 5.నేనుతాగలేదునాకునిషారాదు | | ఘంటసాల | ఘంటసాల |
| | హిందీ(పీలురాగంఆధారంగా) | | |
| 1.హమ్‌కర్‌కేమొహబ్బత్‌యేసమ్‌ఝే | కవి | తలత్ | సిరామచంద్ర |
| 2.చలీబన్‌కేదుల్హాన్ | సుబహ్‌కాతారా | లత | సిరామచంద్ర |
| 3.ఐమేరేజుహ్రాజబీఁ | వక్త్ | మన్నాడే | రవి |
| 4.అప్నీకహోమ్‌కుఛ్‌మేరీసునో | పర్‌ఛాయీఁ | లత, తలత్ | సిరామచంద్ర |
| 5.మోహేపన్‌ఘట్‌పేనందలాల్ ఛేడ్‌గయోరే | మొగలేఆజం | లత | నౌషాద్ |

## ఆస్కార్ పోటీలో హాస్య ప్రధాన చిత్రాలు



మై బిగ్ ఫ్యాట్ గ్రీక్ వెడ్డింగ్: గత సంవత్సరం సూపర్‌హిట్ అయిన హాలీవుడ్ చిత్రాలలో 'మై బిగ్ ఫ్యాట్ గ్రీక్ వెడ్డింగ్' అనే చిత్రం సంచలనం సృష్టించింది. కేవలం 5 మిలియన్ డాలర్లతో నిర్మించిన ఈ కామెడీ చిత్రం 200 మిలయన్ డాలర్లకు పైగా వసూలు చేసింది. టామ్ హ్యాంక్స్, అతని భార్య రీటా విల్సన్ నిర్మించిన ఈ చిత్రంలో పెద్ద తారలెవరూ లేరు. నియా వార్డొలాస్ అనే గ్రీకు నటి తను నటించిన నాటకం ఆధారంగా స్క్రిప్టు తయారుచేసి తనే నటించిన చిత్రమిది. ఒక గ్రీకు యువతి ఓ ఐరిష్ యువకుణ్ణి ప్రేమించి తన పెద్ద కుటుంబాన్ని ఒప్పించి పెళ్లి చేసుకునే కథను హాస్యభరితంగా మలిచారు. ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే విభాగంలో నియా వార్డొలాస్‌కు ఉత్తమ ఒరిజినల్ స్క్రీన్‌ప్లే ఆస్కార్ నామినేషన్ లభించింది.




మహనీయుల వ్యక్తిత్వాలను కొద్దిరేఖల్లోనే ప్రతిఫలింపచేసిన బాపు సుప్రసిద్ధ కాల్పనిక పాత్రలను ఎలా రూపుదిద్దారో చూడండి.

గురజాడ సృష్టించిన గిరీశం ఎలా ఉండి ఉంటాడు? 'ఈ తురకెవడోయ్?' అన్న అగ్నిహోత్రావధాన్లు మాట పట్టుకుని గిరీశం తలపై ముస్లిం టోపీ పెట్టారు కొందరు. ఆరుద్రగారితో కూడా కూలంకషంగా చర్చించి గిరీశం వయస్సు, వేషధారణ నిర్ణయించి బాపు ఈ బొమ్మ గీశారట. ఇక అదే స్టాండర్డ్ అయిపోయింది. చుట్టపొగలోంచి వచ్చిన ప్రేమ గుర్తులు గిరీశం నడిపిన రాసలీలల్ని గుర్తుకు తెస్తాయి.




మొక్కపాటి సృష్టించిన 'బారిష్టర్ పార్వతీశం' తీసుకోండి. ముందులో డి.రామలింగంగారు వేసిన బొమ్మ ఆ పుస్తకం కవర్‌పై ఉండేది. పొడుగుచేతుల చొక్కా వేసుకున్న పల్లెటూరి యువకుడి రూపంలో పార్వతీశం ఉండేవాడు. పార్వతీశానికి ఉన్న ప్రత్యేకలక్షణం - లండన్ చదువుపై వ్యామోహం! అది ప్రతిఫలించేట్లు బొమ్మగీశారు బాపు.

అలాగే చిలకమర్తివారి గణపతిని తీసుకోండి. పొట్టకోస్తే అక్షరమ్ముక్క లేకపోయినా షోకులకు తక్కువ చేయని గణపతిని కళ్లక్కట్టించారు బాపు. బానబొజ్జ, మరుగుజ్జు రూపం- ఇవన్నీ చిలకమర్తి వర్ణనకు దగ్గరగానే వేస్తున్నా ఆయన వర్ణించినంత వికృతాకారంగా మాత్రం 'ప్రెజెంట్' చేయలేదు పెద్దమనసున్న బాపు.






ఇవన్నీ బాపుకు ముందునుండి తెలుగు సాహిత్యంలో స్థిరపడిన పాత్రలయితే సహచరుడు రమణ కొన్ని సృష్టించిన అనేక పాత్రలకు బొమ్మలతో ఆయన రూపురేఖలు దిద్ది కళ్లక్కట్టించారు. ఉదాహరణకి 'అప్పారావు'ను తీసుకోండి. రమణగారి వర్ణన ఇది-

'అప్పారావు కొత్తరూపాయి నోటులా ఫెళఫెళ లాడుతూ ఉంటాడు. కాలదోషం పట్టిన దస్తావేజులాంటి మాసినగుడ్డలూ, బడిపంతులుగారి చేబదుళ్లలా చిందర వందరగా ఉండే జుట్టూ, అప్పు తెచ్చిన విచ్చు రూపాయిలా మెరిసే పత్తికాయలాంటి కళ్లూ, అప్పులివ్వగల వాళ్లందరినీ చేపల్లా ఆకర్షించగల యెరలాటి చురుకైన చూపులూ! అతను, బాకీల వాళ్లకి కోపిష్ఠివాడి జవాబులా పొట్టిగా టూకీగా వుంటాడు. మొత్తం మీద అతని మొహం ముప్పావలా అర్ధణాలా వుంటుందనీ, అతనికి ఎప్పుడూ అంతే అప్పు ఇచ్చే మిత్రుడు అభివర్ణించాడు.'



దానికి బాపు కట్టిన బొమ్మ ఇది. చిత్రకారుడి స్వేచ్ఛ నుపయోగించుకుని, కాస్తముందుకెళ్ళి ఇంకో అరడజను చేతులా అప్పు చేసుకునే సదుపాయం ఏర్పాటు చేశారు.

ఇవన్నీ ఒక ఎత్తయితే ఆంగ్ల సాహిత్యంలో ఎన్నో దశాబ్దాలుగా వినుతికెక్కిన పాత్రను తెలుగులోకి తర్జుమా చేయడంలో బాపు చూపిన నేర్పు మరో ఎత్తు. జీవ్స్, పి.జి.ఉడ్‌హవుస్ సృష్టించిన అద్భుతమైనపాత్ర. అతను ఊస్టర్ అనే బద్ధకస్తుడైన కుర్ర జమీందార్‌కు వేలే (valet) - సహాయకుడుగా పనిచేస్తూంటాడు. సర్వజ్ఞుడు (ఇంటర్‌నెట్‌లో ఓ సెర్చ్ ఇంజన్ పేరు ఆస్క్ జీవ్స్ డాట్‌కామ్). జీవ్స్‌ను అచలపతిగా, ఊస్టర్‌ను అనంతశయనంగా మలచి 'అచలపతి కథలు'గా రాద్దామని M B S ప్రసాద్ సంకల్పించి, లోగోకై బాపుగారిని అర్థించటం జరిగింది. 'వేలే' ఉద్యోగం తెలుగునాట లేదు. ఇంగ్లండులో 'వేలే'లు వేసుకునే 'టక్సెడో'లు మనకు నప్పవు. అందువల్ల బాపుగారు జీవ్స్ స్ఫూర్తితో అచలపతికి ఓ రూపం కల్పించారు. చొక్కా పైబొత్తం కూడా పెట్టుకొన్నట్టు చూపడంతో అచలపతి ఎంత పద్ధతిగా ఉంటాడో చెప్పకనే చెప్పారు బాపు. ఇంగ్లీషు బొమ్మల్లో కనబడే డ్రింక్స్‌కు బదులుగా దేశవాళీయంగా కాఫీని అందించారు బాపు!




ఇక ఊస్టర్ బద్ధకాన్ని కాలికింద కుషన్ పీటతో సహా ప్రదర్శిస్తూనే మరో అద్భుతం చేశారు బాపు. ఈ జీవ్స్ కథలన్నీ ఊస్టర్ రచించిన 'జ్ఞాపకాలు'గా అందించారు ఉడ్‌హవుస్. కానీ ఏ జీవ్స్ పుస్తకం కవరైనా చూడండి - ఊస్టర్ రాస్తున్నట్టు ఎక్కడా కనబడదు. కానీ బాపు గీసిన లోగోలో ఊస్టర్‌ను రచయితగా ప్రదర్శించారు. దటీజ్ వేర్ హీ స్కోర్స్ ఓవర్ ఈవెన్ ఇంటర్నేషనల్ ఆర్టిస్ట్స్!

# పద్మనాభం ఆత్మకథ



## సీరియల్ 10

కళాకారుడు ప్రజలకు దూరంగా మనజాలడు. అతడు ప్రజలలోనుండే వస్తాడు. ప్రజలకు తన విద్య ప్రదర్శించడానికే ఇష్టపడతాడు. అదే అతని ఊపిరి, మనుగడ. సినిమాలు తగ్గిన దశలో నా దృష్టి మళ్లీ నాటకరంగానికి మరలింది.

నాటకరంగం నాకు కొత్త కాదు. 5 ఏళ్ల వయసులో సింహాద్రిపురంలో 'చింతామణి' నాటకంలో నటించిన నాటి ముచ్చట చెప్పాను



కదా, తరువాత వార్‌ఫండ్ నాటకం ప్రొద్దుటూరులో వేసినప్పుడు ఆడవేషం వేశాను. 1944 లో సి.యస్.ఆర్. గారితో 'భక్త తుకారాం' నటించిన నాటి అనుభవాలు, ఋష్యేంద్రమణి గారి ట్రూపులో పాదుకా పట్టాభిషేకం, సతీ సక్కుబాయి, హరిశ్చంద్ర, రంగూన్ రౌడీ అనుభవాలు కూడా చెప్పాను.

అలాగే ప్రజానాట్యమండలి అల్లీముఠా, శాంతి నాటకాలు, వల్లం నరసింహారావు, చదలవాడ, నాగభూషణం, చలపతిరావు (మ్యూజిక్)లతో కలిసి వేశాను. హైదరాబాదులో రవీంద్రభారతిలో 'శాంతినివాసం' వేసినప్పుడు నా అంబాసిడర్ కారులో నేను, మీనాకుమారి స్టేజిపైకి వచ్చి కారు అపుకుని, పాట అయిన తర్వాత కారు డ్రయివ్ చేసుకుంటూ వెళ్లిపోయాం. రవీంద్రభారతి చరిత్రలో చిరస్థాయిగా నిలిచిన దృశ్యం ఇది.

డా. గరికిపాటి రాజారావు గారి 'అల్లూరి సీతారామరాజు' యిందులో ఇంగ్లీషు దొర కవర్టు పాత్ర వేశాను. అంటే విలన్ అన్నమాట.చైనాతో యుద్ధం వచ్చినప్పుడు వార్‌ఫండుకు శ్రీ యన్.టి.ఆర్. గారితో కొన్ని నాటకాలు ఆంధ్రలో జరిగాయి. నేను చైనీయుడి పాత్రలో నటించాను.

శ్రీశైలంలో శ్రీకాళహస్తి మహాత్మ్యం' నాటకం వేసినప్పుడు 800 రూ.లు వసూలయితే అందులో 400 రూ.లు శ్రైశైలం మల్లిఖార్జున స్వామివారికి యిచ్చాము.

శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న ఉదయం ఆటలకు వచ్చిన కలక్షన్ 15,000 రూ.లు బీహార్ క్షామనిధికి నేను, కాకర్ల వెంకటేశ్వరరావు కాసు బ్రహ్మానందం గారి ద్వారా ఇచ్చాం. వార్‌ఫండ్‌కు 5 వేలు, గుడివాడలోని అక్కినేని నాగేశ్వరరావు కాలేజికి 5 వేలు డొనేషన్ ( మా తల్లిదండ్రుల పేర) ఇచ్చాను. అందరిదగ్గరా సహాయం తీసుకుని వృద్ధిలోకి వచ్చినవాణ్ని కాబట్టి 'మానవసేవయే మాధవసేవ' అని నమ్మి చేతనైనంత సహాయం చేయడం ధర్మంగా భావిస్తూనే ఉన్నాను.

సాంఘిక ప్రయోజనం కోసం నాటకాలను ఉపకరించాయి. 'మనోహర' (1958) నాటకం ద్వారా వచ్చిన లక్షరూపాయలు తెనాలి కాలేజికి ఇవ్వడం జరిగింది. క్షామనివారణకు ఎన్.టి.ఆర్.,

హాస్యనటుడు బాలకృష్ణగారితో పరిచయం సి.ఎస్.ఆర్.గారి 'భక్తతుకారం' నాటకంలో. ఆయన తుకారాం మొదటి భార్యగా ఆక్టుచేసేవారు. 1945 నుంచి 2 ఏళ్ళు పాటు వేసిన ఆ నాటకంలో నేను మహాదేవుని వేషం వేశాను. తరువాత షావుకారు, పాతాళభైరవి, కార్తవరాయుని కథ యింకా ఎన్నో సినిమాలలో కలిసి నటించాము. నాటకాలకు వెళ్లినప్పుడు గుంటూరులో నాకు మలేరియా జ్వరం వచ్చింది. నన్ను ఏలూరుకు తీసుకెళ్లి 10 రోజులు వుంచుకొని చేయించాడు. తరువాత ఇద్దరం మద్రాసు చేరాం. ఆయన నాకు ఫ్యామిలి ఫ్రెండ్. అన్ని కష్టసుఖాలు నాతో చెప్పేవాడు. నేను తీసిన అన్ని సినిమాలలో బాలకృష్ణ వున్నాడు. 'పెళ్లికాని తండ్రి ' లో రమాప్రభ నాన్నగా చేశాడు. ఆయనకు 7గురు ఆడపిల్లలు. మొదటి అమ్మాయి పద్మకు పెళ్ళి చేయగలిగాడు. తరువాత వేషాలు తగ్గాయి. బెంగతో ఆయన పాతాళభైరవి అంజి అంటే ఇప్పటికీ ప్రేక్షకులు మర్చిపోలేరు. మనకు లేకుండా వెళ్లిపోయాడు.

1970 జపాన్ ఎక్స్‌పోకు నేను రాజబాబు వెళ్ళాము. సింగపూర్, కౌలాలంపూర్, జపాన్, బసాకా, బ్యాంకాక్ నగరాలను సందర్శించాం. 1991 అక్టోబర్‌లో శ్రీగొల్లపూడి మారుతీరావు, సుబ్బారావు గారు,సోమయాజులుగారు, తులసీ, నేను అమెరికా సందర్శించాము. 19 స్టేట్సులో ప్రదర్శనలు ఇచ్చాము. దొంగగారు వస్తున్నారు స్వాగతం పలకండి, మనిషి గోతిలో పడ్డాడు, తులసీ డ్యాము, కన్యాశుల్కం, ప్రదర్శనలు ప్రవాసాంధ్రులను అలరింపచేశాయి. అన్ని ప్రశాంతంగా జరిగాయి. అనుకోకుండా కొండ విరిగి నెత్తిన పడ్డట్లు, ప్రమీలారాణి అకస్మాత్తుగా బ్లడ్ ప్రెషర్ వచ్చి 1992 నవంబర్ 7వ తేది 8 గంటలకు మరణించింది. నా క్షేమం కోరుతూ మీ కంటే ముందు నేను పోవాలి అని అంటుండేది. అదే నిజమయింది. మంచి ఆర్టిస్టు, డబ్బింగులు మనోరమకు ఎక్కువగా చెప్పింది.

శ్రీకాళహస్తీ మహాత్మ్యం, శాంతినివాసం, పేరిగాడు రాజంట, అల్లూరి సీతారామరాజు (డాక్టర్ రాజారావుగారు)లో నటించింది. ప్రపంచ చరిత్రలో ఏ నటుడికి జరగని సంఘటన నాకు జరిగింది. నేను ప్రయాణం అయి వేళ్ళేప్పుడు ప్రమీల బుట్టలో క్యారియర్ పళ్లుపెట్టి పంపించేది. అదే బుట్టలో ఆమె అస్థికలు పెట్టుకొని అనకాపల్లి దగ్గర 'చింతామణి' నాటకంలో సుబ్బిశెట్టిగా నటిస్తూ ప్రేక్షకులను నవ్విస్తున్నాను. ఆమె ఆత్మ నాలో వుంది! అస్థికలు వెనుక స్టేజిలో వున్నాయి!

అక్కినేని గార్లతో నాటకాలు వేశాం. 1977 లలో దివిసీమ తుఫాను బాధితులకోసం 'పేరిగాడు రాజంట' నాటకం వేశాం.

'పేరిగాడు రాజంట' నాటకం యజ్ఞన్న శాస్త్రిగారు వ్రాశారు. నేను శ్రీ వడ్డాదిగారితో పాటలు పద్యాలు రాయించి అవి కలిపి 3 గంటల నాటకంగా చేశాను. పేరిగాడు పాత్ర ద్వారా నేను అందించిన హాస్యం ప్రేక్షకులను ఆకట్టుకుంది. 40 ప్రదర్శనలు వేశాను. ఈ నాటకంలో నా హీరోయిన్ లచ్చిగా ప్రమీలారాణి వేశారు.

సుందరకాండ 'హరికథ' రూపంలో 1 గంట ఆడియో క్యాసెట్ H.M.V. ద్వారా 1996లో


'శ్రీ కాళహస్తి మహాత్మ్యం'లో రాజ్‌కుమార్‌తో పద్మనాభం

విడుదల అయింది. హరిదాసుగా నేనే గానం చేశాను. రచన : వడ్డాది, సంగీతం : ఘంటసాల విజయకుమార్.

ప్రజలకు చేరువ కావడానికి టివి ఇంకో మంచి సాధనంగా తయారయింది. అనేకమంది కళాకారులకు ఆశ్రయం కల్పించింది. నేను సింగిల్ ఎపిసోడ్ 'గయ్యాళి భార్య' తీశాను తరువాత యాదగిరిగుట్ట ప్రొడ్యూసర్స్ ' నా చేతి మాత్ర వైకుంఠయాత్ర', ధర్మవరపు సుబ్రమణ్యం రచనలు, 'అనగనగా ఒక శోబ' సెవెన్ స్టార్స్ ప్రభు దర్శకత్వంలో తీశారు. నేను ప్రదీప్,శిల్ప నటించాం. వరకట్నం సమస్యలు చాలా చక్కగా డీల్ చేశారు. గాద్రేజ్ వాళ్లు స్పాన్సర్స్ చేసిన ఈ సీరియల్ - దూరదర్శన్ హైదరాబాద్ ద్వారా ప్రథమంగా ప్రసారమైన సీరియల్!


'గోల్‌మాల్' సినిమాలో బామ్మ పాత్రలో...

రాడన్ వారి 'ఇది కథ కాదు' లో హరిదాసుగా పాటలు, పద్యాలు పాడే అవకాశం ఇచ్చారు-జయ సుధ 'జనని' రాడన్ వారి ' శ్రీమతి' లో కూడా నటించాను.

ప్రస్తుతం పి.యన్.రామచంద్రరావుగారి దర్శకత్వంలో 'గోల్‌మాల్' చిత్రంలో బామ్మ వేషం వేశాను. బాగా వచ్చింది. మొదటి షెడ్యూలుకు హైదరాబాద్ వెళ్లాను. రామచంద్రరావుగారు బామ్మగారి గురించి చెబుతూ సహజంగా వుండాలంటే గుండు గీయించాలని చెప్పారు. త్యాగయ్య, శ్రీకాళహస్తి మహాత్మ్యం, షావుకారు, పాతాళభైరవి, గుర్తుకొచ్చాయి.


'షావుకారు' చిత్రంలో ఎన్టీఆర్‌తో

సెట్‌లోనే గుండుగీయించి బామ్మగా కళ్లజోడు, చీరకట్టుకొని ముసుగు వేసుకుని జె.డి.చక్రవర్తి, బ్రహ్మానందం, గుండు హనుమంత రావు, గిరిబాబు, తోటపల్లి మధు (రచయిత), రమేష్ అరవింద్‌ల ఎదుటకు వెళ్ళే సరికి అందరూ నవ్వారు. కో డైరెక్టర్ నరసింహరావు, ప్రొడక్షన్ గంగాధర్, బాలిరెడ్డి, కెమెరా ఎమ్.వి.రఘు అందరూ ఆనందాన్ని వ్యక్తం చేశారు.

ఇదే బామ్మ వేషాన్ని ఆధారం చేసుకొని 'బామ్మ' టైటిల్‌తో టివి సీరియల్ చేయాలనే సంకల్పంతో ఉన్నాను. మీ ఆశీర్వాదంతో 'బామ్మ' ఆబాలగోపాలాన్ని అలరిస్తుందని నా నమ్మకం.

ఊపిరి వున్నంతవరకు నటుడిగానే జీవించి 8 కోట్ల ఆంధ్రులను నవ్విస్తూనే వుండాలి. నటుడికి రిటైర్‌మెంట్ లేదు. మానవుడు ఏడుస్తూనే పుడతాడు, ఏడుస్తూనే మరణిస్తాడు. నూరేళ్ల జీవితకాలంలో నవ్వుతూ నవ్విస్తూ నవ్వు కొనేదే హాస్యవల్లరి, హాస్య ప్రపంచం, హాస్యాభిషేకం. 1943 నుంచి 2003 వరకు 60 ఏళ్ల నా నట జీవితానికి ప్రాణం పోసిన ఎందరో మహానుభావులు, అందరికీ "హాసం" ద్వారా పద్మాంజలి ఘటిస్తున్నాను.

యిటీవల ఆలిండియా రేడియో శ్రీమతి పద్మజ, నీరజ నా ఆత్మకథ ఆర్కైయివ్స్‌లో భద్రపరచడానికి మూడున్నర గంటలు టేప్ చేశారు. డిసెంబర్ 2న 1 గంట బ్రాడ్‌కాస్ట్ చేశారు.

Duty is God, God is Love, Love is Life కళ గొప్పది. నన్ను ఒక నటుణ్ణి చేసి డబ్బు, కీర్తి ప్రతిష్టలకు దోహదం చేసిన నిర్మాతలు, దర్శకులు, తోటి నటవర్గానికి సాంకేతిక వర్గానికి జోహార్లు అర్పిస్తూ నా ''ఆత్మకథ''ను ధారావాహికగా పాఠకులకు అందించిన 'హాసం' పత్రికయాజమాన్యానికి, సంపాదకవర్గానికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు అర్పిస్తున్నాను. ఈ ఆత్మకథను చదివి ఆనందించే పాఠకలోకానికి ఆజన్మం ఋణపడి వుంటాను.

అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ

మీ...

పద్మనాభరావు

నెం.12, నాగార్జున నగర్, ఫస్ట్ స్ట్రీట్,
రంగరాజపురం, చెన్నై -600 024

ఫోటో కర్టెసీ: సంజయ్ కిశోర్



**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజి మోసం చేస్తున్నాడని గమనించి అతని కూతురు సరళతో ప్రేమ నటిస్తుంటాడు. విజయ్ స్థానంలో వచ్చిన అజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో బావ బుజ్జిని బెదిరిస్తాడు. బుజ్జి భార్యను కలవడానికి చాటుగా వస్తూంటాడు. మోటారు మెకానిక్‌గా పని చేస్తున్న అజయ్‌కు తన కొలీగ్ ప్రకాష్ చెల్లెలు పద్మతో పరిచయం అవుతుంది. తన బర్త్‌డే ఫంక్షన్‌కి ఆహ్వానించడానికి వచ్చిన సరళతో విజయ్ చనువుగా మాట్లాడడం గమనించి అజయ్ మేనత్త మందలిస్తుంది. సరళ పెట్టుకువచ్చిన నెక్లెస్ కనబడకుండా పోయిన అజయ్ తల్లి జవహారీలోదని గ్రహించి అలా ప్రేమ నటించానని విజయ్ చెప్తాడు (ఇక చదవండి)



# అన్నపూర్ణావారి ఇద్దరు మిత్రులు

## సీరియల్ - నెం 11



**రచన : ముళ్లపూడి వెంకటరమణ**

"సరే, నటనే అయితే ఫరవాలేదు. కానీ జాగ్రత్త సుమా. ఆడపిల్లల హృదయాలతో ఆడుకోవడం, నిప్పుతో చెలగాటం లాంటిది" అంది.



విజయ్ చెలగాటం ఆడుతున్నది ఆడపిల్లల హృదయంతోటో, తన హృదయం తోటో, అతనికే తెలియలేదు. అజయ్, సరళని ప్రేమించాడనిగాని, నిజంగా పెళ్ళాడబోతున్నాడనిగాని అనుమానించడానికి ఆస్కారంలేదు. లేదని విల్లు చదివిననాడు అత్తయ్య అన్నమాటలలో తేలిపోయింది. అజయ్ ఇల్లువదిలి వెళ్ళి ఇన్నాళ్ళయినా, ఎన్నడూ సరళ గురించి అడిగిన పాపానపోలేదు కాని సరళ మాత్రం అజయ్‌కి మనసిచ్చింది. తనని అజయ్ అనుకునే, తనతో ఆప్యాయంగా మాట్లాడుతోంది. ఆపేక్ష చూపెడుతోంది, తన అభిప్రాయాలూ, అభిరుచులూ అన్నిటినీ ఆమోదిస్తోంది. రేపు తాను అజయ్‌కాడనీ, విజయ్ అనీ తెలిస్తే ఏమవుతుంది? డబ్బా, పేరులో ఒక్క అక్షరం, మినహాయిస్తే అజయ్‌కీ తనకి ఇంకెందులో తేడా చూపెడుతుంది? నిజం తెలిశాక తనని నిరాకరిస్తే, ఆమె అజయ్‌ని కాక అతని డబ్బునే ప్రేమిస్తోందా? అది తెలుసుకుందికే తను ఇప్పుడు ప్రయత్నిస్తున్నాడు. ఆమెకు డబ్బు ఆశ ఉందని తేలితే, అజయ్ ఆమెను స్వీకరించే అవకాశం బొత్తిగా వుండదు. తనూ అంతే చేస్తాడు. అలాకాక, ఆమె అజయ్‌నే ప్రేమిస్తోందని తేలితే, నిజానికి తనని ప్రేమించినట్లు అవుతుంది. తమ రహస్యం తెలిసిన తరువాత కూడా...గాడ్! వాటీజిన్ నేమ్ అని చూసి చూసి ఎలా అన్నాడు షేక్స్‌పియర్? పేరులో ఏం లేకపోవడం ఏమిటి?...



తను పత్తేదారీ పనికి వడిగట్టటం ఆమెను ఒక రకంగా వంచించడం. కాని ఈ లోపల తన హృదయం తనను వంచించి ఆమె వశం అయిపోతోంది.

పుట్టినరోజు పండగ వేడుకలు బ్రహ్మాండంగా జరిగాయి. అనుకున్న ప్రకారం సరళ స్వయంగా వచ్చి అజయ్‌ని తన యింటికి తీసుకువెళ్ళింది. భానోజీగారు రివాజైన గౌరవంతో కాక, ఆప్యాయంగా చనువుగా స్వాగతమిచ్చి, మర్యాద చేశాడు. టీ పార్టీ అయ్యాక, "టీ ఫర్ టూ"కి ఆగాడు విజయ్. తరవాత ఇష్టాగోష్ఠి. భోజనం కూడా అక్కడే చేశాడు వాళ్ళ బలవంతం మీద. అజయ్ అన్నట్టు, విషం పెడతారని భయపడేందుకే మాత్రం ఆస్కారంలేదు. విజయ్‌కి ఆనాటి మాట గుర్తొచ్చి నవ్వుకున్నాడు కూడా. సరళ పుట్టినరోజు పండగ గదా పున్నమి చంద్రుడు కూడా ఉదయించాడు. ఎక్కడో కోకిల కుహూకుహూ అంది... కోకిలా? సరళ కంఠమా?...



**ఓహో ఓహో నినే కోరెగా**

**కుహూ కుహూ అనీ కోయిలా...**

అంది సరళ మనోహరంగా

విజయ్ కూడా గొంతెత్తి పాడాడు.

"అదా కోరికా? వయారి కోయిలా?" అంది అతని కంఠం.





**ఒహో నినే కోరెగా - కుహూ కుహూ అనీ కోయిలా**
**వసంత వేళలా-పసందు మీరగా**
**అపూర్వ గానమే-ఆలపించె తీయగా**
**అదా కోరిక-వయారి కోయిలా**
**జగాలె నీ చూపులో జలదరించెనే**
**వరాల నవ్వులే-గులాబి పువ్వులై**
**వలపు తేనె నాలోన-చిలకరించెనే**
**ఫలించె నేను కన్నకలలు-తీయ తీయగా**
**సుఖాలలో సోలిపో-హాయిహాయిగా**
**ఉయాల లూగె నా మది-చిటారు కొమ్మలా**
**నివాళి అందుకో ఈవేళ పండుగా**
**సదా సుధాతరంగాల తేలిపోదమా**
**ఒహో ఒహో నినే కోరితీ-కుహూ కుహూ అనీ పాడితి.**

***

కృష్ణాగరాజ్ వర్క్స్ సందడిగా పనిచేస్తోంది. మధ్యాహ్నం భోజనాలవేళ అవుతూవుండగా, పద్మ వచ్చింది, అన్నయ్యకోసం వెతుకుతూ. ఓ కారు అడుగున పడుకుని ఏదో రిపేరు చేస్తున్నాడు.

"అన్నయ్యా! అన్నయ్యా!" అంది పద్మ- ఉత్సాహంగా అన్నయ్య కాళ్ల దగ్గర నిలబడి.



"ఊ!"

"హమ్మ ఆఖరు పేపరు కూడా బాగా రాశానన్నయా!"

"ఊఁ"

"ఏదీ పార్టీ ఇస్తానన్నావ్, సినిమాకి తీసుకు వెళతానన్నావు?"

"ఊఁ"



పద్మ అటూ ఇటూ చూసి, కొంచెం ముందుకు వంగింది.

"అన్నయ్యా! మరీ, మనిద్దరమే వెడదామా, మీ ఫ్రెండ్ విజయ్‌ని కూడా పిలుస్తావా?" అంది కొంచెం నెమ్మదిగా.

"ఊఁ"



"అబ్బా! ఏమిటా ఊఁఊఁలు? బైటికి రా అన్నయ్యా!-"

కారుకింద శాస్త్రీ ఇవతలికి జరిగి లేచి నిలబడి ఇకిలించింది.

"మీరా! మహాశయా!" అంది పద్మ విస్తుబోయి.



అజయ్-మహాశయుడు, ఘనకార్యం చేసిన వాడిలా నవ్వాడు.

"ఏమిటి వేషం?" అంది పద్మ కొంచెం అలిగి.

"ఏం చేస్తాం. రెండు గంటలనించీ కారుకింద పని, గాలి పీల్చుకోవడానిక్కూడ వీల్లేకుండా. కాస్త దమ్ముకొడితేగాని మనకి బుర్రపని చెయ్యదు" అంటూ తన చేతులు చూసుకొని, "కాస్త సిగరెట్ పాకెట్ తీస్తారా" అన్నాడు తన జేబు చూపించి.



"ఇదో చాకిరీ కూడానా" అంటూ పద్మ ఆ చాకిరీ చేసింది.

"ఒక్క సిగరెట్" అన్నాడు అజయ్.



ఆమె గోముగా చూసి పెట్టె తెరచి ఒక సిగరెట్టు తీసి నోటికి అందించింది.

"కాస్త నిప్పు ముట్టించండి."

"ఇదీ పెట్రోలు బంకు-మీ ఇల్లు కాదు!" అంటూ అతని నోట్లో సిగరెట్ లాగి విసిరేసింది పద్మ.



"ఐ.సీ. మీ యిల్లా?" అన్నాడు అజయ్ పెంకెగా.

పద్మకేమనాలో తోచక దిక్కులు చూడబోయే వరకు మీనా కనబడింది.

"చూశావా మీనా - మీ అన్నయ్యను ఇంట్లోనే ఎరిగుంటావు. ఇవతలకొచ్చి ఎంతల్లరి చేస్తాడో చూడు" అంది.



"ఏమిటన్నయ్యా? అది?... అన్నట్టు పద్మా, నీకు కాలేజీకి టైమవటంలేదూ?"

పద్మ కిల కిల నవ్వింది. "ఇంకా, కాలేజీ ఏమిటీ, పరీక్షలు అయి పోయాయి ప్రాణం హాయిగా ఉంది" అంది-పరీక్షలు అయిపోయిన వాళ్ళకి మల్లే హాయి నటిస్తూ.



"అయితే, ఇవాళ మా యింటికి భోజనానికి రావాలి నువ్వు, కాసేపు కులాసాగా కబుర్లు చెప్పుకుందాం" అంది మీనా.

"గుడ్ ఐడియా" అంటూ చెల్లెలి మేధా సంపత్తికి ఉప్పొంగిపోయాడు అజయ్.



"థాంక్స్...నువ్వు పిలిచావు కాబట్టి వస్తాను" అంది పద్మ-'విజయ్'కేసి వోరకంట చూస్తూ.

"అయితే, నే పిలిస్తే రావన్న మాట" అన్నాడు అజయ్.

"నో ప్లీజ్."

"థాంక్స్."

"రా అన్నయ్యా భోంచేద్దాం" అంది మీనా నవ్వి.

* * *

సాయంకాలం అన్నాచెల్లెళ్ళిద్దరూ విందు భోజనం భారీ ఎత్తున తయారు చెయ్యడానికి ఉపక్రమించారు. అజయ్‌కి వండడమే కాదు, తినడం కూడా బాగా చేతకాదు పూర్వాశ్రమంలో. తినాలని ఉన్నా తిననిచ్చేవారుకారు. పిడతకింద పప్పు, మిరపకాయ బజ్జీలు, చిన్న హోటళ్ళలో పెసరట్లు వంటి చిరుతిళ్ళ గొప్పతనాన్ని కొందరు కీర్తించిగా విని, తిని చూడాలనుకున్నాడు ఒకప్పుడు. కాని, అంతస్తూ, ఫాయాలాటివి అడ్డొచ్చాయి. ఇప్పుడా ముచ్చటలన్నీ తీరుతున్నాయి. చెల్లెలు వంట చూడబోవడంవల్ల, ఆ శాస్త్రంతో ముఖ పరిచయం అయినా కలిగింది. ఆ ధీమా కొద్దీనే, పాయసంలో డబ్బాడు పంచదార గుమ్మరించి, గరిటపెట్టి ఝూమ్మని తిప్పేశాడు.

"అన్నయ్యా, అంత పంచదారే! తీపి ఎక్కువై పోదూ!" అంది మీనా, మృదువుగా.

"తీపికి ఎక్కువేమిటి, తక్కువేమిటి; తీపి తీపే" అంటూ- తనుకావాలనే, శాస్త్రం తెలిసే అంత వేశాడనడానికి దాఖలాగా, మరి కాస్త తగిలించాడు అజయ్.

మీనా కిలకిల నవ్వింది- "ఇహ ఆ పాయసం మనుషులు తిన్నట్టే" అంటూ.

ఆ కిలకిల మీద గాజుల గలగలలాటిది వినబడి, గదిలో **45** కాండిల్ పవర్ బల్బు, హఠాత్తుగా వెయ్యి కాండిల్స్‌గా మారి, వెలుగు జిమ్మినట్టు కనబడి, తలెత్తి చూశాడు అజయ్- ఎదురుగా గుమ్మంలో పద్మ నించుంది, మందహాసం చేస్తూ.

"ఊఁ కరెక్ట్. ఇది మనుషుల కోసం కాదు; దేవతల కోసం" అంటూ రుచి చూసి, "అమృతం, అమృతం" వెల్లడించాడు.

"మీనా, దేవతలకు నైవేద్యం పెట్టకుండా మనుషులు రుచి చూడకూడదని చెప్పు" అంటూ, లోపలికి వచ్చింది పద్మ.

"మీనా! దేవత ఇంట్లో ప్రవేశించింది. ఈ మానవుడు నిష్క్రమిస్తున్నాడు" అంటూ, గరిట కిందపడేసి బయటికి పోబోయాడు అజయ్.

"అదేమిటన్నయ్యా, భోజనానికి వేళైతే!"

"దేవతలకు నైవేద్యమైన తరువాతేగా మానవులు భోంచేసేది? నాకు అర్జంటు పనుంది, వెళ్తున్నాను. నేను రావడం ఆలస్యం అయితే దేవతలకు నైవేద్యం పెట్టు."

"అలాగే మానవుడా, నిష్క్రమించు" అంది పద్మావతి నవ్వుతూ.

అజయ్ వెళ్ళగానే, "ఏం పద్మా, నీకు వడ్డించమంటావా?" అంది మీనా.

పద్మ ఫకాలున నవ్వింది. "బాగుంది. మొగాళ్ళ కన్న ముందు మనం తిని కూర్చోడమా!... మీ అన్నయ్యను కూడా రానీ. అందరం కలిసే భోం చేద్దాం" అంది.



అర్జెంటు పని అని వెళ్ళిన అజయ్, అరగంట యినా రాలేదు. పద్మ, మీనా వంట ముగించి, డాబా మీదకి వెళ్ళి కూర్చున్నారు.

చంద్రుడుదయించాడు. మందిరంలో భజన జోరుగా జరుగుతోంది. ప్రసాదం కోసం అని ఓ కొబ్బరికాయ తీసి కొట్టాడు. దాసుగారు కళ్ళకు అద్దుకోబోయి, హౌరా అని కిందపడేశాడు.



"రామా! రక్షకా! సామెత చెప్పినట్టు ఏమిటయ్యా, ఈ పరీక్ష! కుళ్ళిపోయిన కొబ్బరి కాయతో భక్తుల కెలాగ ప్రసాదం పెట్టమంటావు?.. దయలేదా తండ్రీ! ఇక తరుణోపాయం ఏదో నువ్వే చూపించాలి" అన్నాడు దీనంగా.

రాముడు కరుణాళువు. 'ప్రసాద'గుణా కరుడు! దాసుగారిమాట విన్నట్టే ఉన్నాడు. ఎందు కంటే, ఇంచుమించు ప్రార్థనచేసి, దాసుగారు కళ్ళు తెరిచేసరికి బల్లమీద ఆపిల్ పళ్లు, అరటి పళ్లు అమర్చి ఉంచాడు.



"ఆపిల్‌పళ్ళే?" అన్నారు రామదాసుగారు ఆనందో ద్వేగంతో.

"నాన్నా వీళ్ళెక్కడ?" అన్నాడు, ఆ పళ్లు తెచ్చి కిటికీలో పెట్టిన అజయ్.



నాన్నది మాలోకం. ఆయన ప్రసాదం గురించి పొంగి పోతున్నాడు. అజయ్ ప్రశ్నకి జవాబన్నట్టు మేడమీద నుంచి వీణానిక్వాణం, మధురమంజుల గాత్రం, పరిమళభరితమయిన తరంగాల మీద ఎక్కి, కిందికి దిగి వచ్చాయి.



మంత్రముగ్ధుడిలా అజయ్ నెమ్మదిగా మెట్ల వేపు వెళ్లాడు.

లోకోత్తరమైన కంఠంతో, ఎవరో గంధర్వాంగన పాడుతోంది. అజయ్ తన్మయుడైపోయాడు. ఒక్కొక్క మెట్టే ఎక్కి ఇదే స్వర్గం అనుకుంటూ నెమ్మదిగా పైకి వెళ్ళాడు. మీనా వీణ వాయిస్తోంది, పద్మ పాడుతోంది.

**పాడవేల రాధికా-ప్రణయసుధా గీతికా**
**ఈ వసంత యామినిలో-ఈ వెన్నెల వెలుగులలో**
**జీవితమే పులకించగ-నీ వీణను సవరించి ॥పాడ॥**
**గోపాలుడు నిను వలచి-నీ పాటను మది తలచి**
**ఏ మూలనో పొంచి పొంచి-వినుచున్నాడని యెంచి ॥పాడ॥**
**వేణుగానలోలుడు నీ-వీణామృదురవము వినీ**
**ప్రియమారగ నిను చేరగ-దయచేసెడి శుభవేళ**

పాట పూర్తి కావచ్చినవేళకి హర్షాతిరేకంతో, అజయ్ కూడా గొంతెత్తి శ్రుతి కలిపి పల్లవి గలిపాడు.

**ప్రణయసుధా గీతికా**
**పాడవేల రాధికా...**

అన్నని చూడగానే మీనా, వీణ క్రిందపెట్టి దిగ్గున లేచింది. "నువ్వా ఎంతసేపయిందీ వచ్చి?"



"సరిగ్గా సమయానికే వచ్చాను. అద్భుతంగా ఉంది పాట. అమృతవర్షం" అన్నాడు అజయ్ పద్మవంక చూస్తూ.

"మీనా, వచ్చిన వాళ్ళు అంత దొంగచాటుగా వినడం దేనికే?" అంది పద్మ వయారంగా సిగ్గు పడుతూ.

"ఎదుటపడితే సిగ్గుపడే వాళ్ళ పాట, దొంగ చాటుగానే వినాలి!"

"థాంక్స్... నేను మీతో మాటాడలేదు - మీనాతో" అంది పద్మ.

"థాంక్స్. నేనూ మీనాతోనే అన్నాను!"



మీనా పకపక నవ్వింది. "భలే! అన్నయ్యా! ఆ పోట్లాడేదేదో మీరు ముగించుకొని కిందకిరండి. ఈ లోపుగా నేను వడ్డన ఏర్పాట్లు చేస్తాను" అంటూ కిందకి వెళ్ళిపోయింది.

మెట్లమీద - పోట్లాట కాకపోయినా, మాట్లాటకు మరో ఆసామీ సిద్ధంగా ఉన్నాడు. వెనక్కి చూస్తూ హడావుడిగా దిగుతున్న మీనా అతన్ని ఢీకొట్టి, గతుక్కుమని, చూసి తలవంచుకొని "మీరా!" అంది.



"ఔను. నేనే. మీనా! ఏం వాయించావు వీణా!..." అన్నాడు బుజ్జి. మీనా సిగ్గుపడి, తప్పించుకు పోబోయింది.

"పాడవేల రాధికా?" అంటూ బుజ్జగించ బోయాడు బుజ్జి.



"వేళాపాళా లేదూ...పైన అన్నయ్య...ముందు దారి ఇవ్వండి" అంది మీనా- అతన్ని భయపెడుతూ, తను భయపడుతూ.

"మీనా మీనా, ఇంటల్లుడిని, వంటలో కాకపోయినా వడ్డనలోనైనా సాయపడనియ్యి" అంటూ, ఆమె వెంట వంటింటివేపు పరుగెత్తాడు బుజ్జి.

మీనా మేడదిగగానే, అక్కడ పోట్లాట హఠాత్తుగా అయిపోయింది. స్నేహం వెల్లివిరిసింది. కోపం, తన నెవరూ ఆదరించలేదని అలిగి వెళ్ళిపోయింది. సిగ్గు, సిగ్గుపడి నాలిక్కరుచుకుని వెనక్కి తగ్గింది.



"పద్మా ఎంత మధురంగా పాడావు!"

"నిజం? అంత నచ్చిందా మీకు?"

"నచ్చడమా. ఇవుడు నేనెక్కడున్నానో తెలుసా?" అన్నాడు అజయ్ ఆకాశంకేసి చూస్తూ.

"ఈ డాబా మీద" అంది పద్మ అతనికేసి చూస్తూ.

"హూఁ అందుకే మీ ఆడవాళ్ళకి భావనాశక్తి తక్కువంటారు. నీ గాన మాధుర్యంలో తన్మయుడనై అలా-అలా తేలిపోయి, ఏదో స్వప్నలోకంలో విహరిస్తున్నాను."

"అయితే భోజనం అక్కడికి పంపించ మంటారా?" అంది పద్మ "డాబా మీది నుంచి" వంటింటికి దిగిపోతూ.

"అబ్బే ఎందుకు నేనే దిగొస్తున్నాను- ఒక్క షరతు మీద."

"ఏమిటో!"

"ఇలాగే ఎప్పుడూ నీ పాట వింటూనే ఉండాలి" అన్నాడు. అజయ్ మళ్ళీ స్వప్నలోకాని కెగరబోతూ.

"అయితే, గ్రామఫోను రికార్డు ఇస్తాను. ఎప్పుడూ విందురుగాని"

"నో!నో! ఆ పనిమాత్రం చెయ్యొద్దు" అన్నాడు అజయ్, స్వప్నలోకంలోంచి డాబామీదకి పులికి పడుతూ, "ప్రతి కాఫీ హోటల్లో, కిళ్ళీ దుకాణంలో ఆ రికార్డే పెడతారు. ఊళ్ళోవాళ్ళంతా వింటారు. అది మనం భరించలేం."



"ఏమో!"

"నీ గానం ఒకే ఒక అదృష్టవంతుడి హక్కుగా నిలచిపోవాలి."

"ఎవరా అదృష్టవంతుడు!" అంది పద్మ- ఎవరో తెలుసులే అన్నట్టు చూస్తూ.

"నేనే" అన్నట్టు తల తాటించాడు అజయ్- పునరుక్తి దోషం పట్టినా సరేనని.

"అబ్బా, ఎంత స్వార్థం!" అంది పద్మ మనోహరంగా నవ్వి.

**(ఇంకావుంది)**



❒ ఈ చిత్రంలో అజయ్ పాత్ర (నాగేశ్వరరావు)కి తన తండ్రి మరణవార్త తన సిబ్బంది ద్వారా తెలుస్తుంది. ఆ దృశ్యంలోని పాత్రధారులందరూ దుఃఖించే సన్నివేశమది. వారిలో శ్రీ అల్లు రామలింగయ్యగారున్నారు. తనకు కళ్ళజోడు వున్నదన్న సంగతి మరచిపోయి,కళ్ళజోడు తీయకుండా కళ్ళుతుడుచుకున్నారాయన (ఆ రోజుల్లో గ్లేర్ రాకూడదని కళ్ళజోడుకు అద్దాలు తీసేసేవారు). అది గమనించిన తరవాత ఆ షాట్ మళ్ళీ తీసారు సవ్యంగా.

❒ ఇదే చిత్రంలో నౌకరు పాత్రను ప్రఖ్యాత రంగస్థల నటుడు, ప్రయోక్త శ్రీ కె.వెంకటేశ్వరరావుగారు ధరించారు. ఆ పాత్ర మూగది కాని, ఆయన రోజూ ఆఫీసుకు వచ్చి దృశ్యం విని, ఆ దృశ్యంలో (తన వాచికానికి బదులు) ఆంగికం నిర్ణయించుకునేవారు. ఆ నటన రిహార్సల్స్ చేసేవారు.

**-స్వామి చిత్రానంద**

చెన్నై






ఓ చిత్రం షూటింగ్ జరుగుతోంది. ఆ చిత్ర దర్శకుడి చేతిలో చిన్న చిన్న పాకెట్స్ ఉండటం చూసి "డైరెక్టర్‌గారూ! మీ చేతిలో ఆ పాకెట్స్ ఏమిటి?" అని అడిగాడు నిర్మాత.

"మీరే కద్సార్! మన చిత్రంలో అన్ని మసాలాలూ ఉండాలన్నారు.అందుకనే ఆంధ్రా..తమిళనాడు... కర్ణాటక..గుజరాత్ రాష్ట్రాల నుండి మసాలాలు తెప్పించాను" అంటూ బదులిచ్చాడా దర్శకుడు గొప్పగా.



"మీ ప్రేమ వివాహానికి నా బొందిలో ప్రాణం ఉన్నంత వరకు అంగీకరించను గాక అంగీకరించను" అన్నాడు ఓ తండ్రి కొడుకుతో.

"ఓకే డాడీ. అలానే మీరో చిన్న విషయం చెప్తారా?"

"ఏమిటది?"

"మీ బొందిలో ప్రాణం ఎంతవరకు ఉంటుందో కొంచెం ముందుగా తెలిస్తే ఆ ప్రకారం ప్లాన్ చేసుకుంటాం".



ఓ పల్లెటూరి ఆసామి మొదటిసారిగా ఫోన్ చేయడానికి వెళ్ళాడు. అవతలి నుంచి టెలిఫోన్ ఆపరేటర్ "మీరు లైన్లో ఉండండి" అన్నాడు.

"క్షమించాలి. ఇక్కడ లైనేమీలేదు. ఫోన్‌కాడ నేను ఒక్కడినే.." అంటూ చిరాగ్గా చెప్పాడా పల్లెటూరు ఆసామి.

"డాక్టర్! నా కంటి చూపు బాగా మందగించింది. దగ్గరగా వున్న వస్తువులు కూడా కనిపించడం లేదు"

"అలా అయితే ఉదయం సాయంత్రం ఈ డ్రాప్స్ వాడండి"

"అప్పుడు నా కంటి చూపు బాగుంటుందా డాక్టర్?"

"మీ చూపు సంగతి ఏమోగాని నా బిల్లు మాత్రం కనిపిస్తుంది".



ఓ మతిమరుపు వ్యక్తి ఓ డాక్టర్ దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకున్నాడు. తన మతిమరుపు తగ్గినా సరే తగ్గలేదని చెప్పి డాక్టర్ ఫీజులేకుండా చేసుకోవాలని



"ఏంటి డాక్టర్! మీ ట్రీట్‌మెంట్ తర్వాత కూడా నా మతిమరుపులో ఏ మార్పు కనిపించడంలేదు" అన్నాడు.

"మీరు భలేవారే. మీ మతిమరుపు తగ్గకపోవడమేమిటి? మీ యావిడ వెంట లేకుండా మీరు నా దగ్గరకు రాగలిగారుగా.." అన్నాడా డాక్టర్ తెలివిగా.



"మమ్మీ! నేనీ కాలేజీ మానేసి వేరే కాలేజీలో చేరదామను కుంటున్నాను".

"ఏం ఇక్కడ అబ్బాయిలు వెంటపడుతున్నారా..?"

"ఊహు! లేదు".

"మరి !?"

"అలా నా వెంట పడకుండా నా స్నేహితురాళ్ళు అడ్డుతగులు తున్నారు" అంది కూతురు చిరాగ్గా.

ఈ జోక్‌లను పంపినవారు :
బి.వి.యస్.బాబు, తెనాలి.






"మగవాడికి ఆడదానికి తేడా ఏమిటోయ్?"

"మగవాడు అవసరమయితే రూపాయి వస్తువు రెండు రూపాయలకైనా కొంటాడు అదే ఆడదయితే రెండు రూపాయల వస్తువును రూపాయికి కొంటుంది" అవసరంలేక పోయినా!



"హీరోయిన్‌ను చూస్తుంటే కొంచెం వయస్సు పైబడ్డ దానిలా కనబడుతున్నదే?"- హీరో అనుమానం

"అవును ఆవిడ పదేళ్ల క్రితం హీరోయిన్‌గా వెలుగొందుతున్నప్పుడు ఇచ్చిన కాల్‌షీట్ నాయనా ఇది" - నిర్మాత సమాధానం.



"ఒరే రమేష్, నీతో మాట్లాడుతుంటే.... టైమ్ గడచినట్లు లేదురా"

"నువ్వు మాట్లాడం మొదలుపెట్టి రెండు గంటలయ్యిందిరా! ఎటొచ్చి కొత్త బ్యాటరీ వేయక పోవడం వల్ల వాల్‌క్లాక్ పనిచేయడం లేదు అంతే"



"థియేటర్‌లో కాకుండా వేరేచోట శతదినోత్సవం జరుపుకున్న సినిమా మాదొక్కటే"

"ఎక్కడేంటీ!?"

"సెన్సారు ఆఫీసులో..."



"మా సినిమాకి ఫోటో స్టూడియోలో పనిచేసే వాడిని కెమెరామెన్‌గా పెట్టుకుని పొరపాటు చేసాం" అన్నాడు దర్శకుడు

"ఏమయ్యిందేమిటి?" అడిగాడు విలేకరి

"హీరోయిన్ ఏడ్చే సీన్‌లో కూడా 'స్మైల్! స్మైల్!' అని అరుస్తున్నాడు" బాధపడ్డాడు దర్శకుడు.



"మనదేశానికి స్వతంత్రం ఎప్పుడొచ్చిందిరా?"

"నేను పుట్టకముందే వచ్చిందండి. కావాలంటే 1947 ఆగష్టు 15వ తేదీ ముందే నేను పుట్టానో లేదో మన స్కూలు రికార్డ్సు వెరిఫై చేసుకోండి"



"ఆర్టిస్టుగారూ! నా బొమ్మ గీసి పెట్టాలండి. అచ్చం నాలాగే వుండాలి; బావుండాలి" అంది హీరోయిన్

"రెండిట్లో ఏదో ఒకటి మాత్రమే కుదురుతుంది. బాగా ఆలోచించు కుని చెప్పండి" అని అన్నాడు నిర్మొగమాటియైన ఆర్టిస్టు.



"మీ నాన్నగారేం చేస్తుంటారు?"

"మా అమ్మగారేం చెప్పినా చేస్తుంటారండి"

ఈ జోక్‌లను పంపినవారు :
పి.వి.మురళీకృష్ణ, పి.సురేష్ కుమార్, హైదరాబాద్.

# వైణికసార్వభౌమ పొడుగు రామమూర్తి

**(1871-1942)**

కళాకారుడు స్వేచ్ఛాజీవి!

వాడిదొక ప్రత్యేక రాజ్యం....ఇష్టారాజ్యం!!

స్వేచ్ఛగా ఆలోచిస్తాడు...అందులోంచే సృజనాత్మక శక్తి ఆవిర్భవించీ సామాన్యులకు అనుభవంలోకి రాని సంగతుల్నీ...కొత్త కోణంలో ఆవిష్కరిస్తాడు...ఆశ్చర్యపరుస్తాడు... ఆనంద పరుస్తాడు... తృప్తిగా నిట్టూరుస్తాడు!!

మొట్టమొదట కావాల్సింది!... స్వేచ్ఛ!!

అంచేతే అన్నారు...

"బెదిరించి ఓ సింహాన్ని బంధించగలవేమోగానీ

శాసించి ఒక్క పూవును కూడా వికసింప చెయ్యలేవు" అని.

అయినా కళాకారుడు ఏమడిగాడనీ... స్వేచ్ఛగా ఉండనిమ్మన్నాడు, నా యిష్టానికి నన్నొదిలెయ్యండయ్యా...ఆ తర్వాత నా మనసున్రాల్చే పారి జాతాలు ఏరుకోండీ అన్నాడు..!

ఆహఁ...వాణ్ణి బంధించి వాడి మెదడుని గాజు సీసాలో వేసి దాన్నించి అద్భుతాల్ని పిండు కుందామంటే ఎలా వస్తుంది!!

బంగారు పంజరంలో ఉన్న ఏ చిలకని ప్రశ్నించినా బెంగగా ఒకే మాట చెప్తుంది!.. అడవిలోకెళ్ళి అడుక్కుతినాలని ఉందీ అని..

అదే కళాకారుడు తత్వం!

వాడే కళాకారుడు!!

సొమ్ముకి అమ్ముడు పోయేవాడు... కళ-కారుడు!!

సాలిగ్రామం గోపాలంగారనీ విజయనగరం సంస్థానంలో పెద్ద సంగీత విద్వాంసుడు.

పెద్ద ఇల్లూ వాకిలీ....నౌకర్లు, చాకర్లు.... మందీ మార్బలం..పొద్దునే స్తోత్ర పాఠాల్తో మేల్కొలుపులు..

గబగబా అనుష్టానం..వెంటనే పల్లకీ ఎక్కి రాజాస్థానికి వెళ్ళడం! అక్కణ్ణించే

కళా-కార్మికత్వం.... ఏం పాడమంటే అదీ! ఎప్పుడు పాడమంటే అప్పుడు ఎవళ్ళ మీద పాడమంటే వాళ్ళ మీద!

ఓ పాటల యంత్రం..

దీన్నంతా గమనిస్తున్నాడు చిరంజీవి పొడుగు రామమూర్తి అనే శిష్యుడు!

రామ...రామ... పది నిముషాల పాటు ప్రశాంతంగా పరమేశ్వరుడికి అభిషేకం చేసి ఎరుగడు గురువుగారు. ఎప్పుడూ ఎవరో తరుముతున్నట్టే.. సరే ఐశ్వర్యముంది. కీర్తి ప్రతిష్టలు అంటారా!




పట్టు పంచి, జరీ శాలువా, కాళ్ళకి బంగారు కడియాలు, చేతులకి కంకణాలు, మెళ్ళో నవరత్నాల దండ, వెండి పొన్ను కర్ర, వెండి పొడుండబ్బా, నుదుటన కస్తూరి, కంఠానికి మంచి గంధం, కంఠంలోపలే గరళం!! గుండెల్లో మంటా!.

బంగారు గొలుసుల్తో బంధింపబడ్డ గంగిగోవు! ఆయన దగ్గర తన సంగీతం! శిష్యుడికి పాఠాలు చెప్తున్నప్పుడే కాస్త సేదతీరేవారు సాలిగ్రామం వారు!

పదో ఏట నించీ, ఒక్క పన్నెండేళ్ళ పాటు... వీణాభ్యాసం చేశాడు పొడుగు రామమూర్తి! అంటే పన్నెండేళ్ళు అహరహం నిరంతర సాధన.

వీణ శరీరంలో భాగమైపోయింది.

వాయిస్తూ వాయిస్తూ నిద్రలోకి ఒరిగి పోయిన శిష్యుణ్ణి చూస్తే కరువుదీర శివలింగాన్ని కావులించు కున్న మార్కండేయుడిలా అనిపించేవాడు. అప్పుడు రామమూర్తిని లేవదీసి పక్కమీద పడుకోబెట్టి దుప్పటి కప్పేవాడు గురుగారు.

ఏదైతేనేం... రామమూర్తికి వీణ అబ్బింది. అద్భుతంగా వాయించడం ఆరంభించాడు.

కానీ, గుండెల్లో చిన్న గుబులు బయలుదేరింది. కొంపదీసి గురూగారు ఆస్థానానికి రమ్మంటా రేమో! ఒక్కసారి అక్కడ వాయిస్తే యావజ్జీవ ఖైదుగదా! అని మధనపడీ... ఓశుభవేళ...

గురూగారి పాదాలకి నమస్కరించీ,

"స్వామీ నాకు దక్షిణ దేశం వెళ్ళి, సంగీతాన్ని మరింత నేర్చుకోవాలని అభిలాషగా ఉంది, తమ అనుజ్ఞ అయితే..."

గురూగారు శిష్యుణ్ణి ఆపాదమస్తకం చూసుకున్నారు.

అదృష్టవంతుడివి...

వెళ్ళు అని మనస్ఫూర్తిగా ఆశీర్వదించారు.

స్వేచ్ఛగా ఎగిరి పోతోన్న పావురంలా అనిపించీ హృదయం తేలికై పోయింది సాలిగ్రామం గోపాలంగారికి!

అలా ఎగిరిన పావురం, తమిళనాడులోని తచ్చూరి సింగరాచార్య సోదరుల ప్రాంగణలో వాలింది. వీణమ్రోగింది.

గోదావరి, కావేరితో కలిసీ పరవళ్ళు తొక్కుతూ ప్రవహించింది...అలా కొన్నేళ్ళు గడిచాక...

ఓ రోజు... సంగీత యజ్ఞం!

వేదిక గోఖలే హాలు.

సంగీత రసజ్ఞులైన జనంతో కిటకిటలాడి పోతోంది హాలు. ముఖ్య అతిథులో.. తిరువత్తూర్ త్యాగయ్య, సుమతీ కృష్ణారావు, బెంగుళూర్ నాగరత్నమ్మ (తిరువయ్యూరులో త్యాగరాజ స్వామి వారి సమాధికి ఆస్తి మొత్తం ధారపోసిన పుణ్యాత్మురాలు) వచ్చారు!

ఒక్కసారి గురుస్మరణ చేసుకునీ వీణ మీటాడు పొడుగు రామమూర్తి.

వింటున్నవారి హృదయాలు మీటినట్లయి ఆనందంతో పులకరించారు.

నారదుడు 'మహతి' మీటినట్టూ.

తుంబురుడు 'కళావతి' మీటినట్టూ.

స్వర సముద్ర తరంగాల్లో మునిగి తేల్తున్నారు రసికజనం. 'పొడుగు' వట్టి ఇంటి పేరులోనే గాదు, విద్యలో కూడా ప్రస్ఫుటంగా కనిపించే సరికి!!

ఆ వీణా విరాట్ మూర్తికి నమస్కరిస్తూ చప్పట్ల

వర్షం కురిసింది.

అంత పొడుగు రామమూర్తి వొంగి వినయంతో 'వామనుడైపోయాడు'.

వెంటనే విజయనగరం రాజావారి నించి కబురు వచ్చింది మా ఆస్థానాన్ని అలంకరించవలసింది అని...

వెళ్ళాడు... కానీ గురూగారితో చెప్పించాడు... ఆస్థాన పదవిలో ఉన్నా.... దేశంలోని అన్ని ప్రాంతాలకి ఇష్టం వచ్చినప్పుడు వెళ్ళే అవకాశం ఉంటేనే పదవిని అంగీకరిస్తాను అని.

అలాగే కానియమన్నారు రాజావారు.

అంతే అక్కణ్ణించి కొన్నాళ్ళు మైసూరు మహారాజా వారి సన్నిధిలో

కొంతకాలం.... నిజాం ప్రభువు సంస్థానంలో.... మరికొన్ని నెలలు తిరువాన్కూర్... కొంతకాలం... సింధియా మొదలైన సంస్థానాలకి వెళ్ళి తన మనసుకు నచ్చినన్నాళ్ళు.... వాళ్ల మెచ్చినన్నాళ్ల ఉండి, అక్కడి సంగీత విమర్శలను పరిశీలించి... తన విద్వత్తును ప్రదర్శించి.... అంతులేని అభిమానాన్ని, కానుకల్నీ స్వీకరించి... స్వేచ్ఛగా తిరిగి విజయనగరం చేరేవారు.

ఎంత కాదనుకున్నా ఆస్థాన పదవి మెడకి లంకే!

ఎంత ఇష్టారాజ్యంగా ఉన్నా... కొన్నిసార్లు అనుమతి తీసుకోక తప్పేది కాదు. అంచేత ఓ సుముహూర్తం నాడు... ఆ పదవికి కూడా తిలోదకాలు ఇచ్చేసారు!!

ఆ తర్వాత శ్రీకాకుళం జిల్లా నర్సన్నపేటలో ఓ సంగీత గురుకులాన్ని స్థాపించారు.

తను సంపాదించిన ధనంతో ఉచిత భోజన వసతుల్ని కల్పిస్తూ సంగీతాన్ని బోధించేవారు.

ఉర్లాం, పోలాకి, నర్సన్నపేట, శ్రీకాకుళం, బరంపురంలో సంగీతోత్సవాలు విరివిగా జరగడానికి కారకులై... ప్రతీఏటా సంగీత ఉత్సవాలు జరపడం సాంప్రదాయంగా చేసారు రామమూర్తిగారు.

1911లో దివాన్ బహదూర్ కొమ్మారెడ్డి సూర్యనారాయణమూర్తిగారు... పొడుగు రామమూర్తిగారిని కాకినాడకి రప్పించి సరస్వతీ గాన సభలో వీణ కచేరీ పెట్టించారు.

హరినాగభూషణం, మహారాజపురం విశ్వనాథ అయ్యర్, గోవిందస్వామిపిళ్ళై వంటి సంగీతజ్ఞుల మధ్యన బంగారు పతాకంపై "వైణిక సార్వభౌమ" అని చెక్కించి బహూకరించారు!

బతికినన్నాళ్ళు... తన సంగీత సామ్రాజ్యానికి సార్వభౌమత్వాన్ని నెరపిన పొడుగు రామమూర్తి ధన్యుడు!!!



**-తనికెళ్ల భరణి**

---

సంగీతానికి సంబంధించిన సమితులు, సమాజాలు నిర్వహించేవారు ఈ కూపన్ నింపి మాకు పంపితే 'హాసం' వద్ద ఆడియో క్లబ్ డేటాబేస్ తయారవుతుంది. మాకందిన వివరాలు 'ఆడియోక్లబ్స్' శీర్షిక ద్వారా పాఠకులకు తెలుపుతాం. దీనివల్ల ఈ క్లబ్స్ పరస్పరం సహకరించుకునేందుకు, సమన్వయం సాధించేందుకు ఉపయోగపడుతుంది.

## 'హాసం' ఆడియో క్లబ్ డేటా బేస్

సంస్థ పేరు :.................................................. స్థాపించినసంవత్సరం:..........................

ఉద్దేశ్యము :.................................................. సభ్యుల సంఖ్య :..........................

అడ్రసు :..................................................................................

.................................................. పిన్‌కోడ్ నెం:..........................

కార్యాలయం ఫోన్ నెంబర్, ఈ మెయిల్ :..................................................

కార్యనిర్వాహక సభ్యులు 1. ☎

2. ☎

3. ☎

సంప్రదించవలసిన వ్యక్తి, (ఫోన్ నెంబరుతో సహా) : తేదీ:.........

సీరియల్ 14

# సినీతిచంద్రిక

రావి కొండలరావు





## జరిగిన కథ

ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శకుడు వచ్చి వాళ్లకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పాడు. సినిమా రంగంలో జరిగిన చిత్రలాభము, చిత్రభేదము, చిత్రఖేదము, అనే శీర్షికల కింద అనేక కథలు చెప్పాక చిత్రమోదము గురించి చెప్పసాగాడు. సినిమాలు మానేసి తిరిగి వచ్చాక ఒక ఊళ్లో స్థిరపడ్డాను. కొందరు సినిమా తీయడానికి ముందుకు వచ్చారు. పూర్తిగా డబ్బు సిద్ధం చేసుకున్నాకనే ఫీల్డులోకి దిగాలని చెప్తూ ఓ నిర్మాత కథ చెప్పసాగేను..." (ఇక చదవండి)

ఒకాయన సినిమా తియ్యాలని తెగ ఉబలాటపడి, కిందా మీదా పడి, ఆఖరికి ఎట్లాయితేనేం మొదలెట్టాడు. అతని ఉద్దేశం ఏమిటీ-తానేదో ప్రారంభించి, ఒక పాట రికార్డు చేసి, ఒక సెట్టు మీద షూటింగు చేస్తే, ఇంకా అక్కడి నుంచి డిస్ట్రిబ్యూటర్లు కావలసినంత డబ్బు గుమ్మరించేస్తారని! ఒక సెట్టు వేశాడు, అదీ ఏమిటీ-పెద్ద తారలు రాని సెట్టు. వాళ్లొస్తే వాళ్లకు డబ్బివ్వాలిగా. అందుకని ఏదో పదిమంది కనబడేలా చిన్న సీను ఒకటి రాయించుకుని, దాంట్లోనే నవ్వు, ఏడుపు ఇరికించాడు. ఆ సీనులో వచ్చే వాళ్లంతా, చిన్న తారలే అన్నమాట. ఏదో విధంగా తంటాలు పడి, ఒక పాట రికార్డు చేశాడు. ఆ పాట కూడా పూర్తిగా లేదు. ఏంచేతంటే కవి సగం డబ్బే తీసుకుని, సగం పాటే రాశాడు. మిగతా డబ్బిస్తేనే కాని మిగతాది రాయనన్నాడు. డిస్ట్రిబ్యూటర్లు ఇవ్వగానే ఇస్తానన్నాడు నిర్మాత. ఐతే అప్పుడే రాస్తానన్నాడు కవి. ఇంకేం చేయడం? ఉన్న ఆ పల్లవి, చరణంలోని సగం రికార్డు, కానిచ్చాడు మరి! పది నిమిషాల పాటు నడిచే ఆ సీను, పల్లవిన్నర పాట పట్టుకుని, ఆ నిర్మాత డిస్ట్రిబ్యూటర్ల కోసం ఊరూరా తిరిగాడు. డిస్ట్రిబ్యూటర్ దొరక్కపోయినా, పార్టీ ఐనా దొరుకుతుందేమోనని ట్రై చేశాడు. ఏమేనా అంటే తన పాట వినమన్నాడు. ఆ సీను చూడమన్నాడు, ఎవరికీ ఇష్టం లేకపోయింది. ఆఖరికి విసిగిపోయి, మిగతా సినిమాలు తీస్తున్న నిర్మాతలను ఈ పాట, సీను కొనుక్కొని వాళ్ల చిత్రాల్లో ఇరికించుకోమన్నాడు. అది కుదరలేదు. ఆవిధంగా ఆ నిర్మాత ఆ రెండింటినీ బ వేసుకుని ..... కుళ్ళిపోయిన కూరగాయలమ్మే మనిషల్లే .... ఎదురు చూడసాగాడు. ఇట్లా జరగ్గా జరగ్గా కొన్నాళ్ళకో డిస్ట్రిబ్యూటరు తగిలాడు. ఆ డిస్ట్రిబ్యూటరు ఏమిటీ కొత్తగా సంస్థ లేవదీశాడు. చాలామందిని, పిక్చర్లు ఇమ్మని అడిగాడు. ఎందుకనో వాళ్ళివ్వలేదు. ఈ డిస్ట్రిబ్యూటరుకు చిత్రం కావాలి - ఆ నిర్మాతకు డిస్ట్రిబ్యూటరు కావాలి. ఇకనేం .... ఇద్దరికీ ఒకరికొకరు తారసిల్లి - బిజినెస్ మాట్లాడేసుకున్నారు.



"మీ పిక్చరు నే తీసుకుంటాను. అది సగం పాటని ఎవరన్నారు? మీరు చెబుతేనే నాకు తెలిసింది. ఐనా .... ఇంకో గమ్మత్తు చేద్దాం. హీరో ఈ పాట పాడుకుంటూ ఉంటాడు ...." అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

" ఆడ గొంతుకదా .... హీ....రో ...." అని నసిగాడు నిర్మాత.

"ఆల్‌రైట్ హీరోయిన్నే పాడుతుంది. ఊరికే ఆడగొంతుతో మగాడు పాడితే నావల్టీ వస్తుందని చెప్పాను. మీ ఇష్టప్రకారమే కానీండి. అట్లా ఆ విధంగా ఆమె పాడుతూవుంటే, విలన్ సడన్‌గా

వస్తాడు. ఎక్కడ .... సరిగ్గా - మన పాట ఎక్కడయిందో అక్కడ. వచ్చేసరికి ఆవిడగారు పాట ఆపేసి, అతన్ని చూసి పరిగెత్తి పారిపోతుంది. ఇటువంటి ఐడియా కనక మనం పెట్టాం అంటే సత్యజిత్‌రాయ్ లాంటివాడు గుండె కొట్టుకోవలసిందే? ఎట్లావుంది?"

"బావుందిగానీ - బాగున్నపాట అట్లా మధ్యలో ఐపోతే ప్రేక్షకులు నిరుత్సాహపడతారేమో!"

"నావల్టీ అండీ, నావల్టీ అంటే నిరుత్సాహమే మరి. ఆహా చెబుతున్నాను. ఇదొక ఐడియా ఇచ్చాను. ఇంకా ఇమ్మంటే ఇస్తాను - నాకేం అభ్యంతరం లేదు."

"సరేలెండి, ముందు మనం ఎగ్రిమెంటు పూర్తిచేసుకుందాం. ఐన తర్వాత మీరు డబ్బిస్తే - నేను జోరుగా - రబ్బరు సాగినట్టు సాగిస్తాను" అన్నాడు నిర్మాత. ఇద్దరూ నాలుగు గంటలసేపు బల్లలు చరచుకుని కుస్తీలు పట్టి-లేచి, కూచుని, కిందుమీదు



దొర్లి - మధ్యలో కాఫీలూ, సిగరెట్లూ తాగి నిర్ణయానికొచ్చారు.

"చిత్రానికి ఏం పేరు పెడదాం?" అన్నాడు డిస్ట్రిబ్యూటరు - నిర్ణయం అయినవెంటనే.

"పెడదాంలెండి, ఇప్పట్నుంచీ ఎందుకు - మరో నాలుగు రోజుల్లో విడుదల చేస్తామనగా పెడదాం. అదో సస్పెన్సు."

"ఏడిసినట్టుంది, అప్పుడెందుకండీ పేరు? బిడ్డపుట్టగానే పేరుపెడతామా - వాడు పెరిగి పెద్దవాడయి, మరో నాలుగయిదు నెలల్లో కన్నుమూస్తాడనగా పెడతామా - నామకరణం ముందే జరగాలి. అదీ నా ఉద్దేశం."

"పోనీ అట్లాగే చేదాంలెండి, 'కష్టే ఫలే' అని పెడదాం. అని నా ఉద్దేశం" అన్నాడు నిర్మాత.

"ఏడిసినట్టుంది, మాస్‌కేం తెలుస్తుందండీ అర్థం? 'ఫలే' అన్న శబ్దం పలకటమే వాళ్ళకురాదు. 'కష్టం ఫలించును' అని పెట్టినా చిరాకే. పోనీండి... 'సుఖం ఫలించదు' అంటే... బాగానే ఉంటుంది కానీ. ఈ 'ఫ' అన్న అక్షరంవుందే అది డేంజరు. క్లాస్‌కు అర్థం అవుతుందిగాని, మాస్‌కు కాదు."

"సరే 'శ్రమజీవనం' అందామా?"

"ఏడిసినట్టుంది, ఏవో ప్రావగాండా పిక్చరనుకుంటారు, పైగా శ్రమ' అన్న శబ్దం..."

"అయ్యా - ఇంక మీ యిష్టం. మనం ఇప్పుడు దీనికోసం తగులాడుకోటం సబబు గాలేదు. అందుకే చిత్రం పూర్తికానివ్వండి అంటున్నాను. అప్పుడైతే - కథఅంతా మనకు కరతలామలకంగా ఉంటుంది - ఏదో ఒకటి తడుతుంది."

"నోనో - ఇవాళ పేరుపెట్టి - రేపు ప్రకటన వెయ్యాలండీ మహాప్రభూ! దాని కోసమే నా ఏడుపు. అంతేగాని పేరు కోసం కాదు. వన్ మినిట్...ఆఁ ! సాంగులో మొదటిలైను ఏమిటి?"

"నను చూచి నవ్వింది చందమామా..."

"వెరిగుడ్! ఇది పెడదామండీ. పైగా ఈ సాంగునే ఎండింగులో రిపీట్ చేద్దాం, చేసేశామంటే సరి పోతుంది. ఏమంటారు?" అని అడిగాడు డిస్ట్రిబ్యూటరు. అతని పోరుపడలేక.

"సరే కానీండి" అని నిర్మాత ఒప్పుకున్నాడు.

"వన్ మినిట్ - ఇంకో బ్రిలియంట్ ఐడియా! నను చూచి నవ్వింది చందమామా అనికాకుండా 'నను చూచి నవ్వింది' అని పెడదాం. ఏమిటో ఎవరికీ తెలీదు. సస్పెన్సు. దానికితోడు ప్రతివాడు 'నను చూచి నవ్వింది' అని తమాషాగా పొంగిపోతారు. ఎట్లా ఉంది?" అన్నాడు డిస్ట్రిబ్యూటరు. తన అఖండమైన తెలివితేటల ఈ విధంగా తేరినందుకు.

"బావుంది"

"జీనియస్‌నండీ, ఈ పాళాన హాలివుడ్ వెళ్ళిపోతే అమాంతంగా వాటేసుకుంటారు. కానీండి, ఏం చేస్తాం? - మీ పిచ్చరోటి ఒప్పుకున్నానే - తద్దినం" అని విచారించాడు.

"సరే, విచారించకండిగాని - డబ్బివ్వండి మరి మొదలెడదాం" అన్నాడు నిర్మాత. ఇక అక్కడి నుంచీ, డిస్ట్రిబ్యూటరే ప్రొడ్యూసరు. అంతా అతని ఇష్టమే. నిర్మాతకేంలేదు. కొన్నాళ్ళకు ఏం చేశాడంటే, షూట్‌చేసిన సీనూ, ఆ పాటకూడా లాగేస్తానన్నాడు, అవి కథకు అతకలేదన్నాడు.

నిర్మాత దేనికీ ఏమీమాట్లాడలేదు, సగం పిక్చరు ఐంది. అక్కడినుంచి ఇద్దరిమధ్యా పచ్చగడ్డి భగ్గున మండసాగింది. ఇద్దరూ జుట్టూ జుట్టూ పట్టుకుని కోర్టులమ్మట పడ్డారు. అదేం తేల్తుందో, ఏమో! విన్నారా - ఇవీ చిక్కులు. మనం మూడొంతులు లాగేస్తే, అప్పుడింక అతను అంతగా మాట్లాడలేదు. ఏమంటారు?" అన్నాను.

నాకథ బాగున్నట్టు అనిపించింది - వాళ్లు ఒప్పుకున్నారు. ఈ పదిమందినీ చేరదీసి, వాళ్ళచేత సరిసమానంగా డబ్బు పెట్టించి - నేను నిర్మాతగా వ్యవహరించి - మద్రాసు వెళ్లి చిత్రం తీయటానికి ఏర్పాట్లు మొదలెట్టాను. మందచేరితే మఠానికి చేటన్నట్టు - వీళ్ళంతా అక్కడ చేరి నానా రభసా చేశారు. ప్రతీవాడూ ప్రతీవిషయంలోనూ కలిపించు కోవటమే. ఎవరు ఎరిగున్నవాళ్ళని వాళ్లు రికమెండ్ చెయ్యటం. దాంతో వాళ్ళల్లో వాళ్ళకు పడకపోవటం - ఇటువంటి గొడవలన్నీవచ్చాయి. ఐనా, నేను చేసిన మంచిపనేమిటంటే - ఫలానాకు వేషం ఇచ్చాను. పైగా, నాకు అసిస్టెంటు, ఏదో చేదామనీ బాగా తీద్దామనీ ప్రతి దర్శకునికీ వున్నట్టే



నాకూ వుండేది. కాని ఏంలాభం? నా ప్రక్కనున్న గ్రహాలు ఒప్పుకునేవికావు, ఏదో డబ్బు పెట్టారు. చవకలో తీసిపారేద్దామని, చిన చిన్న సెట్లు అవీ వేసుకుని, కొత్త వాళ్ళను పెట్టుకుని తొందర్లో చిత్రం పూర్తిచేశాము. వెంటనే ప్రీవ్యూకూడా వేశాము. చూసినవాళ్ళల్లో చాలామంది 'క్లాసు పిక్చరు' అని భయపెట్టారు. కొందరు 'మాస్ పిక్చరు' అన్నారు. 'అటూ ఇటూ కాకుండా వుంది' అని మరికొందరన్నారు.

ఏది ఏమైనా పిక్చరు విడుదలైంది. మొదటివారం ఒకమాదిరిగా ఆడింది, రెండోవారం కదల్లేదు. మా పదిమందీవెళ్ళి, తోస్తాం అని కూడా అన్నారు-కదిలేదయితే తోస్తే కదుల్తుందేమో గాని- కదలని పర్వతాన్ని తోసి ఏం ప్రయోజనం? రెండో వారంలో తీసేస్తానని డిస్ట్రిబ్యూటరు పట్టుపట్టాడు, థియేటర్ల వాళ్ళుకూడా తీసేయమన్నారు. పన్నెండు, పదమూడు రోజులు ఆడి. 'గోవిందో' అని మా చిత్రం ఇంటికివచ్చేసింది. బాక్స్ - ఆఫీసుకొచ్చేసింది. (అదే బాక్సాఫీసు చిత్రం అంటే) ఈ చిత్రం ఐపోయిన తర్వాత నేను ఇంక మద్రాసులో వుండలేదు. ఈ దర్శకత్వంలో మనం లాభంలేదని, అసలు నేను మరి సినిమా ఫీల్డులో ఉండరాదని నిశ్చయించుకున్నాను.

విన్నారా! ఇదంతా నా తప్పని మాత్రం మీరు అనుకోవద్దు. అందరూ ఎవరి యిష్టం వచ్చినట్టు వాళ్ళు కలిగించుకొంటే ఇట్లాగే తయారవుతాయి చిత్రాలు. ఎంతో అవస్థపడి రక్తంధారపోసి రెండు చిత్రాలు తీస్తే రెండూ కంచికి వెళ్ళిపోయాయి. నేను ఇంటికి వచ్చేశాను. ఇది నా రెండో చిత్రం యొక్క అనుభవం - టూకీగా చెప్పడమైనది" అన్నాడు మహాశయుడు.

"ఐతే మళ్ళీ నువ్వు వెళ్ళలేదా సినిమా తియ్యటానికి?" అని అడిగాడు, ధనవంత ఆత్రుతగా.

"చెప్పనీండి మరి, లేదు. నా మిగతా పార్ట్నర్సూ, నేను అంతా పరిశ్రమ వదిలివేశాము, సినిమా




పరిశ్రమలో వుండి, సవ్యంగా నడుపుకుంటే ఫరవాలేదుగాని, అటూ, ఇటూ ఐందా-ఖేదం తప్పదు. డబ్బులు రావటంలేదని, వాళ్ళంతా ఖేదంతోనే గడుపుతున్నా, నేను మాత్రం మోదంతోనే ఉన్నాను. ఎంచేతంటే - కొన్ని కష్టాలు తప్పాయి నాకు. కాని - నాకున్న బాధ ఏమిటంటే - నా స్వంత ప్రజ్ఞ ఉపయోగించి, నన్ను ఎవరైనా సినిమా తియ్యమనాలని. ఐతే అది వీలుకాదుగా, వీలు కానంతకాలం బాధే" అన్నాడు మహాశయుడు

"ఐనట్టేగదా", అన్నాడు కుమారరత్నం.

"ఆహా", అన్నాడు మహాశయుడు.

"అమ్మయ్య - ఫాదర్, ఫైవ్‌లాక్స్..." అన్నాడు రత్నం.

"దేనికిరా అబ్బాయి? రామాయణం అంతావిని, రాముడికి సీత ఏమవుతుందని అడుగుతున్నావా?" అన్నాడు ధనవంతుడు.

"ఆ విధంగా అడగవలసినవాడిని నేనేం కానులెండి. నాకు తెలుసు - సీత రాముడి కేమవుతుందో!"

"అది సరేలే, నువ్వు మళ్ళీ డబ్బు అడుగుతున్నావెందుకని? విన్నావుగా - మనవాడు చెప్పిన కథలన్నీ! అవన్నీ విన్నాకకూడా నీకు సినిమా తియ్యాలనిపిస్తోందీ!"

"ఐతే ఒకటుందిలెండి, నా కథలన్నీ విని సినిమా తియ్యకూడదని నా ఉద్దేశంకాదు. అందులో జరిగిన సినీతులన్నీ గ్రహించి, ఆ ప్రకారం జాగ్రత్త పడాలని" అన్నాడు మహాశయుడు.

"జాగ్రత్తపడినా, మానినా ముందు బోలెడు డబ్బు పొయ్యాలిగా" అన్నాడు ధనవంత.

"పొయ్యొద్దూ మరీ-"

"పోస్తే ఏముంది నాన్నా - లాభాలొస్తా యిగా"

"వచ్చినట్టేవుంది ఇదంతా చూడగా -"

"వినగా -" అని కరక్టు చేశాడు మహాశయుడు.

"సరే, రేపు చెబుతాను - ఇప్పుడు నన్ను ఆలోచించుకోనీ," అని ధనవంతుడులేచి. ఎక్కడికో గర్భ గుడిలోకి వెళ్ళిపోయాడు, మహాశయుడికి ఆశ కలిగింది, అతను కుమారరత్నం దగ్గర చేరి లాలించాడు, బుజ్జగించాడు, మంచి మాటలాడాడు, జోల పాటలు పాడాడు.

"ఐతే ఏమంటారు, ఏమిటి మీ ఉద్దేశం?" అని అడిగాడు చిరాగ్గా కుమారరత్నం.

"ఏముంటుంది - నాచేత డైరెక్టు చేయించుకోమని, చింత చచ్చినా, పులుపు చావలేదు," అన్నాడు మహాశయుడు.

" ఆ డైలాగు అనవలసినవాడిని నేను - సరే ఇప్పుడు నన్ను ఆలోచించుకోనీయండి, ఏ సంగతీ రేపు తేలాక, నేనూ తేలుస్తా," అని కుమారరత్నం కూడ వెళ్ళిపోయాడు.

"నేనేనా ఆలోచించనివాడిని, నేనూ ఆలోచించి రేపే చెపుతాను," అని మహాశయుడూ వెళ్ళి పోయాడు.

ఆ మర్నాడు ముగ్గురూ కలిశారు, ధన వంతుడు మాములుగా టిఫిన్లూ, కాఫీలూ తెప్పించాడు. ముగ్గురూ తిన్నారు.

"ఏమిటి నాన్నా సస్పెన్సు?" అన్నాడు కుమార రత్నం.

"ఏమీలేదు, ఆలోచన," అన్నాడు మహాశయు,

"సినిమా తియ్యటానికి నేను అంగీకరించాను" అన్నాడు నిదానంగా ధనవంతుడు. కుమారరత్నం హైజంపు చేశాడు.

"వాట్! ఫాదర్. యు ఆర్ వాట్ ఫాదర్, మై ఫాదర్ డార్లింగ్" అంటూ వెర్రెత్తిపోయాడు.

"తగ్గు" అన్నాడు ధనవంత.

రత్నం తగ్గాడు.

"ఐతే నేనే చిత్రనిర్మాతగా వ్యవహరిస్తాను." అన్నాడు ధనవంత.

"మీకు తెలీదునాన్నా - ఓల్డ్ ఐడియాస్ మీవి. ఏ సంపూర్ణ రామాయణమో తీస్తానంటారు



మీరు."

"అబ్బాయ్, మహాశయా! నువ్వు చెప్పిన కథలనుబట్టి నాకు సర్వం అర్థమైంది. వాటన్నింటినీ చక్కదిద్దుకుని, నేనే చిత్రం నిర్మిస్తాను. ఈ విషయాలన్నీ నువ్వు చెప్పినందుకు థాంక్సులు. కథ నిర్ణయం దర్శకుడికీ, రచయితకూ వదిలేస్తాను. ఎంతైనా డబ్బుకు వెనుకాడను. పెట్టవలసినచోట బాగా ఖర్చు పెడతాను. ఎవరికీ డబ్బు ఎగవెయ్యను. వేషాలు ఇస్తానని పదిసార్లు ఎవర్నీ తిప్పను, ఇస్తే ఇస్తానంటాను - లేకపోతే లేదంటాను. నాతో పనిచేసే వాళ్ళందరినీ మర్యాదగా మంచిగా చూస్తాను. అబద్ధాలు చెప్పను. మోసాలు చెయ్యను. నా కథ ఏమిటో, నా సినిమా ఏమిటో, నా కంపెనీ ఏమిటో అంతే. ఇతరుల గొడవలూ, గోలల్లో తల పెట్టను. కేవలం డిస్ట్రిబ్యూటర్ల డబ్బులమీదే ఆధారపడను, పరిశ్రమలోని నలుగురుతోనూ కలిసికట్టుగా, ఐకమత్యంగా, సఖ్యతగా ఉంటాను, ఐతే ఇంత మంచితనంవుంటే సినిమా ఏం తీస్తారని నువ్వు అడగవచ్చు! అదే గమ్మత్తు. ఇంతమంచి తనంతోనూ నేను తీస్తాను. మంచితనమూ, క్రమశిక్షణా కావాలి, అవి వుండి తీసేవాళ్ళ చిత్రాలు బావుంటాయి. నేను తీసే చిత్రమూ బావుంటుందనే నా విశ్వాసం'' అన్నాడు ధనవంతుడు - ఉపన్యాసంలా ఇచ్చి,

మహాశయుడు సంతోషం పట్టలేక మూర్ఛపోయాడు.

తన ఛాన్సు తన తండ్రి కొట్టేశాడని కుమారరత్నం మూర్ఛపోయాడు.

"అరెరే!... ఏమిటిది? ఏం జరిగింది? శాపం పొందినట్టు ఇద్దరూ ఈ మూర్ఛలేమిటి?... ఒరేయ్, నౌకర్లూ, చాకర్లూ... ..." అని ఆత్రుతగా కేకలు వేశాడు ధనవంతుడు. నౌకర్లూ, చాకర్లూ పరుగు పరుగున వచ్చారు,

"నీళ్లు.... నీళ్లు...."

నీళ్లు వచ్చాయి. వాళ్ళిద్దరి ముఖాలమీద నీళ్ళు జల్లాడు-ధనవంతుడు. ఇద్దరూలేచి కూచున్నారు.

"నాన్నా! చాలా అన్యాయం నాన్నా! చాలా అన్యాయం. ఈ ఐడియా అసలు నాకు జన్మించింది మొదట. నేను చెప్పినప్పుడు మీరు మొదట కాదన్నారు. అంతావిన్నాక మీరే సినిమా తీస్తానంటారా? కాస్సేపుపోతే వేషంకూడా వేస్తానంటారు. నే వొప్పుకోను. ప్రథమంలోనే మీరు ఇట్లా పరుల ఐడియాలు కాపీ కొట్టేశారు. పైగా అన్యాయం చెయ్యను. మోసం చెయ్యను అంటున్నారు. నాన్నా! నా కల నిజమవదా? నా స్వప్నం ఫలించదా? నా కోర్కె సిద్ధించదా? నేను నిర్మాతగాఉండి, మంచి చిత్రం తీస్తాను. ఇతర మోజుల్లోపడను. అనవసరంగా కార్లలోతిరిగి పెట్రోలు ఖర్చుచేసి ఫోజులు కొట్టను. డాబులు కొట్టను. నన్ను నమ్మండి ఫాదరూ. నన్ను నమ్మండి..." అని ప్రాధేయపడ్డాడు కుమార రత్నం.




"సరేచూద్దాం. ఐతే నిర్మాతవు నువ్వే. కాని - దగ్గరుండి డబ్బూ అదీ నేను ఖర్చుచేస్తాను." అన్నాడు. ధనవంత.

"నాన్నా" అని కాళ్ళమీద పడ్డాడు రత్నం.

"మీరెంత మంచివారు, నాన్నా! మీరెంత మంచివారు?" అన్నాడు.

"అయ్యా! మరి నామాట?'' అన్నాడు మహాశయ.

"మావాడి మాటయిందిగా, ఇంక నీ మాటా?"

"నన్ను దర్శకునిగా తీసుకోండని మొదటే అడిగాను. తీసుకుంటారనే ఆశతోనే ఈ కథల్ని చెప్పాను. అసలు సినిమా అంటే ఏమిటో ఎరగనివాళ్ళు ఇన్నివిషయాలు తెలుసుకుని నన్ను అన్యాయం చేస్తారా? మోసం చెయ్యనని అన్నారు. నన్ను మోసంచేస్తున్నారు కారా.... స్తున్నారు కారా-" అంటూ విలపించసాగాడు - మహాశయ.

బస్సా - రైలా - విమానమా - అవి కూడా వినిపించునాయనా, మహాశయా! లే చెబుతాను, నువ్వు చెప్పిన కథలనుబట్టి చూడగా నువ్వు మంచివాడవే ననిపించావు. నీ కష్టాలన్నీ జాలి గాథలై ప్రసిద్ధికెక్కేంత జాలిగా ఉన్నాయి. ఆల్‌రైట్ - నువ్వే నా దర్శకుడివి" అన్నాడు ధనవంత.

"ధన్యోస్మి...ఈసారి చూడండి, ఎంత పకడ్‌బందీగా, కట్టుదిట్టంగా పిక్చరు తీస్తానో"

"నాన్నా - మరి కథ?"

"కథ - మనం అక్కడికి వెళ్ళి రచయితచేత రాయించాలి, నువ్వూ, నేనూరాస్తే మళ్ళీ మనవాడు ఖేదంలోపడి కథలు చెబుతాడు, ఎవరు చెయ్యవలసిన పని వాళ్ళు చెయ్యాలి. అది నేర్చుకో ముందు నువ్వు" అన్నాడు ధనవంతుడు.

"ఐతే నాకు డైరక్షన్ ఛాన్సు ఇచ్చినట్టేనా?" అని మళ్ళీ అడిగాడు మహాశయ, నసుగుతూ.

''నేనేం - నీ పాత నిర్మాత నను కుంటున్నావుటయ్యా - మాటంటే మాటే!"

"నాన్నా, నేనే నిర్మాతను ఐతే - మళ్ళీ మీరు కూడా ఎందుకు నాన్నా?"

"ఆమాత్రం పెద్దదిక్కు లేకపోతే అంతా కుర్రవాటంగా తయారవుతుంది."

"జై మానాన్నకు జై - జై దర్శకుడు మహాశయాకూ జై. జై నాకూ జై..... జైజై" అంటూ సంతోషంగా అరవసాగాడు రత్నం.

"నాయనా, ఇప్పుడింక అరుస్తు కూచుంటావా ఏమిటి? మనం ప్రయాణం సన్నాహాల్లో ఉండాలి మరి!"

ఆవిధంగా ఆముగ్గురూ చిత్రమోదమును పొందినవారై, మంచి పద్ధతుల్లో ఒక మహత్తర మహోజ్వల చిత్ర నిర్మాణానికి ముందంజలు వేస్తూ, ఆమర్నాడు ఒకటోరకమైన టిక్కెట్టు కొనుక్కుని మద్రాసు రైలెక్కారు.

(సమాప్తం)



# డిసీజ్ ఖర్మా... దట్సాల్...!

సత్యమూర్తి బి.వి.



మీ కూతురి మామగారు తను మీకు యస్.టి.డి. చెయ్యాల్సి వస్తే టూకీగా మాట్లాడి, ఫోన్ రక్కుమని పెట్టేస్తాడు.



మీరు చచ్చీచెడీ యస్.టి.డి. చేస్తే, జలగలా వదలకుండా, అసలు విషయం జోలికి పోకుండా తీరుబడిగా చాలాసేపు మాట్లాడుతాడు.



'ఈ కారు కొనమంటావా' అని అడిగితే 'కొనండి సార్-నేనున్నానుగా అన్నీ చూసుకోడానికి' అని అంటాడు మీ మెకానిక్ ధీమాగా .



తీరా కారు కొన్నాక, రిపేరు కొచ్చినప్పుడు అంతా ఊడదీసి 'ఇది మనవల్లయ్యే పనికాదు సార్, జపాన్ నించి మెకానిక్‌ని పిలిపించాల్సిందే' అని మీ గుండె గుభేల్‌మనిపిస్తాడు



'మీరు స్వీట్లు తినకూడదు. మీకు డయాబెటీస్ వచ్చింది' అని అంటారు మీ డాక్టరు గారు.





అది తెలిసి కూడా-మీ పిల్లలు, బంధువులు మిమ్మల్ని చూడ్డానికి వచ్చినప్పుడు స్వీట్లు తప్ప మరొకటి తేరు.

# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 1. | కనులు కనులు కలుసుకుంటే | ఆడవాళ్ళు అపనిందలు | 1976 | జి.కె.వెంకటేష్ | సి. నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |
| 2. | తలపులు విరబూసి | ఆడవాళ్ళు అపనిందలు | 1976 | జి.కె.వెంకటేష్ | సి. నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, ఎస్.జానకి |
| 3. | విధి వంచన చేసింది | ఆడవాళ్ళు అపనిందలు | 1976 | జి.కె.వెంకటేష్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు |
| 4. | త్యాగమనే కావ్యంలో | ఆడవాళ్ళు అపనిందలు | 1976 | జి.కె.వెంకటేష్ | భవాని శంకర్ | ఎస్.జానకి |
| 5. | ఓరబ్బ నా మేను సోకితే | ఆడవాళ్ళు అపనిందలు | 1976 | జి.కె.వెంకటేష్ | సి. నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 6. | మంచి పుట్టిన రోజు ఇది | ఆడవాళ్ళు అపనిందలు | 1976 | జి.కె.వెంకటేష్ | దాశరథి | సుశీల |
| 7. | తహతహమని ఊపిరంత | ఆమె కథ | 1977 | చక్రవర్తి | వేటూరి | ఎస్.పి.బాలు, సుశీల |
| 8. | పువ్వుల నడుగు నవ్వుల నడుగు | ఆమె కథ | 1977 | చక్రవర్తి | వేటూరి | జి. ఆనంద్, సుశీల |
| 9. | కట్టుకున్న పాపానికి | ఆమె కథ | 1977 | చక్రవర్తి | వేటూరి | బాలు, ఎల్.ఆర్.అంజలి, వసంత, కౌసల్య |
| 10. | ఏందయ్య ఇది ఎన్నిట్లో కూడా | ఆమె కథ | 1977 | చక్రవర్తి | వేటూరి | ఎస్.జానకి |
| 11. | ఓ నా రాజా రావా | ఆమె ఎవరు | 1966 | వేదా | దాశరథి | సుశీల |
| 12. | డిక్కిరిక్కి డిక్కిరికి టాటర | ఆమె ఎవరు | 1966 | వేదా | దాశరథి | పి.బి. శ్రీనివాస్, ఎల్. ఆర్. ఈశ్వరి |
| 13. | నీవు చూసే చూపులో | ఆమె ఎవరు | 1966 | వేదా | దాశరథి | పి.బి. శ్రీనివాస్, ఎల్. ఆర్. ఈశ్వరి |
| 14. | అందాల ఈ రేయి పలుమారు | ఆమె ఎవరు | 1966 | వేదా | దాశరథి | సుశీల |
| 15. | నీ కన్నులలో నా కన్నీరే | ఆమె ఎవరు | 1966 | వేదా | దాశరథి | సుశీల |
| 16. | అంద చందాల చిన్నదీ రోజా | ఆమె ఎవరు | 1966 | వేదా | దాశరథి | సుశీల |
| 17. | కన్నె మనసు దోచుకున్న | ఆమె ఎవరు | 1966 | వేదా | దాశరథి | ఎల్.ఆర్.ఈశ్వరి, & బృందం |
| 18. | నా హృదయంలో నిదురించె చెలీ | ఆరాధన (ఎ.ఎన్.ఆర్) | 1962 | ఎస్. రాజేశ్వరరావు | శ్రీ శ్రీ | ఘంటసాల |
| 19. | నీ చెలిమి నేడే కోరితిని | ఆరాధన (ఎ.ఎన్.ఆర్) | 1962 | ఎస్. రాజేశ్వరరావు | నార్ల చిరంజీవి | సుశీల |
| 20. | ఏమంటావేమంటావోయి బావా | ఆరాధన (ఎ.ఎన్.ఆర్) | 1962 | ఎస్. రాజేశ్వరరావు | కొసరాజు | పిఠాపురం, స్వర్ణలత |
| 21. | ఓ హోహో మావయ్య ఇదేమయ్యా | ఆరాధన (ఎ.ఎన్.ఆర్) | 1962 | ఎస్. రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 22. | ఆడదాని ఓరచూపుతో | ఆరాధన (ఎ.ఎన్.ఆర్) | 1962 | ఎస్. రాజేశ్వరరావు | ఆరుద్ర | ఎస్. జానకి |
| 23. | వెన్నెలలోని వికాసమే వెలిగించెద | ఆరాధన (ఎ.ఎన్.ఆర్) | 1962 | ఎస్. రాజేశ్వరరావు | శ్రీ శ్రీ | సుశీల |
| 24. | ఇంగ్లీషులోన మ్యారేజి | ఆరాధన (ఎ.ఎన్.ఆర్) | 1962 | ఎస్. రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల, ఎస్. జానకి |
| 25. | నేడే తెలిసింది ఈనాడే తెలిసింది | ఆరాధన (ఎన్.టి.ఆర్) | 1976 | ఎస్.హనుమంతరావు | సి. నారాయణరెడ్డి | రఫీ, ఎస్.జానకి |
| 26. | ఓ ప్రియతమా... నా మది నిన్ను | ఆరాధన (ఎన్.టి.ఆర్) | 1976 | ఎస్.హనుమంతరావు | సి. నారాయణరెడ్డి | రఫీ, ఎస్.జానకి |
| 27. | లైలా లైలా నిరుపేద మనసునే | ఆరాధన (ఎన్.టి.ఆర్) | 1976 | ఎస్.హనుమంతరావు | సి. నారాయణరెడ్డి | రఫీ, ఎస్.జానకి |
| 28. | నీకేలా ఇంత నిరాశ | ఆరాధన (ఎన్.టి.ఆర్) | 1976 | ఎస్.హనుమంతరావు | దాశరథి | ఎస్. జానకి |
| 29. | నీకేలా ఇంత నిరాశ | ఆరాధన (ఎన్.టి.ఆర్) | 1976 | ఎస్.హనుమంతరావు | దాశరథి | రఫీ |
| 30 | జో జో చిన్నారి నా చిట్టి తల్లి | అడివి వీరులు | 1971 | కె.వి. మహదేవన్ | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్ |
| 31. | అల్లి బిల్లి రాజా అందమైన అంబారి | అడివి వీరులు | 1971 | కె.వి. మహదేవన్ | ఆరుద్ర | సుశీల, మాధురి |
| 32. | జాం జాం సంతోషం ఎంతో మజా | అడివి వీరులు | 1971 | కె.వి. మహదేవన్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు, సుశీల |
| 33. | మాదీ పేర్ ఖాదర్‌భాషా | ఆట బొమ్మలు | 1966 | ఎస్.పి.కోదండపాణి | జి.కృష్ణమూర్తి | మాధవపెద్ది, పట్టాభి |
| 34. | నువ్వు నేను జట్టు నా లవ్ మీద ఒట్టు | ఆట బొమ్మలు | 1966 | ఎస్.పి.కోదండపాణి | జి.కృష్ణమూర్తి | పి.బి. శ్రీనివాస్, ఎల్. ఆర్. ఈశ్వరి |
| 35. | కనులు పిలిచెను రా రా రా | ఆట బొమ్మలు | 1966 | ఎస్.పి.కోదండపాణి | సి. నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 36. | మత్తు మందు జల్లేవు బుచ్చిబావ | ఆట బొమ్మలు | 1966 | ఎస్.పి.కోదండపాణి | జి.కృష్ణమూర్తి | మాధవపెద్ది, జమునారాణి |
| 37. | మొగ్గలు వీడిన పువ్వులు | ఆట బొమ్మలు | 1966 | ఎస్.పి.కోదండపాణి | జి.కృష్ణమూర్తి | సుశీల |
| 38. | గువ్వ నాదే రోజా పువ్వు నాదే | ఆట బొమ్మలు | 1966 | ఎస్.పి.కోదండపాణి | జి.కృష్ణమూర్తి | ఎస్. జానకి |
| 39. | జో జో బాబు మారాము మానరా | ఆట బొమ్మలు | 1966 | ఎస్.పి.కోదండపాణి | జి.కృష్ణమూర్తి | సుశీల |
| 40. | నాలోన నీవు నీలోన నేను | ఆట బొమ్మలు | 1966 | ఎస్.పి.కోదండపాణి | సి. నారాయణరెడ్డి | ఘంటసాల |

( P.T.O. )

# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 41 | అయ్యయ్యో బ్రహ్మయ్య | అదృష్టవంతులు | 1968 | కె.వి. మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఘంటసాల |
| 42. | చింత చెట్టు చిగురుచూడు | అదృష్టవంతులు | 1968 | కె.వి. మహదేవన్ | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 43. | ముమ్ముమ్ము ముద్దంటే చేదా | అదృష్టవంతులు | 1968 | కె.వి. మహదేవన్ | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 44. | కోడి కూసే జాముదాక | అదృష్టవంతులు | 1968 | కె.వి. మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 45. | నా మనసే గోదారి నీ వయసే కావేరి | అదృష్టవంతులు | 1968 | కె.వి. మహదేవన్ | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 46. | నమ్మరే నేను మారానంటే | అదృష్టవంతులు | 1968 | కె.వి. మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల |
| 47. | మొక్కజొన్న తోటలో | అదృష్టవంతులు | 1968 | కె.వి. మహదేవన్ | కొనకళ్ళ | సుశీల |
| 48. | పడిన ముద్ర చెరిగిపోదురో | అదృష్టవంతులు | 1968 | కె.వి. మహదేవన్ | ఆరుద్ర | సుశీల |
| 49. | పువ్వు వలె నవ్వు వలె | అదృష్టదేవత | 1972 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | సుశీల, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 50. | సాగిపోయే చందమామ | అదృష్టదేవత | 1972 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | సుశీల |
| 51. | వారెవ్వా వన్నెకాడ | అదృష్టదేవత | 1972 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 52. | అందంలో నన్నే నన్నే చూడాలి | అదృష్టదేవత | 1972 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 53. | రగిలే రాస వీణ | అదృష్టదేవత | 1972 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | సుశీల |
| 54. | గాలి వలపు గాలి నన్ను తాకింది | అదృష్టదేవత | 1972 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎస్.పి.బాలు, సుశీల |
| 55. | కాలం కలసి వస్తే | అదృష్టదేవత | 1972 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఘంటసాల , బృందం |
| 56. | అమ్మమ్మో ఏమిటనో ఎందుకనో | అగ్గిమీద గుగ్గిలం | 1968 | సత్యం | దాశరథి | ఎస్.జానకి |
| 57. | ఎందుకే ఎందుకే చందమామ | అగ్గిమీద గుగ్గిలం | 1968 | సత్యం | పింగళి | ఎస్.పి.బాలు, సుశీల |
| 58. | ఒకటి రెండు మూడు ఒకటి మీరు | అగ్గిమీద గుగ్గిలం | 1968 | సత్యం | శ్రీ శ్రీ | ఎస్.పి.బాలు, సుశీల |
| 59. | ఓ గూటిలో గువ్వ | అగ్గిమీద గుగ్గిలం | 1968 | సత్యం | శ్రీ శ్రీ | ఎస్.పి.బాలు, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 60. | కోయ్ రాజా కోతలు కొయ్ రాజా | అగ్గిమీద గుగ్గిలం | 1968 | సత్యం | పింగళి | ఎస్.జానకి, పిఠాపురం |
| 61. | ఎంత మజా గుండారు | అగ్గిమీద గుగ్గిలం | 1968 | సత్యం | కొసరాజు | ఎస్.జానకి, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 62. | నేను పుట్టింది నీకోసం | అగ్గిమీద గుగ్గిలం | 1968 | సత్యం | సి.నారాయణరెడ్డి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 63. | దాగవులే దాగవులే | ఆకాశ రామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | పి.బి.శ్రీనివాస్, ఎస్.జానకి |
| 64. | ముత్యమంటి చిన్నదాన్ని | ఆకాశ రామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎస్.జానకి |
| 65. | ఓ చిన్నవాడ ఒక్కమాట | ఆకాశ రామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎస్.జానకి |
| 66. | జై ఆకాశ రామన్న కి జై | ఆకాశ రామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎస్.జానకి, సత్యారావు |
| 67. | నవ్వు నవ్వేరా బ్రతుకున వరం | ఆకాశరామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎస్.జానకి |
| 68. | దుముకు దుముకు పిల్ల | ఆకాశరామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | యం. సత్యం, ఎస్.జానకి |
| 69. | చల్లగా చల్లగా సోకింది | ఆకాశరామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎస్.జానకి |
| 70. | జలగలా పురుషుల | ఆకాశరామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | మాధవపెద్ది |
| 71. | తేనె పూసిన కత్తి నీ దేశ భక్తి | ఆకాశరామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | బి.గోపాలం |
| 72. | మంచిగానిది (పద్యం) | ఆకాశరామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎస్.జానకి |
| 73. | తళుకు బెళుకు చూపించి (పద్యం) | ఆకాశరామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | బి.గోపాలం |
| 74. | నీకోసం ఏమైనా అయిపోనీ | ఆకాశరామన్న | 1965 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎస్.జానకి |
| 75. | తారలెంతగా మెరిసెనో | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | రఫీ |
| 76 | ఈ మాయని గుర్తు కోసం | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | రఫీ |
| 77. | తన మేలిముసుగు తాకి | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | రఫీ, సుశీల |
| 78. | మదన మోహనుడె | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | సుశీల, ముస్తఫాఖాన్ |
| 79. | సిపాయి ఓ సిపాయి | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | రఫీ, సుశీల |
| 80. | వేళ ఎరగిన దొరవుంటే | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | సుశీల, వాణీజయరాం |
| 81. | కలుసుకున్నా గుబులు ఏలా | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | రఫీ, పి. సుశీల |
| 82. | తమ ఆనతికొక సలాం | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | సుశీల |
| 83. | ఓ దేవా గుడిలో బందీవై | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |
| 84. | రేయి ఆగిపోనీ | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | రఫీ.పి.సుశీల |
| 85. | ఇది తండ్రికొడుకుల నడుమ | అక్బరు సలీం అనార్కలి | 1978 | సి. రామచంద్ర | సి. నారాయణరెడ్డి | రఫీ |

సేకరణ:
పి. శేషగిరిరావు,
విశాఖపట్నం.

వచ్చే సంచికలో మరికొన్ని

ఫిబ్రవరి 28 ఇందీవర్ వర్ధంతి సందర్భంగా...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం









చిత్రం : క్రిమినల్ (1995)
రచన : ఇందీవర్
సంగీతం : ఎమ్.ఎమ్.కీరవాణి
గానం : కుమార్ సాను, అల్కా యాజ్ఞిక్
అభినయం : నాగార్జున,మనీషా కోయిరాలా, రమ్యకృష్ణ

## తూ మిలే...

తూ మిలే, దిల్ ఖిలే
ఔర్ జీనే కో క్యా చాహియే
తూ మిలే, దిల్ ఖిలే
ఔర్ జీనే కో క్యా చాహియే
నా హోతూ ఉదాస్ తేరే పాస్ పాస్ మైం రహూంగా జిందగీభర్ (2)
సారే సన్సార్ కా ప్యార్ మైనే తుఝీ మేం పాయా ॥తూ మిలే॥

గమ్ హై కిసే సారా జహాం చాహే దుష్మన్ హో
క్యా చాహియే హోథోం మేం జో తేరా దామన్ హో
తూ హై జహాం మంజిల్ వహాం (2)
ధడ్‌కనోంకీ తరహ్ అప్‌నే దిల్ మేం ముఝ్‌కో ఛుపాలో ॥తూ మిలే॥

చందా తుఝే దేఖ్‌నే కో నిక్‌లా కర్‌తా హై
అయినా భీ దీదార్ కో తర్‌సా కర్‌తా హై
ఇత్‌నీ హసీం కోయీ నహీం (2)
హుస్న్ దోనో జహాం కా ఎక్ తుఝ్‌మేం సిమట్‌కే ఆయా ॥తూ మిలే॥

ప్యార్ కభీ మర్‌తా నహీం, హమ్ తుమ్ మర్‌తే హైం
హోతే హైం వో లోగ్ అమర్ ప్యార్ జో కర్‌తే హైం
జిత్‌నీ అదా, ఉత్‌నీ వఫా
ఇక్ నజర్ ప్యార్‌సే దేఖ్‌లో ఫిర్‌సే జిందా కర్‌దో ॥తూ మిలే॥

'అన్నీ ఉన్న ఆకు అణిగిమణిగి ఉంటుంద'ంటారు. ఆ అన్నిటి కిందా ఉన్న ఆకు కనుమరుగై పోతుంది కూడా. అలాగే ఎంతో ప్రతిభ ఉన్నా పెద్దగా వెలుగులోకి రాని గీత రచయిత ఇందీవర్. ఆయన పాటలే ఆయన పరిచయంగా మిగిలిపోయాయి. 'సఫర్'లోని 'జీవన్ సే భరీ', 'జిందగీ కా సఫర్', 'జో తుమ్‌కో హో పసంద్', 'హమ్ థే జిన్‌కే సహారే' పాటలు చాలు ఆయన రేంజ్‌ని తెలియజేయటానికి. ఆయన పాటలు రాసిన చిత్రాలలో ఎక్కువ శాతం కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ సంగీతం అందించినవే. ఇందీవర్ గురించి ఆనంద్‌జీ మాటల్లో చెప్పాలంటే 'ఆయన ఖచ్చితమైన మనిషి. పాట పర్‌ఫెక్ట్‌గా రావటానికి ఆయన ఎంత సమయమైనా వెచ్చించేవారు. 'సరస్వతీచంద్ర', 'సఫర్', 'పూరబ్ ఔర్ పశ్చిమ్', అమానుష్', 'ధర్మాత్మ',











'కుర్బానీ', 'డాన్' 'ప్రేమ్‌గీత్' చిత్రాలకు ఇందీవర్ ఆణిముత్యాల వంటి పాటలు రాశారు. 'అమానుష్'లోని 'దిల్ ఐసా కిసీనే మేరా తోడా' పాటకు ఆయనకు ఫిలింఫేర్ అవార్డు వచ్చింది. పద్మభూషణ్ జగజీత్‌సింగ్ సినీ జీవితంలో ఓ మైలురాయిగా నిలిచిన 'హోఠోం సే ఛూలో తుమ్' (ప్రేమ్‌గీత్) పాట రాసింది ఇందీవరే.

ప్రఖ్యాత హిందీ దర్శకుడు మహేష్‌భట్ తెలుగు, హిందీ భాషలలో ఏకకాలంలో తీసిన చిత్రం 'క్రిమినల్'. ఈ చిత్రంతో ఆయనకు తెలుగు చిత్ర పరిశ్రమలోని ఇద్దరు వ్యక్తులతో అనుబంధం ఏర్పడింది. అందులో ఒకరైన నాగార్జునతో ఆయన 'అంగారే', 'జఖ్మ్' వంటి చిత్రాలను రూపొందించారు. రెండోవారైన కీరవాణి మహేష్‌భట్ నడిపే సంస్థలు రూపొందించిన 'జఖ్మ్', 'సుర్', 'జిస్మ్' చిత్రాలకు సంగీతం అందించారు.

తెలుగు 'క్రిమినల్'లో 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి ఒక చక్కని పాట రాశారు.

**తెలుసా మనసా**
**ఇది ఏనాటి అనుబంధమో**
**తెలుసా మనసా**
**ఇది ఏ జన్మ సంబంధమో**
**తరిమిన ఆరు కాలాలు ఏడు లోకాలు చేరలేని ఒడిలో**
**విరహపు జాడలేనాడు వేడి కన్నీసి చూడలేని జతలో**
**శత జన్మాల బంధాల బంగారు క్షణమిది ॥తెలుసా మనసా॥**

**ప్రతిక్షణం నా కళ్ళలో నిలిచె నీ రూపం**
**బ్రతుకులో అడుగడుగునా నడిపె నీ స్నేహం**
**ఊపిరే నీవుగా, ప్రాణమే నీదిగా**
**పదికాలాలు ఉంటాను నీ ప్రేమ సాక్షిగ ॥తెలుసా మనసా॥**

**ఎన్నడూ తీరిపోని ఋణముగా ఉండిపో**
**చెలిమితో తీగసాగే మల్లెగా అల్లుకో**
**లోకమే మారినా, కాలమే ఆగినా**
**మన ఈ గాథ మిగలాలి తుదిలేని చరితగ ॥తెలుసా మనసా॥**

ఈ పాట వచ్చే సందర్భానికి ఇందీవర్ హిందీ 'క్రిమినల్'కి ఇంతే చక్కని పాట రాశారు. అదే 'తూ మిలే' పాట. ఈ పాటలో మూడు చరణాలున్నాయి. ఈ పాట సూపర్ హిట్టవటానికి కీరవాణి బాణీ, ఇందీవర్ పాళీ సమాన కారణాలు. ఈ పాటకు కుమార్ సానుకి ఫిలింఫేర్ నామినేషన్ వచ్చింది.

'తూ మిలే' అంటే 'నువ్వు కలిస్తే' అని. ఖిల్‌నా అంటే విరియటం. 'ఔర్ జీనేకో క్యా చాహియే' అంటే 'జీవించేందుకు ఇంకేం కావాలి' అని. ఉదాస్ అంటే దిగులుపడటం. సన్సార్ అంటే ప్రపంచం.

**'నువ్వొస్తే మది విచ్చె**
**మనుగడకు ఇది చాలులే**
**నువ్వొస్తే మది విచ్చె**
**మనుగడకు ఇది చాలులే**
**మదిలో చింత వీడు, నీ చెంత నేను ఉంటాను చివరి దాకా**
**మదిలో చింత వీడు, నీ చెంత నేను ఉంటాను చివరి దాకా**

ఆమె ఉంటే అతని మనసు పూవులా విచ్చుకుంటుందట. జీవించటానికి ఆమె ఉంటే చాలతనికి. తమకు వియోగం ఎప్పుడూ రాదని ఆమెకు స్వాంతన ఇస్తున్నాడు. ఈ ప్రపంచంలో ఉన్న ప్రేమంతా ఆమెనుంచే పొందాడట అతను. తెలుగు పాట పల్లవిలో ఉన్న 'విరహం లేని జత' అనే భావం 'జీవితమంతా నీ చెంతనే ఉంటాను' అనే మాటతో చెప్పారిక్కడ.

గమ్ అంటే బాధ. జహాఁ అంటే లోకం. దుష్మన్ అంటే శత్రువు. దామన్ అంటే ఒడి, కౌగిలి. మంజిల్ అంటే గమ్యం. ధడ్‌కన్ అంటే గుండె సవ్వడి. ఛుపానా అంటే దాచటం.

**'లోకమంతా పగవారైనా దిగులే లేదులే**
**నీ కౌగిలి నాకున్నచో అంతే చాలులే**



**నువ్వెక్కడో నేనక్కడే, నువ్వెక్కడో నేనక్కడే**
**గుండెలో దాచుకో నన్ను నీ గుండె సవ్వడి లాగ'**

లోకంతా శత్రువులే అయినా అతని తోడుంటే చాలు ఆమెకి. అతనున్నచోటే ఆమె గమ్యం. అతని ప్రాణంలో ప్రాణంగా ఒదిగిపోవాలని ఆమె కోరిక.

చందా అంటే చందమామ. ఆయీనా అంటే అద్దం. తరస్‌నా అంటే తపించటం. హసీం అంటే అందమైనది. హుస్న్ అంటే సౌందర్యం. 'దోనో జహాఁ' అంటే 'రెండు లోకాలూ' అని. తెలుగులో మనం మూడు లోకాలు లేదా ముల్లోకాలు అన్నట్టు హిందీలో 'దోనో జహాఁ' అంటారు. సిమట్‌నా అంటే ఒదగటం.

**'నీ మోమును చూసేందుకే చంద్రుడు వచ్చేను**
**అద్దం కూడా చూడాలని ఎదురు చూసేను**
**ఇంతందంగా ఎవరున్నారు, ఇంతందంగా ఎవరున్నారు**
**మూడు లోకాల సౌందర్యమంతా ఒదిగింది నీలో'**

చంద్రుడు ఆమెను చూడటానికే ఉదయిస్తాడట. అద్దం కూడా ఆమెను చూడాలని తహతహలాడుతుందట. ఎంత రొమాంటిక్ భావాలు! ముల్లోకాలలో ఉన్న సౌందర్యమంతా ఆమెలోనే ఒదిగి ఉందట.

మర్‌నా అంటే చావటం. అమర్ అంటే అమరులు. అదా అంటే సొగసు, వయ్యారం, అందం. వఫా అంటే విశ్వాసం. బంధమనే అర్థంలో కూడా వాడతారు. నజర్ అంటే చూపు. 'జిందాకర్ దో' అంటే 'బతికించు' అని.

**'ఈ ప్రేమకు చావేలేదు, మనము లేకున్నా**
**అమరులే ప్రేమలో పడినవారంతా**
**అందమంత బంధముంది, అందమంత బంధముంది**
**ప్రేమతో చూడు ఒకసారి, మళ్ళీ నే బతికొస్తాను'**

ఈ చరణం హీరోయిన్ చనిపోయిన తర్వాత నేపథ్యంలో వస్తుంది. ప్రేమకు చావేలేదని, నిజమైన ప్రేమికులందరూ అమరులేనని భావం. ప్రేమలో ఎంత అందముందో అంత బంధం కూడా ఉంటుంది. ప్రేమ నిండిన హృదయాలలో కనుమరుగైన వారు కూడా కలకాలం జీవిస్తారు.

తెలుగు పాటకు, హిందీ పాటకు ట్యూన్ ఒకటే. స్థూలంగా భావం కూడా ఒకటే. కాకపోతే హిందీ పాటలోని రెండో చరణం నాయిక అందాన్ని పొగిడేందుకు అదనంగా వ్రాశారు. మిగిలిన చరణాలలో మాటలు వేరైనా సార్వజనీనమైన ప్రేమభావాన్నే చెప్పారు. తెలుగుపాటలో 'లోకమే మారినా' అనే భావాన్ని హిందీలో 'లోకమంతా శత్రువైనా' అని చెప్పారు. 'ప్రాణంలో ప్రాణం' అనే భావాన్ని తెలుగుపాటలో 'ఊపిరే నీవుగా ప్రాణమే నీదిగా' అని చెప్తే హిందీలో 'నన్ను నీ గుండే చప్పుడులా మార్చుకో' అని చెప్పారు. కాలానికి అతీతమైన వారి ప్రేమను వివరిస్తూ తెలుగులో 'కాలమే ఆగినా మన గాథ మిగలాలి' అని అంటే హిందీలో 'మనము లేకున్నా మన ప్రేమకు చావులేదు' అన్నారు. 'చెలిమితో తీగ సాగే మల్లెలా అల్లుకో' అంటే 'నీ కౌగిలి కావాలి' అనే కదా! 'నీ ప్రేమ సాక్షిగా పదికాలాలు ఉంటాను' అని తెలుగులో అంటే హిందీలో 'నువ్వు ప్రేమతో ఒక చూపు చూస్తే చాలు, మళ్ళీ బతికి వస్తాను' అని ప్రేమ అమరత్వాన్ని చాటారు.

90 దశకంలో వచ్చిన ప్రేమ గీతాలలో ఈ గీతం ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించింది.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

---

## హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

**1952**

సింగర్ గా 8 సంవత్సరాలు కెరీర్ సాగించిన హేమంత్ కుమార్ తొలిసారిగా 'ఆనంద్ మఠ్' చిత్రం ద్వారా సంగీత దర్శకునిగా పరిచయం అయ్యారు. ఈయన స్వరకల్పనలో లతామంగేష్కర్ గానం చేసిన 'వందేమాతరం... ' పెద్ద హిట్. అది ఓ విప్లవగీతంలా ఉంటుంది.



'ఆనంద్ మఠ్' చిత్రంలో గీతాబాలి

'ఆస్మాన్' చిత్రం ద్వారా ఓంకార్ ప్రసాద్ నయ్యర్ సంగీత దర్శకునిగా పరిచయం. ఆయన మాటల్లోనే చెప్పాలంటే ఈ చిత్రం ఆకాశమంత ఫ్లాప్!

గాయని ఆశాభోంస్లే, గీత రచయిత వర్మామాలిక్‌లను పరిచయం చేసిన సంగీత దర్శకుడు హన్స్‌రాజ్‌బెహల్, 'మోతి మహల్' చిత్రం ద్వారా అసద్ భోపాలిను రచయితగా పరిచయం చేసారు. హన్స్‌రాజ్ స్వరకల్పనలోనే 'అప్‌నీ ఇజ్జత్', 'జగ్గు' చిత్రాలకు పనిచేసిన భోపాలి తర్వాత 'పారసమణి', 'మైనే ప్యార్ కియా' వంటి హిట్ చిత్రాలకు కూడా పనిచేసారు. గీతాన్ని పేపర్ మీద రాయనక్కర్లేకుండా నోటితో చెప్పగలగడం భోపాలి ప్రత్యేకత.

మదన్‌మోహన్ స్వరకల్పనలో రూపొందిన 'అషియానా', రోషన్ స్వరకల్పనలో రూపొందిన 'అన్‌హోని' చిత్రాలలో హీరో రాజ్‌కపూర్‌కు ముకేష్ స్థానంలో తలత్ మెహమూద్ గళాన్నిచ్చారు. అయితే 'అన్‌హోని' ఫ్లాప్ అయినప్పటికీ 'మై దిల్‌హూఁ ఏక్ అర్మాన్ భరా....', తో పాటు దిలీప్ కుమార్ కోసం పాడిన 'సంగ్‌దిల్' చిత్రంలోని 'యే హవా యే రాత్ చాందినీ...' (సాజిద్ సంగీతాన్నిచ్చారు) తలత్‌కు మంచిపేరు తీసుకువచ్చాయి. 'పూనమ్', 'పర్‌బత్' చిత్రాల హిట్‌ద్వారా శంకర్-జైకిషన్‌లకు ప్రాధాన్యత బాగా పెరిగింది. 'దాగ్' చిత్రంకోసం వీరు స్వరపరిచిన ' యే మేరే దిల్ కహీఁ ఔర్ చల్....'మ్యూజికల్‌గా పెద్దహిట్. ఈ గీతం తలత్ మెహమూద్ హిట్స్‌లో ప్రముఖంగా చెప్పుకోదగినది.



'అన్‌హోని' చిత్రంలో నర్గీస్

నౌషాద్ సంగీతాన్నిచ్చిన 'దునియా'('యే దునియా కైసీ హై భగవాన్...'), రోషన్ స్వరపరిచిన 'సంస్కార్'(బదలేగి దునియా ఎక్ దిన్....) చిత్రాల కొరకు హృదయనాథ్ మంగేష్కర్ ప్లేబ్యాక్ పాడారు.

మ్యూజిక్ ఎరేంజర్ సోనిక్ గీత రచయిత వర్మమాలిక్‌తో కలిసి 'మమత' చిత్రానికి చక్కటి సంగీతం ఇచ్చారు. ఈ సోనిక్ తర్వాతి కాలంలో మేనల్లుడు ఓమి, వర్మమాలిక్‌లతో కలిసి టీమ్‌గా ఏర్పడి 'సావన్ భాదోఁ', 'మేమ్‌సాబ్', 'ధర్మ్', 'వో మైఁ నహీఁ' చిత్రాలను మ్యూజికల్‌గా హిట్ చేసారు.

నవకేతన్ సంస్థ నిర్మించిన 'అంధియాఁ' ద్వారా సితార్ విద్వాంసుడు అలీ అక్బర్ ఖాన్ సినీ సంగీతంలో ప్రవేశించారు. లతా గానం చేసిన 'హాయ్ కహీఁ పర్ ...'(మూడు వెర్షన్లు) పెద్ద హిట్ అయింది. తర్వాత ఉస్తాద్, ఆర్.డి.బర్మన్ కు సితార్ నేర్పించారు.



అలీ అక్బర్ ఖాన్

# రాజా ఆడియో రివ్యూ




విడుదల : సురభి
వెల : రూ॥50/-

వేటూరి రాసిన ఎనిమిది సినీగీతాల వరుసల్ని తీసుకుని ఆ ట్యూన్‌లను యథాతథంగా వయొలిన్‌పై వాయింపజేస్తూ 'సురభి' అనే మకుటం కింద శ్రీ ఎ.వి.యస్. ప్రకాష్ ఆడియో క్యాసెట్లను, సీడీలను విడుదల చేశారు. వీటిని పి.అన్నపూర్ణ శ్రీనివాస్ సమర్పించగా ఈ ఎనిమిది గీతాల ట్యూన్‌లను శ్రీ ఎస్. బ్రహ్మానందం వయొలిన్‌పై పలికించారు.

మనసెరిగినవాడు మా రాముడు (పంతులమ్మ), నెమలికి నేర్పిన నడకలివి (సప్తపది), మనసా తుళ్లి పడకే (శ్రీవారికి ప్రేమలేఖ), ఆమని పాడవే హాయిగా (గీతాంజలి), కంచికి పోతావా కృష్ణమ్మా (శుభోదయం), వయ్యారి గోదారమ్మ ఒళ్ళంత ఎందుకమ్మ కలవరం (ప్రేమించు - పెళ్ళాడు) (ఇది 'వెన్నెల్లో గోదారమ్మ' అంటూ ఇన్‌లే కవర్‌పై తప్పుగా ప్రింట్ అయింది), రాలిపోయే పూవ్వా నీకు రాగాలెందుకే (మాతృదేవోభవ), మాటే మంత్రము (సీతాకోక చిలుక) పాటల ట్యూన్‌లను శ్రీ బ్రహ్మానందం చాలా పెర్ఫెక్ట్‌గా వాయించి తన సీనియారిటీ ని నిరూపించు కున్నారు. అన్ని ఏ ా ట ల ట్యాన్లా వయొలిన్‌పై హాయిగా, వినసొంపుగా పలికాయి. అలాగే మిగతా పాటల్లోనూ, నెమలికి నేర్పిన నడకలివి పాటలోనూ - దత్తాత్రేయ ఫ్లూటు అతి చక్కగా అమరింది. మానసికంగా ప్రశాంతతను చేకూర్చే గుణం కొన్ని వాద్యసంగీతాలకు వుంది. ఆ కోవలోకి ఈ క్యాసెట్‌ను కూడా చేర్చుకోవచ్చు.

ఈ క్యాసెట్ వేటూరి జన్మదినాన్ని పురస్కరించుకొని వెలువడింది. అంతవరకు బాగానే వుంది. కాకపోతే 'వేటూరి హిట్స్' అని పేరు పెట్టడంలోనే ఔచిత్య భంగం వుంది. ఈ క్యాసెట్‌లో మనకు వినిపించేవి ట్యూన్‌లు. వేటూరి సాహిత్యం కాదు. ఈ పాటలతో పూర్తి పరిచయం వున్నవారికి వేటూరి సాహిత్యం గుర్తొస్తుంది...అంతే! అది లేనివారికి ఇది కేవలం ఇన్‌స్ట్రుమెంటల్ మ్యూజిక్ మాత్రమే... అటువంటప్పుడు ఈ ట్యూన్‌లు రాజన్-నాగేంద్ర, కె.వి.మహదేవన్, రమేష్‌నాయుడు, ఇళయరాజా, ఎం.ఎం.కీరవాణిల హిట్స్ అవుతాయి గాని వేటూరి హిట్స్ ఎలా అవుతాయి!?

ఏది ఏమైనా ఇది వినదగ్గ, ఇంట వుంచకోదగ్గ క్యాసెట్. ఇన్‌లే కవర్ లోపల ఈ క్యాసెట్ రూపకల్పనకు సహకరించిన వాద్యకారులు, ట్రాక్ పాడినవారు, కండక్ట్ చేసినవారు, స్టూడియో ఇన్‌చార్జ్ మొదలైన వారిపేర్లు, ఫోటోలు ముద్రించటమనేది అభినందించదగ్గ సంస్కారం.

## మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు




విడుదల:హెచ్.ఎం.వి
వెల :రూ॥80/-(రెండూ కలిపి)




విడుదల:హెచ్.ఎం.వి
వెల :రూ॥40/-

ఫిబ్రవరి 28న ఇందీవర్ వర్ధంతి సందర్భంగా...



# హిందీ పాటకు ఇందీ'వరం' ఓ చందన పరిమళం

'చందన్ సా బదన్ చంచల్ చిత్‌వన్' పాట వినగానే మనసు చుట్టుముట్టే కవితా చందన పరిమళం హిందీ చిత్రసీమకు ఓ ఇందీ'వరం'. ఈ పాట శ్రీ ఇందీవర్‌కు ఫిలింఫేర్ అవార్డు తెచ్చిపెట్టింది. ఇదే సినిమాలోని 'ఛోడ్ దే సారీ దునియా కిసీకే లియే', 'ఫూల్ తుఝే భేజా హై ఖతోమే ఫూల్ నహీ మేరాదిల్ హై' పాటలు ఇప్పటికీ 'సరస్వతీ చంద్ర' చిత్రాన్ని గుర్తుకు తెస్తూనే ఉన్నాయి. ఈ చిత్రానికి సంగీత దర్శకులు కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీలు. ఆ తరువాత వీరితో కలిసి హిమాలయ్ కీ గోద్‌మే, జానీ మేరానామ్, ఉప్‌కార్, సఫర్, ఖుర్బానీ, ధర్మాత్మా, సచ్చా ఝూటా వంటి చిత్రాల్లో పాటలు రాశారు. వాటన్నిటిలోనూ విపరీతంగా పాప్యులర్ అయినది 'మేరే దేశ్‌కే ధర్తీ'.

రోషన్ - ఇందీవర్‌ల అనుబంధం రెండుతరాల వరకు నడిచింది. 1948లో బొంబాయిలో అడుగుపెట్టిన ఇందీవర్‌కు 'డబుల్ ఫేస్'లో పాటలు రాసే అవకాశం వచ్చినా పేరు వచ్చింది మాత్రం 'మల్హార్' (1951)తోనే. ఈ చిత్రంలో అతను రాసిన "బడే అర్మానోంసే రఖ్ఖాహై బలమ్ తేరీ కసమ్... పెహలా కదమ్" రోషన్ స్వరకల్పనలో ముఖేష్, లతల కంఠాలలో జీవంపోసు కుంది. ఈ పాటతో మొదలైన తన గీతయానంలో అయనెప్పుడూ వెనక్కి తిరిగి చూసుకోలేదు. అది మొదలు రోషన్‌తో ఆయన జోడీ చాలా కాలం పాటు కొనసాగింది. రోషన్ మృతి తరువాత కుమారుడు రాజేష్‌రోషన్‌తో కూడా కల్సిపని చేశారాయన. రాజేష్‌రోషన్‌కు కామ్ చోర్, ఖుద్‌గర్జ్, కిషన్ కన్హయ్యా ఖూన్‌భరీ మాంగ్, జుర్మ్ కరణ్-అర్జున్ చిత్రాలకు పాటలు రాశారు ఇందీవర్.

'జీవన్ సే భరీ తేరీ ఆంఖే' (సఫర్) 'కోయీ జబ్ తుమ్హారా హృదయ్ (పూరబ్ ఔర్ పశ్చిమ్) వంటి పాటలు గొప్పగా భావగర్భితంగా రాసిన ఆయనే మలిదశలో 'తాకీ ఓ తాకీ' (హిమ్మత్‌వాలా) 'మామా మియా పామ్ పామ్ (జస్టిస్‌చౌదరి), ఝూప్ డీ మే చార్‌పాయి (మక్సద్), ధూప్‌మె నిక్‌లా న కరో రూప్‌కి రాణీ (గిరఫ్తార్) వంటి ఊక దంపుడు గీతాలు రాయడమేమిటీ అన్నవారికి తడుముకోకుండా "నా సంగీత దర్శకులు కోరినట్లుగానే రాశాగానీ మరోకలా కాదు. రచయిత అన్నాక అన్నీ రాయాలి. నే రాయనంటే వేరెవరో రాస్తారు. గిరిగీసుకుని ఉండలేను. అయినా ఇవి ద్వంద్వార్థాల పాటలుకావు. దర్శకులే వాటిని దిగజార్చేలా చిత్రీకరణ చేస్తున్నారన్నారాయన. అంగన్ మే బాబా- దర్‌పే మా (ఆంఖే - గోవిందాది), సెక్సీ-సెక్సీ (ఖుద్దార్) పాటలు దర్శకుల వల్లనే చెడిపోయిన వన్నారొకసారి. అయితే ఈ దశలో కూడా 'యే బంధన్ తో ప్యార్‌కి బంధన్ హై, జాతీ హు మై జల్దీ హై క్యా (కరణ్ - అర్జున్), రూప్ సుహానా లగ్తా హై - చాంద్ పురానా లగ్తా హై (జంటిల్మన్), నా కజ్రేకి ధార్ (మొహ్రా), తుమ్ మిలేదిల్ ఖిలే (క్రిమినల్) వంటి మంచి పాటలు కూడా రాశారాయన.

జీవితం గురించి ఇందీవర్ పాటలు ఎన్నో విషయాలు బోధిస్తాయి. 'జిందగీకో బహుత్ ప్యార్ హమ్ నే దియా, మౌతేసే భీ మొహబ్బత్ నిభాయేంగే' (జీవితానికి ఎంతో ప్రేమనిచ్చాం, మృత్యువునీ ప్రేమిద్దాం అన్న అయనే "అనోఖీరాత్"లో 'నదియా చలే చలేరే చందా చలే చలేరే తారా తుఝ్‌కో చల్‌నా హోగా (నదిలాగ, చంద్రునిలాగ మనమూ నిరంతరం సాగిపోతూనే ఉందాం) అంటారు.

'మేరే దేశ్‌కే ధర్తీ' పాట రాయాలంటే ఎంతో దేశభక్తికావాలి. ఇదేకాదు, 'పూరబ్ ఔర్ పశ్చిమ్'లోని 'యే ప్రీత్... జహాకీ రీత్‌యహా' పాట కూడా ఇందీవర్ దేశభక్తికి దర్పణం పట్టింది. ఆరో తరగతి చదువుతూనే దేశభక్తిని చాటే కవిత్వం రాశారాయన. ఆ ప్రేరణతోనే 1942 'క్విట్ ఇండియా' ఉద్యమంలో పాల్గొని జైలుకెళ్లారు. అలహాబాద్‌లో హిందీలో ఎం.ఎ. చేసే నాటికే గొప్ప యువకవిగా గణుతికెక్కారాయన. దేశభక్తి భావంతో వార్ధాలోని గాంధీ ఆశ్రమంలో చేరాలనుకున్నారు. కానీ ప్రవేశం దొరకలేదు. అప్పుడు "సినిమాలకు దేశభక్తి గీతాలు రాయి" నీకు మంచి భవిష్యత్తు ఉంటుందనే మిత్రుల సలహా మేరకు 1948లో బొంబాయిలో కాలుమోపారు ఇందీవర్.

1924లో మధ్యప్రదేశ్‌లోని ఝాన్సీ జిల్లా "బారువా సాగర్" గ్రామంలో "శ్యాంలాల్"గా పుట్టిన ఇందీవర్ 1997 ఫిబ్రవరి 28న మృతి చెందే వరకు అయిదు దశాబ్దాల కెరియర్‌లో ఎన్నో మైలురాళ్ళు. పైన చెప్పినవే కాక 'సుహాగ్ రాత్, మవాలి, బేవఫాయి (1985), కింగ్ అంకుల్, ఇన్‌స్పెక్టర్ ధనుష్, నసీబ్ వాలా (1991), ఇన్‌సానియత్ కి దేవతా (1993), అమానత్, ఆర్‌పార్, పత్థర్ ఔర్ పాయల్, ఆషిక్, ఫరేబ్, ఖుద్రత్, ఖఫా, దో మస్తానే వంటి చిత్రాలతో కలసి మొత్తం సుమారు 360 చిత్రాల్లో 2500 పాటలు రాశారు. 'సచ్చాఝూటా'లోని 'మేరీ ప్యారీ బెహనియా బనేగీ దుల్హనియా' దేశమంతా పల్లెపదంగా మారిపోయింది. ప్రతి పెళ్లిలోనూ మొదటి పాట అయింది. ఆ పాట వినబడుతున్నంతకాలం మనం ఆయనను మరువలేం.

-హెచ్. రమేష్‌బాబు







విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.40/-

## డైరెక్టర్ స్పెషల్ - కె.విశ్వనాథ్ సినీ హిట్స్

కళా తపస్వి శ్రీ కె.విశ్వనాధ్ దర్శకత్వం వహించిన చిత్రాలలోని పాటలను పదిహేనిటిని తీసుకుని 'డైరెక్టర్స్ స్పెషల్' అనే మకుటంపై 'కె.విశ్వనాధ్ సినీహిట్స్' పేరిట ఓ ఆడియో క్యాసెట్‌ను హెచ్.ఎం.వి. వారు తీసుకువచ్చారు.

ఒక పూల బాణం తగిలింది మదిలో (ఆత్మగౌరవం), చరణ కింకిణులు (చెల్లెలికాపురం), అద్దంలో కనిపించేది ఎవరికి వారు (ప్రైవేట్ మాస్టారు), నెమలికి నేర్పిన నడకలివి (సప్తపది), సన్నజాజి సొగసుంది (కాలంమారింది), కంచికి పోతావా కృష్ణమ్మా (శుభోదయం), మౌనవేలనోయి (సాగరసంగమం), అడుగడుగున గుడి ఉంది (ఉండమ్మా బొట్టు పెడతా), పచ్చపచ్చని చిలకా (కలిసొచ్చిన అదృష్టం), మావిచిగురు తినగానే (సీతామహాలక్ష్మి), శారదా నను చేరగా (శారద), మల్లెకన్న తెల్లన (ఓ... సీత కథ), చిన్ని ఓ చిన్ని (జీవనజ్యోతి),సామజవరగమన (శంకరాభరణం), ఆదిభిక్షువు వాడినేది కోరేది (సిరివెన్నెల) మొదలైన పాటలు ఈ క్యాసెట్‌లో వున్నాయి.

ఈ పదిహేను పాటలూ ఎంతగా హిట్ అయ్యాయో తెలుగు వారందరికీ తెలుసు. ఇందులో బైట అంతగా దొరకని అరుదైన పాటొకటి వుంది. అది 'ప్రైవేటు మాష్టారు' చిత్రంలో 'అద్దంలో కనిపించేది ఎవరికి వారు' అనే పాట! అలాగే ఇదే చిత్రంలోని 'పాడుకో పాడుకో పాడుతూ చదువుకో' అనే పాట కూడా ఇప్పుడంతగా లభ్యం కావటం లేదు. ఆ రోజుల్లో హిట్ అయిన రీతిలో ఆలోచించుకుంటే 'ఆ పాట పెట్టివుండవచ్చు కదా' అని సంగీత ప్రియులకు అనిపించవచ్చు.

అలాగే 'విశ్వనాధ్ పేరుతో క్యాసెట్ తెస్తూ శంకరాభరణంలో పాటలేదేంటి' అని కూడా అనిపించవచ్చు. ఏది ఏమైనా-మంచి పాటలను ఏదో ఓ రూపంలో వ్యాప్తిలోనికి తీసుకువచ్చే ఏ ప్రయత్నాన్నైనా ప్రోత్సహించవలసిందే...! ■




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.40/-

## సీతామాలక్ష్మి-పదహారేళ్ళ వయసు

చంద్రమోహన్ హీరోగా నటించిన 'సీతామాలక్ష్మి-పదహారేళ్ళ వయసు' చిత్రాల కాంబినేషన్ క్యాసెట్‌ను హెచ్.ఎం.వి. వారు విడుదల చేశారు. 'సీతామాలక్ష్మి' అనగానే గుర్తొచ్చే మావిచిగురు తినగానే కోవిల పలికేనా, నువ్విట్టా నేనిట్టా, కొక్కరొకో, పదే పదే పాడుతున్నా, సీతాలు సింగారం, ఏ పాట నే పాడను, చాలు చాలు- పాటలను,

'పదహారేళ్ళ వయసు' అనగానే గుర్తొచ్చే సిరిమల్లె పూవ్వా, వయసంతా ముడుపు గట్టి, కట్టు కథలు చెప్పి నేను నవ్విస్తే, పంటచేలో పాలకంకి నవ్వింది, సిరిమల్లె పూవ్వా(రిపీట్) పాటలను కలిపి మొత్తం 12 పాటలనూ ఈ క్యాసెట్‌లో పొందుపరిచారు. ఇలాంటి కాంబినేషన్ క్యాసెట్లు తరచు వస్తుండాలి. అప్పుడే-క్యాసెట్ రూపంలో రాని కొన్ని పాటల్ని తిరిగి ఇప్పుడున్న మ్యూజిక్ సిస్టమ్స్‌లో పెట్టుకుని వినే వీలుంటుంది. రెండు సినిమాల్లోని పాటలూ మ్యూజికల్‌గా హిట్టే కాబట్టి కొనుక్కున్న సంగీత ప్రియులకు కాంబినేషన్‌లో నష్టపోయేమే అనే బాధ కలిగే సందర్భం లేదు. ■

## మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు




విడుదల : హెచ్.ఎం.వి
వెల : రూ॥40/-




విడుదల : హెచ్.ఎం.వి
వెల : రూ॥40/-




విడుదల : హెచ్.ఎం.వి
వెల : రూ॥40/-

రచన: వెన్నెలకంటి (1) గానం : బాలు, గోపికా పూర్ణిమ

అ: నీ రూపం చిత్రిస్తూనే నే మైమరిచా
మైమరపే ప్రేమగా మారి నే నిను వలచా
ఆ: వలపించు తలపే పిలుపైన వేళ
పలికింది నాలో సంగీతమే
అ: ఆ గీతమే తీయగా పాడనా... ఆ....ఆ.... ॥నీ రూపం॥
అ: చుక్కలన్నీ ఒక్కటైతే చిత్రము
కళ్ళు కళ్ళు కలుసుకుంటె కావ్యమూ
ఆ: గీతలన్నీ చిత్రమందు భాగమే
మాటలన్నీ ప్రేమ ముందు మౌనమే
అ: ఆ నింగి రంగు నీలమంట
మన ప్రేమ రంగూ ఏమిటంటా
ఆ: నీ కుంచెలకే చూపొచ్చీ రేఖలకే రూపొచ్చీ
మన ప్రేమలు చిత్రించే నా..... ॥అ: నీ రూపం॥
ఆ: చిత్రమందు జీవమెక్కడున్నది
అ: చెలియ సోగ కళ్లలోనే ఉన్నది
ఆ: తనువులోన ప్రేమ ఎక్కడున్నది
అ: చూపు పడని చోట దాగి ఉన్నది
ఆ: నీ చిత్రమందు ఓ చిత్రముంది
నీ మాటలోన మధుమంత్రముంది
అ: తెలి మబ్బు తేరెక్కి ఇల చేరే జాబిలివా
జత చేర చెలియా నువ్ రా.. ॥అ: నీ రూపం॥

రచన: వెన్నెలకంటి (2) గానం : బాలు, మనో& కోరస్

అరె బుజ్జీ బుజ్జీ తల తిరిగి తిరిగీ నీ బుర్రే చెడిపోయింది
నా బుర్రాలోనా పాలపిట్టలు కొన్ని ఎగిరెగిరి పోయాయేమైంది
అరె డాలర్ లాగా మత్తు ఎక్కిపోతే
మన రూపాయిలాగా బుద్ధి జారిపోయే మత్తు ఎక్కితే
కొంచెం జ్ఞానమొస్తది మత్తు దిగాక ఆ జ్ఞానం పోతది ॥అరె బుజ్జీ॥
ఏదైనా మత్తొకటి ఎప్పుడూ కావాలంట లేదంటే మనుషులకు శక్తి లేదు
తల్లి పాల్లో మత్తు ఉంది సారాయిలో మత్తు ఉంది
రెంటినీ విడదీసే బుద్ధిలేదే
తల్లి పాల మత్తు కొద్ది నెలల మాత్రం సారాయి మత్తు మన జీవితాంతం
మత్తు మారిన నీ బుద్ధి మారునా కుక్క తోకకు ఆ వంకర తీరునా ॥అరె బుజ్జీ॥
బతుకే పెన్నిధిరా మనముందే ఉన్నదిరా బలముండి దోచుకొని బతికితే తప్పా



నీతోటి కార్మికులు ॥2॥
వీధినున్నారు పోరాటం చేస్తున్నారు జీతాల్ని పెంచమన్నారు
ఇప్పుడు నీకు లవ్ ఎందుకు అరె ॥2॥
బుద్ధి తెచ్చుకో యూనియన్ జెండా పుచ్చుకో పోరాడి హక్కు గెల్చుకో ॥పోరాడి॥
అ: లవర్ దగ్గర జ్ఞానోపదేశం పొందిన కథానాయకుడు
తానూ పోరాటంలోకి దిగుతున్నాడయ్యా
హీన పక్షము కూలిమ్మని చట్టమున్నది దాంతో పైసా కూడా తగ్గరాదని రూలు ఉన్నది
వందలాది చట్టాలెన్నో ఉన్నాగాని
కొందరు యిష్టానికి కూలి డబ్బు తగ్గించిస్తారు పేదల శ్రమనే దోస్తారు
ఆ: ఇంత తక్కువ జీతాలిచ్చి కార్మికుల కడుపే కొట్టే పెద్ద మనిషి ఎవరమ్మా
అదిగో అటు చూడమ్మా
కో: నువ్వు వర్థిల్లంటూ పగలురేయీ గొంతులెత్తి అరుస్తూనే అణిగీ మణిగుంటాం
మా బతుకులెట్టా మారేదీ మా కష్టమెట్టా తీరేదీ
అ: ఏయ్ ఏంటో వెళ్ళడగరా
వాళ్ళకి మనం ఎక్కించాలంట
కొట్టాననంటే చెప్పుతో
అయ్యయ్యయ్యో....అది కాదండీ వాళ్ళకి జీతమెక్కించాలంట
ఓ..ఇవ్వగలిగింది తొమ్మిది వందల పదేరా
ఇవ్వబోనింక ఒక్క పైసా ఎక్కువా
వీళ్ళని ఎలా మేనేజ్ చేస్తారు అయ్యగారూ
కో: ఉద్యమించిన జనత ఉప్పెనై పొంగింది విప్లవమ్మై మారి వెల్లువై దూకింది
కన్నీటి గాధలకు ఇది అంతం ఇంక కడలేని విజయాలు మన సొంతం ॥ కన్నీటి ॥

రచన: వెన్నెలకంటి (6) గానం : బాలు, కోరస్

అ: నేనూ శివం నీవూ శివం సత్యం శివం స్నేహం శివం
ఆస్తికులైన హితులందరికీ శివమే సత్యమట
నాస్తికులైన స్నేహితులకు ఆ సత్యమే శివమట ॥నేనూ శివం॥
కో: సత్యం శివం సత్యం శివం స్నేహితం
సత్యం శివం సత్యం శివం జీవితం ॥నేనూ శివం॥ ॥2॥
అ: మనసే వున్న మనిషే ఉంటే వాడే దేవుడురా
దేవుడు కూడా మనిషై పుడితే మోక్షం పొందును రా
కో: సత్యం శివం సత్యం శివం స్నేహితం
సత్యం శివం సత్యం శివం జీవితం ॥నేనూ శివం॥ ॥2॥
అ: సాటి మనిషికి సాయంచేసే మతమే నీ మతమూ
మానవ సేవే మాధవ సేవను హితమే సమ్మతమూ
కో: సత్యం శివం సత్యం శివం స్నేహితం
సత్యం శివం సత్యం శివం జీవితం



రచన: దాసరి (1) గానం : కీరవాణి, ఉష

ఆ: ఆ....ఆ.....ఆ.....
అ: సౌందర్యమా కలగన్న కాశ్మీరమా ॥2॥
ఆ: శృంగారమా నయగార జలపాతమా
అ: ముళ్లపూడి కథకు నీవు
ఆ: కృష్ణశాస్త్రి కవితనౌతా
అ: కలలు కంటున్న కాశ్మీర అందాలకు కన్నె రూపాన నా ముందు నీవుంచవా
ఆ: పులకరిస్తున్న నీ మనసు ఉయ్యాలకు ఊపిరవుతాను కడదాకా నీ ప్రాణమై ॥సౌందర్యమా॥
అ: మాట చెప్పాలని మనసు నీవైపు వస్తుందిలే
ఆ: మాట చెప్పాకనే మనసు నీ వైపు మళ్ళిందిలే ॥మాట చెప్పాలని॥
అ: గుప్పెడంత మనసు నీతో ఏమంది
ఆ: గుట్టుగా నను నిన్ను కట్టుకోమంది
అ: అది విన్న నీ మనసు ఏమి అంటూంది
ఆ: మాంగల్యధారణ ఎప్పుడంటుంది ॥సౌందర్యమా॥
ఆ: నీలి మేఘానికి మెరిసే మెరుపంటే ఇష్టమేలే
అ: నింగిలో తారకి వచ్చు ప్రతి రేయి ఇష్టమేలే ॥నీలి మేఘానికి॥
ఆ: పరిమళించాలని ప్రతి పూవుకాశ
అ: పరుగు తీయాలని సెలయేటికాశ
ఆ: వెన్నెలే కురిపించు జాబిలికి ఆశ
అ: నీ ఒడిలో నిదురించ నాకేమో ఆశ ॥అ:ఆ: సౌందర్యమా॥

రచన: భైదల బాపు (2) గానం : చక్రి

బస్సు ఎక్కితే కావాలోయ్ బాసు నీకు టిక్కెట్
టిక్కెట్ టిక్కెట్ టిక్కెట్ టిక్కెట్ ॥8॥
ట్రెయిన్ ఎక్కినా అడిగెదరోయ్ బాబు నిన్ను టిక్కెట్
టిక్కెట్ టిక్కెట్ టిక్కెట్ టిక్కెట్ ॥8॥ ॥బస్సు॥
ప్లాట్‌ఫారంకో టిక్కెట్ నువు ఫ్లైట్ ఎక్కిన టిక్కెట్
M.P. సీటుకో టిక్కెట్ M.L.A. కొరకు మరో టిక్కెట్
అన్నిటికి యిచ్చేటి ఈ టిక్కెట్టూ ప్రేమించడానికి నీకెవ్వరిస్తారు
టిక్కెట్ టిక్కెట్ టిక్కెట్ టిక్కెట్ ॥8॥ ॥బస్సు ఎక్కితే॥
దేవుడి గుడికి వెళ్తే నీకు క్యూలో ఇచ్చును టిక్కెట్
దేవదాసు సినిమాకు వెళ్ళినా కావలయ్యా టిక్కెట్
ఆసుపత్రికి వెళ్ళామంటే టోకెన్ అంటూ టిక్కెట్
అరకులోయ అందాలన్నీ నువు చూడాలంటే టిక్కెట్
హోటల్లో ఫుడ్‌కో టిక్కెట్ లాడ్జిలో బెడ్‌కో టిక్కెట్



అ: చెప్పుమరి ఆ: సరే సరి అ: చెప్పుమరి ఆ: సరే సరి
అ: నిన్న మొన్న ఎరుగని కలవరమా చిన్ని చిన్ని ఆశల తొలి జ్వరమా
ఆ: నా మాట తడబడి నా మనసు కలబడి ఏనాడు ఎరుగని ఇలాంటి అలజడి
అ: చినుకు చినుకు కురిసి గాలి వాన అవుతున్నది
తడిపి తడిపి ఇద్దరిని ఒకటి చేస్తున్నది
ఆ: ఎర్రబడ్డ కళ్ళ తీరు వణుకుతున్న పెదవి పేరు కొట్టుకొనే గుండె జోరు చెప్పకనే చెబుతున్నది
అ: ఏమిటది ఆ: ప్రేమ అది ॥2॥ ॥ అడుగు ॥
ఆ : నిన్న రాత్రి నిద్దురలో కలగన్నా లేనిపోని ఊహలలో సెగలయ్యా
అ: ప్రేమంటే ఏమిటో ఆనాడు తెలియదు ఈ నరకయాతనే ఆ ప్రేమ కాబోలు
ఆ: తెలియకుండ ప్రేమ ఉచ్చులోన చిక్కాము
తెలియగానే ప్రేమ బిచ్చగాళ్లమయ్యాము
అ: నిన్న మొన్న నువ్వు నేను ఎవరికెవరు నేడు రేపు నిన్ను నన్ను
కలిపి కలిపి ఒక్కటిగా కట్టిపడేస్తున్నది
ఆ: ఏమిటది అ: ప్రేమ మరి ॥2॥ ॥అ: అడుగు॥

రచన: దాసరి (6) గానం : వందేమాతరం, శ్రీలేఖ

ఆ: ఓయ్...ఏంటోయ్...నడుమే పట్టేసు కున్నావ్
ఓయ్...ఏంటోయ్...ముద్దే పెట్టేసుకున్నావ్ ॥2॥
అ: చిలకా చిలకా వాలేవు గుండెల్లోన దూరావు తలుపేస్తే తప్పా ॥2॥ ॥ఆ: ఓయ్॥
ఆ: నడుమా నడుమా ఎందుకు జారావ్
అ: మీ ఒంపు మీద వేలు తాకితే జారదా జారదా
ఆ: బుగ్గా బుగ్గా ఎందు కొరికావు
అ: వెన్నలాంటి పెదవి దొరికితే కొరకనా కొరకనా
ఆ: నీ ప్రేమ కార్డుని ప్రింటు వేసుకో పెళ్ళి కాపోతే అదుంచుకో ॥2॥
అ: లగ్గో లగ్గో లగ్గమెట్టుకో
ఆ: ఎగ్గో ఎగ్గో ఎగరేస్కుపో ॥2॥ ॥ఓయ్॥
అ: ప్రేమా ప్రేమా ఎందుకు పుట్టావు
ఆ: నా సొట్ట బుగ్గలో వేలుపెడితే పుట్టనా పుట్టనా
అ: బుగ్గా బుగ్గా ఎందుకు మెరిసావు
ఆ: ఉరుము ఉరిమి మాయమైతే మెరవనా మెరవనా
అ: మెరుపు తీగవై నన్ను అల్లుకో ప్రేమ దీపమై ఇల్లు చేరుకో ॥2॥
ఆ: లగ్గా లగ్గా లగ్గామెట్టుకో
అ: ఎగ్గో ఎగ్గో ఎగరేస్కుపో ॥2॥ ॥ఆ: ఓయ్॥

అ: గానమే ఆటగా ఆడుకుందాం....రావమ్మా...
అ: కలిసిన కన్నుల స్వప్నమిది తెలిసిన మనసుల స్వర్గమిది
ఆ: సరిగమ పలికిన నాదమిది ఇరువురి గుండెల దేహమిది
అ: మధుమాసాల మంత్రాలే మోగే నీవా ఎదలోకటైన పయనాలే సాగేనీవా
కో: ఎదలేకమైనది ఈ ప్రేమ ఒక లోకమైనది ఈ ప్రేమ
తడబాటులేనిది ఈ ప్రేమ ఎడబాటులేనిది ఈ ప్రేమ
అ: మన సంబరాలే అంబరాలు తాకంగా
ఇక మోజులన్నీ జాజిపూల వానవల్లే కురియా ॥అ:ఆ:మౌనమే॥

రచన: వెన్నెలకంటి **5** గానం: బాలు&కోరస్

అ: దేశాన్నే మేలుకొల్పగా ఆశపడ్డ మేధావి వచ్చానండీ
ఆటలాడీ పాటపాడీ అందమైన కథ చెప్ప వచ్చానండీ
మంచి మాట మీకు నేను చెబుతానండీ
పెద్ద వాళ్ళ గుట్టే రట్టు చేస్తానండీ
తొమ్మిది వందల పది రూపాయల కథనే వినరండి
కార్మికుల కడుపే కొట్టే కథనే వినరండి
అయ్యా వినరండి! అమ్మా వినరండి!
అన్నా వినరండి! అక్కా వినరండి!
వినండి వినండి వినండి వినండి ॥6॥
తత్తోం థిత్తోం ఇదిగో నా కథ మీ కథ వినరండి
తకథోం తకథోం అదుగో నా తల మీ తల రాతలండి
అహో మహాజనులారా అటువంటి కథ ఆరంభంలో
మన కథానాయకుడు అంటే తొమ్మిది వందల పదిరూపాయల జీతగాడు
తోటి కార్మికులందరూ ఫ్యాక్టరీ కట్టినప్పటి నుంచి జీతాలు పెంచమని
సమ్మెలు చేస్తున్న సమయంలో వాళ్ళందరినీ తెలివిగా తప్పించుకొని విడిగా వెళ్తున్నాడు
ఆ: ఎక్కడకి వెళ్తున్నాడు
అ: వెళ్లేముందే ఎక్కడికని అడిగితే బాగుపడతామా
అ: వాడూ సైటు కొట్ట వెళ్తున్నాడోయ్
తన లవర్ర్ కోసం వెళ్తున్నాడోయ్
అ:కో:హో...హో...ఒహో..
అ: పిల్లా బుగ్గల పిల్లా పోకే మనసును దోచి
నీ ముద్దుల కోసం పగలు రేయి ఉన్నానే వేచి ॥పిల్లా బుగ్గల॥
టౌను బస్సు వెళుతుంది ఖాళీగా మనం సినిమా చూసివద్దాం రావే జాలీగా ॥2॥
ఆ: మాసానికి నీ జీతం తొమ్మిది వందల పది
కుటుంబ భారం మోసేందుకు ఏదయ్యా శక్తి



ఇంకోడి కడుపు కొట్టి నువ్వు దోచుకుంటే తప్పు
లేనోడు పస్తులుంటే ఈ భూమికి వచ్చే ముప్పు
నువ్వు వాదనలో గొప్ప వాడివి వంటా అరె లీడరుకే నువ్వు గురువువంటా
మాట తీరుకే జోహారు చెప్పనా హిమాలయాల్లో నేను ఐస్ అమ్మనా ॥అరె బుజ్జీ॥

రచన: వెన్నెలకంటి **3** గానం : కమల్ హాసన్&కోరస్

అ: నేనే శివమ్ నీవూ శివమ్
స..త్య..మ్ శివమ్ స్నే..హమ్ శివమ్
ఆస్తికులైన హితులందరికీ శివమే సత్యమట
నాస్తికులైన స్నేహితులకు ఆ సత్యమె శివమంట
కో: సత్యమ్ శివమ్ సత్యమ్ శివమ్ స్నేహితమ్ ॥2॥
సత్యమ్ శివమ్ సత్యమ్ శివమ్ జీవితమ్ ॥2॥ ॥నేనే శివం॥
అ: నేనే శివమ్ నీవూ శివమ్
స..త్య..మ్ శివమ్ స్నే..హమ్ శివమ్
మనసే వున్న మనిషే ఉంటే వాడే దేవుడురా
దేవుడు కూడా మనిషై పుడితే మోక్షం పొందును రా
కో: సత్యమ్ శివమ్ సత్యమ్ శివమ్ స్నేహితమ్ ॥2॥
సత్యమ్ శివమ్ సత్యమ్ శివమ్ జీవితమ్ ॥2॥ ॥నేనే శివం॥
అ: నేనే శివమ్ నీవూ శివమ్
సాటి మనిషికి సాయంచేసే మతమే నీ మతమూ
మానవ సేవే మాధవ సేవని హితమే సమ్మతమూ
కో: సత్యమ్ శివమ్ సత్యమ్ శివమ్ స్నేహితమ్ ॥2॥
సత్యమ్ శివమ్ సత్యమ్ శివమ్ జీవితమ్ ॥2॥ ॥నేనే శివం॥

రచన: వెన్నెలకంటి **4** గానం: బాలు,సుజాత

అ: మౌనమే పాటగా పాడుకుందాం గానమే ఆటగా ఆడుకుందాం
ఆ: కళ్లలో కావ్యమే రాసుకుందాం ఒకరిలో ఒకరినే చూసుకుందాం
అ: శ్రీరాగం శ్రుతి చేసిన మన అనురాగం
జత చేరిన ఈ శుభయోగం భోగం మనదమ్మా... ॥మౌనమే...రావమ్మా॥
అ: జననం ప్రేమ మరణం ప్రేమ ప్రేమే మధురం
ఆ: చలనం ప్రేమ జ్వలనం ప్రేమ ప్రేమే అమరం
కో: చలనంగ సాగినది ఈ ప్రేమ చరితల్లే మిగిలినది ఈ ప్రేమ
మధురంగ పిలిచినది ఈ ప్రేమ మరణాన్ని గెలిచినది ఈ ప్రేమ
అ: నా ఆశ నీ గుండెల్లోని శ్వాస ఎద మాటాడేటి భాష నీకే తెలుసమ్మా...
ఆ: మౌనమే పాటగా ॥2॥ పాడుకుందాం



ఆ: మా అక్కా చెల్లెల్లకు మూడు ఎకరాల భూమున్నది
చూడ చక్కని రేగడి బాబూ బాగుంటది దిగుబడి
కో: ఓ...యస్
ఆ: దుక్కి దున్నీ పంట తీసే వాళ్లు ఉంటే అప్పజెప్పాలంటూ వచ్చాం వెతుక్కుంటూ
బురద నాగలున్నదా బండెద్దులు వున్నవా ఉన్నపోరగాళ్ళకే కౌలుకిస్తం మేము సై
చేయండి ఈ సాయమూ నేడే మొదలెట్టే వ్యవసాయమూ...ఆ....
మీ మేలు మేమరువమూ ఇంకా మిమ్మల్నేప్పుడూ విడవమూ
తయ్యం దత్తయ్య ॥2॥
అంబాజీ పేటోళ్లమూ మేము అంబారమెక్కిస్తాం ॥2॥

రచన: దాసరి **4** గానం : దేవిశ్రీప్రసాద్, స్వర్ణలత

అ: తన్నులు తింటే తిన్నాను గాని జున్నులాంటి కన్నెపిల్ల వెన్నలాగా నోటి కందిందీ
పట్టుకు పోనా నేను కట్టుకు పోనా ॥2॥
ఆ: తిప్పలు పడితే పడ్డాను కానీ లడ్డులాంటి పొట్టివాడు జిడ్డులాగా అంటుకున్నాడు
హత్తుకుపోనా నేనెత్తుకుపోనా ॥2॥ ॥తన్నులు॥
అ: డిసిన్‌వాన్‌నే చూశా లవ్‌లెటరే రాశా
నువు చూశాకా వద్దని వదిలేసా
సిమ్రాన్‌నే చూశా లవ్‌లెటరే రాశా
నువు చూశాకా వద్దని వదిలేసా
ఆ: ఐశ్వర్యను చూస్తావేమో నను వేస్టని పోతావేమో నిను నమ్మడమే కష్టమురా బచ్చా
అ: నన్ను నమ్మి చెడిన వారెవరూ లేరంటే నమ్మవే బజ్జీ ॥2॥
ఆ: బౌరా నిజమా పోరా ఒరె డింగిడికి జింగిడి ॥అ: తన్నులు॥
ఆ: చిరంజీవిని కలిశా షేక్‌హాండ్‌ని యిచ్చా ఐలవ్‌యూ చిరూ అని చెప్పేశా ॥2॥
అ: తొందరపడిపోయావేమో నన్ను వేస్టనుకున్నావేమో నీ ఈడుకి జోడు నేనే చిన్నీ
ఆ: తగ్గు తగ్గురా చిన్నా నువ్వు నెగ్గలేవు నాగన్నా ॥2॥
అ: ఐ సీ ఓ.కే థాంక్యూ ఓసి డింగడిక జింగడి... ॥అ: తన్నులు॥

రచన: దాసరి **5** గానం : ఆర్.పి.పట్నాయక్, విష్ణు

అ: అడుగు అడుగనీ...మనసు అడుగుతుంటే ॥2॥
అడగలేక అడగలేక అడుగుతున్నా
నా అడుగులోన అడుగు వేయటం నీకు ఇష్టమేనా...
నా మనసులోన మనసు దాచటం నీకు ఇష్టమేనా...
ఆ: అడుగు మరి అ: తెలుపుమరి ఆ: అడుగు మరి అ: తెలుపుమరి
ఆ: మరి మరి అడుగుతుంటే దాచలేని మనసు ॥2॥
చెప్పమంది మరి మరి



పార్టీలో పదవికి టిక్కెట్ తిరుపతిలో లడ్డుకు టిక్కెట్
పుట్టే కాలం నుండి పాడెక్కే కాలం వరకు ప్రతి ఒక చోట నీకు ఇస్తున్నప్పుడు టిక్కెట్
ప్రేమించడానికి ఒక్క టిక్కెట్ నీకు ఏదయ్యో
టిక్కెట్ టిక్కెట్ టిక్కెట్ టిక్కెట్ ॥8॥ ॥బస్సు ఎక్కితే॥
పుట్టే టప్పుడు అమ్మే యిచ్చును జన్మ అనే ఓ టిక్కెట్
పెరిగేటప్పుడు నాన్నే యిచ్చే చేయూతేరా టిక్కెట్
చదువు సంధ్యలను నేర్పించే మాష్టారు యిచ్చే సర్టిఫికేట్
ఇద్దరి నొకటి చేయడానికి తాళే పెళ్ళికి టిక్కెట్
వాన చినుకులకి టిక్కెట్ ఆ మేఘమిచ్చురా టిక్కెట్
వాగు వంకలకి టిక్కెట్ ఈ పుడమి యిచ్చురా టిక్కెట్
పగలే కావాలంటే ఆ సూర్యుడు యిచ్చును టిక్కెట్
వెన్నెల కురవాలంటే ఆ చంద్రుడు యిచ్చును టిక్కె ట్
ప్రేమించడానికి ఒక్క టిక్కెట్ నీకు ఏదయ్యో
టిక్కెట్ టిక్కెట్ టిక్కెట్ టిక్కెట్ ॥8॥ ॥బస్సు ఎక్కితే॥

రచన: సుద్దాల అశోక్ తేజ **3** గానం : రాధిక, సుధారాణి

కో: రింబోలా రిం రిం రింబోలా...
ఆ: ఆకు చాటు పిందెలం కలిసికట్టుగా పుట్టినం ॥2॥
రెమ్మ విప్పని పూవులం కొమ్మ ఎరుగుని చుమ్మలం ॥2॥
ముగురప్పా చెల్లెళ్ళం మగ దిక్కు లేనోళ్లం ॥2॥
హే...హే...హే... ఎవరయినా చోటిస్తే
మకాము పెట్టేస్తాం పాలు పొంగిచేస్తాం ॥2॥
తయ్యం దత్తయ్య ॥2॥
ఆ: అంబాజీ పేటోళ్లమూ మేము అంబారి ఎక్కిస్తాము ॥2॥ ॥ఆకు చాటు॥
ఆ: హో....హో.... కో: అహ...అహ... ॥2॥
ఆ: తమలాపాకు విప్పుతాం మీరు తడిసున్నమంటిస్తారా
కిర్రిత్తే కిళ్ళిస్తాము మీరు ఎర్రాని కాసవుతారా
కో: ఓ... యస్..
ఆ: మర్యాద మా యింటి దర్వాజాకే ఎరుక మసక చీకటైతే మనకెందుకు బురఖా
పెళ్లాల్ల రసారసా మీకుండదోయ్ ఏ నస నాజూకు మిసమిస కాసేమో గుసగుస రా సై..
ఉఁ అంటే ఉయ్యాలలం మేమూ జోజో జగల్బందిలం
కుర్రాళ్ళు చిటికేస్తే మేమూ మూడు గుర్రాల జట్కావుతాము
తయ్యం దత్తయ్య ॥2॥ ॥ఆకు చాటు॥
హే...అహ...అహ...అహ...అహ....
కో: రింబోలా...రిం రిం రింబోలా..

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : సత్యానంద్ |
| ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ | : యం.యస్.కోటారెడ్డి |
| స్క్రిప్ట్ సహకారం | : కాశీ విశ్వనాథ్ |
| సంగీతం | : వందేమాతరం శ్రీనివాస్ |
| ఫోటోగ్రఫీ | : శ్రీనివాసరెడ్డి |
| ఎడిటింగ్ | : బి.కృష్ణంరాజు |
| ఆర్ట్ | : యం.వెంకటేశ్వర్లు |
| కాస్ట్యూమ్స్ | : రాజు |
| పబ్లిసిటీ డిజైనర్ | : కృష్ణ (కృష్ణ డిజిటల్స్) |
| మేకప్ | : బాబు |
| స్టిల్స్ | : ధర్మ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : తాండవకృష్ణ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : జి.జగదీష్‌చంద్ర ప్రసాద్ |
| పి.ఆర్.ఓ. | : జగన్ |
| నిర్మాత | : యం.రవీంద్రబాబు |
| కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం | : దాసరి నారాయణరావు |


దాసరి నారాయణరావు


యం.రవీంద్రబాబు

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

శేషశాయి సినీ క్రియేషన్స్

దాసరి నారాయణరావు

# ఫూల్స్
FOOLS

నిర్మాత : యం. రవీంద్రబాబు B.E.(Mech.) MBA   వందేమాతరం శ్రీనివాస్

## తారాగణం

శ్రీనాథ్, గజాలా, చంద్రమోహన్, జయసుధ, కైకాల సత్యనారాయణ, గిరిబాబు, మాగంటి సుధాకర్, బ్రహ్మానందం, సుధాకర్, ఎల్.బి.శ్రీరామ్, ధర్మవరపు సుబ్రమణ్యం, కోవై సరళ, గీతాంజలి, షకీలా, కృష్ణకుమారి, అనూజ, రమ్యశ్రీ, విజయశ్రీ, అశోక్‌కుమార్, చిట్టిబాబు, రాళ్ళపల్లి, జోగిబ్రదర్స్, జూనియర్ రేలంగి, కె.కె.శర్మ, జెన్నీ
**& దాసరి నారాయణరావు, నటశేఖర కృష్ణ**


సుద్దాల అశోక్‌తేజ


బైదలబాపు

హాసం   ఫూల్స్   4   5   ఫూల్స్   హాసం

పద్మశ్రీ కమల్‌హాసన్ సమర్పించు
దశరథ సంగిశెట్టి సారథ్యంలో

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

సిరి సాయి సూర్య మూవీస్

# సత్యమే శివం

సంగిశెట్టి సబిత
G.లక్ష్మీనారాయణ

సుందర్.C.
విద్యాసాగర్

వెన్నెలకంటి • ఆర్థర్.A.విల్సన్ • విక్రమ్ ధర్మ • M.ప్రభాకరన్ • బృందా..దినేష్ • బి.అర్జున్ రావు

MUSIC ON LEO

## తారాగణం

పద్మశ్రీ కమల్‌హాసన్, మాధవన్, కిరణ్, నాజర్, సీమ, సంతాన భారతి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ, స్క్రీన్‌ప్లే | : పద్మశ్రీ కమల్‌హాసన్ |
| మాటలు-పాటలు | : వెన్నెలకంటి |
| సంగీతం | : విద్యాసాగర్ |
| డాన్స్ | : బృంద దినేష్ |
| స్టంట్స్ | : విక్రమ్ ధర్మా |
| ఆర్ట్ | : ఎమ్.ప్రభాకరన్ |
| సినిమాటోగ్రఫీ | : ఆర్థర్ ఎ.విల్సన్ |
| ఎడిటింగ్ | : పి.సాయిసురేష్ |
| ఫ్రెండ్లీ కో-ఆపరేషన్ | : బి.అర్జునరావు |
| పి.ఆర్.ఓ. | : యం.యన్.భూషణ్ |
| నిర్మాతలు | : సంగిశెట్టి సబిత, జి.లక్ష్మీనారాయణ |
| దర్శకత్వం | : సి.సుందర్ |


సంగిశెట్టి దశరథ


విద్యాసాగర్


వెన్నెలకంటి

## న్యూస్ వ్యూస్

అమర గాయకుడు ఘంటసాలకు ఆయన వర్ధంతి (ఫిబ్రవరి 11) నాడు తెలుగుజాతి అరుదైన నివాళి అర్పించింది! కేంద్రప్రభుత్వం అందుకు సహకరించింది. కోట్లాది ఘంటసాల అభిమానుల కోర్కె ఈడేరేట్లు ఆయన 29వ వర్ధంతి నాడు తపాలాశాఖ ఘంటసాలపై స్టాంపు విడుదల చేసింది. హైదరాబాద్‌లో జరిగిన కార్యక్రమంలో కేంద్రమంత్రి తిరునావుక్కరసర్, ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు, అక్కినేని నాగేశ్వరరావుగారలు పాల్గొన్నారు. ఈ సందర్భం పురస్కరించుకుని ఘంటసాల తనయుడు రత్నకుమార్, ఇతర కుటుంబ సభ్యులు కలిసి ఘంటసాల సహచరులయిన గాయనీగాయకులను సత్కరించారు. అనంతరం నాటి, నేటి మేటి కళాకారుల సంగీత విభావరి జరిగింది.

### ఈ కార్యక్రమ విశేషాలు

- లీల, జిక్కి, సుశీల, జానకి, పి.బి.శ్రీనివాస్, ఎస్పీబాలసుబ్రహ్మణ్యం, రామకృష్ణ, మనో, శైలజ, జి.ఆనంద్ వంటి కళాకారులతో వేదిక కిక్కిరిసిపోగా లలిత కళాతోరణం ఆహూతులతో కిటకిట లాడింది. పాస్ లేనిదే అనుమతించక పోవడం వలన ఎంతో మంది అభిమానులు బయట నిలబడి పోయి నిరాశకు గురయ్యారు.
- స్టాంపు ప్రచురణకు ఆమోదించిన ప్రమోద్ మహాజన్. విడుదల చేసే సమయానికి మంత్రి పదవి అధిష్టించి, ఫంక్షన్‌కు స్వయంగా విచ్చేసిన తిరునావిక్కరసర్ - ఇద్దరూ ఆంధ్రేతరులు అయినా ఘంటసాల అభిమానులు కావడం విశేషం. మహాజన్ నిజామాబాద్‌లో కొద్దికాలం విద్యాభ్యాసం చేయడం వల్ల, తిరునావుక్కరసర్ మద్రాసు వాసి కావడం వల్ల ఇది సాధ్యపడింది.
- 'ఉన్నోళ్ళు పోయినోళ్ళ తీపి గురుతులు' అని ఘంటసాల పాడినట్లుగానే ఆయన గుర్తుగా నేనుమిగిలాను, నాలో ఆయన సగభాగం' అన్నారు అక్కినేని.
- ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం తన మూడు కోర్కెలు తీర్చాలని కాలేజీలో తన జూనియర్‌గా ఉండిన చంద్రబాబు నాయుడు గారిని పట్టుబట్టారు. అవి-

1) ఘంటసాల విగ్రహాన్ని లలిత కళాతోరణం నుండి రవీంద్ర భారతికి తరలించాలి.

2) నగరంలో ఘంటసాల పేర సంగీత కళాశాల కై ప్రభుత్వస్థలం కేటా యించాలి.

3) నగరంలో ముఖ్యమైన రహదారికి ఘంటసాల పేరు పెట్టాలి.

చంద్రబాబు మొదటి రెండు కోర్కెలను వెంటనే సమ్మతించారు. (మూడవ కోర్కె అతి సులభమయినది. అది కూడా తీర్చాలని ఘంటసాల అభిమానుల తరపున 'హాసం' కోరుతున్నది.)

- వినూత్నమైన ప్రణాళికలతో దినదినం అభివృద్ధి చెందుతున్న 'మా టీవి' ఈ కార్యక్రమం టెలికాస్ట్ చేసే హక్కులను సంపాదించుకుంది. త్వరలో మాటీవిలో ఈ కార్యక్రమాన్ని తిలకించవచ్చు.
- శ్రీ చల్లా సుబ్బారాయుడు కూర్చిన 'ఘంటసాల గీతాల పుస్తకం ఈ సభలో ఆవిష్కరించబడింది. .




### ఈ స్టాంపు ప్రత్యేకతలు

☆ అచ్చంగా ఓ సినీ సంగీత కళాకారుడి పేర స్టాంపు విడుదల కావడం ఇదే ప్రథమం. ఇంతకు ముందు కె.ఎల్.సైగల్ పేర విడుదలయినా ఆయన నటుడుకూడా. ☆ గురువు ద్వారం వెంకటస్వామి నాయుడు పేర, శిష్యుడు ఘంటసాల పేర స్టాంపులు విడుదల కావడం ఒక విశేషం. ☆ స్టాంపు పై ఒకే వ్యక్తి రెండు ఫోటోలు ఉండడం అరుదు. ☆ స్మారక తపాలా బిళ్ల విడుదలకై ఈ స్థాయిలో ఫంక్షన్ జరపడం అరుదని తిరునావక్కరసర్ అన్నారు.

---

అగ్రకథానాయకుల చిత్రాలకు పనిచేయాలన్న సంగీత దర్శకుడు చక్రి కోరిక ఇన్నాళ్లకి తీరింది. పూరిజగన్నాథ్ దర్శకత్వంలో వైష్ణో అకాడమీ పతాకంపై నిర్మింపబడుతున్న 'శివమణి 98480 - 22338' అనే చిత్రం ఫిబ్రవరి 3వ తేదీన అన్నపూర్ణ స్టూడియోలో ప్రారంభమయింది. అక్కినేని నాగార్జున ఈ చిత్రానికి కథానాయకుడు. ఆయన 'ఇడియట్' చిత్రాన్ని చూశారు. పూరిజగన్ స్టయిల్ ఆఫ్ టేకింగ్, క్యారక్టరైజేషన్‌తోపాటు చక్రి సంగీతాన్ని కూడా ఇష్టపడ్డారు.అంచేతే ఆయన చక్రిని ఓకే చేశారు. ఆ చిత్రంలో చక్రి టాలెంట్‌ని ఆయన మరో చిత్రానికి ఉపయోగించు కోబోతున్నారుట కూడా. ఆ వివరాలు పక్కన పెట్టేసి ప్రస్తుతం ఈ 'శివమణి' చిత్రం వివరాల కొస్తే ఇందులో ఆరు పాటలు వుంటాయి. ఆల్రెడీ ఒక పాటకి ట్యూన్ ఓకే అయిపోయింది. 16వ తేదీన ఈ సంచిక వెలవడే సరికి మరొక ట్యూన్ కూడా ఓకే అయిపోతుంది. "టాప్‌హీరోల చిత్రాలకు పనిచేయాలన్న నా కోరిక ఇన్నాళ్ళకి ఫలించింది." అని అన్నారు చక్రి 'శివమణి' చిత్రం ప్రారంభోత్సవంలో. చాలా చిత్రాలకు ఇవాళ 'మ్యూజిక్కే టాప్‌హీరో' అని అన్నాడో పాత్రికేయుడు ఆ ప్రెస్‌మీట్‌లో. అది విన్న నాగార్జున 'ఔనన్నట్లుగా' తలూపేరు చిరునవ్వుతో. ప్రస్తుతం చక్రి చేతిలో రిలీజ్ కావలసిన సినిమాలు 8 దాకా ఉన్నాయి.



---

ప్రముఖ నటుడు మోహన్‌బాబు తనయుడు విష్ణువర్ధన్‌బాబు హీరోగా 'తెరంగేట్రం' చేస్తున్న 'విష్ణు' చిత్రం ప్రారంభోత్సవం ఇటీవల అన్నపూర్ణ స్టూడియోలో అత్యంత వైభవంగా జరిగింది. అగ్రకథానాయకులు, యువకథానాయకులతో పలువురు సినీ ప్రముఖులు హాజరైన ఆనాటి ప్రారంభోత్సవ వేదిక కిక్కిరిసిపోయింది. ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారి చేతుల మీదుగా ప్రారంభించబడిన ఈ చిత్రం ప్రారంభోత్సవ వేడుక జెమిని టి.వి.లో 'లైవ్' ప్రసారమయింది. ఆనాటి వేడుకకు హాజరయిన అభిమానులు, వాలంటీర్ల కోసం, విష్ణువర్ధన్‌బాబు ఫోటోతో 10,000 టీ షర్టులను ప్రింట్ చేయించారు. కట్టిన బ్యానర్‌లు, అంటించిన పోస్టర్‌లు కూడా వేల సంఖ్యలోనే ఉన్నాయి. ప్రారంభోత్సవమే ఇంత రిచ్‌గా ఉంది కదా సినిమా ఇంకెంత రిచ్‌గా వుంటుందోనని ఆహూతులైన ప్రతివారూ అనుకునేలా రూపొందుతున్న 'విష్ణు' చిత్రానికి దర్శకుడు షాజీకైలాస్. ఇటీవల 'దేవదాస్' ద్వారా ఖండాంతర ఖ్యాతిని పొందిన ఇస్మాయిల్ దర్బార్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. 'ఏడున్నర పాటలుంటాయి. అని మోహన్‌బాబు పత్రికా సమావేశంలో తెలిపారు. 'ఏడు పాటలు ఆల్రెడీ రికార్డ్ అయిపోయాయి. అన్నీ మన నేటివిటీ టచ్‌తో చాలా బాగా వచ్చాయి" అని అన్నారు మోహన్‌బాబు సోదరుడు ఎమ్.కృష్ణ.




బుడుప్పలావు
సత్యమూర్తి BV
ఏమిట్రా లెక్కపెడుతున్నావ్?
ఇంటర్వ్యూలో 'నువ్వెక్కిన మేడకి మెట్లెన్ని?' అని అడుగొచ్చు. 96 అని ఠక్కుమని చెప్పేస్తా.
కళ్ళు మూసుకుని, నీ చొక్కాకి ఎన్ని బటన్స్ ఉన్నాయో చెప్పుకో చూద్దాం
చచ్చాం!.... సార్ నేను ఎక్కిన అంతస్థులకి ఎన్ని మెట్లున్నాయో చెప్పనా?
స్టుపిడ్... లిఫ్ట్ ఉండగా మేడమెట్లెందుకెక్కావ్? ...కరెంటుండదెగా?!
నీలాంటి చవటలు పనికి రారు. దయ చెయ్ బాబు



# ఆయన మనసుకి నచ్చని పాట పల్లవి కాగితం మీదకి వచ్చేది కాదు

**- దాసరి నారాయణరావు**

**దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి గారు బ్రతికున్నప్పుడు - ఎపుడైనా ఒక క్షణమైనా (ఇదెక్కడి న్యాయం), దూరాన దూరాన తారాదీపం (మా బంగారక్క) వంటి పాటలను రాయించుకుని-ఆయన మరణానంతరం ఆకులో ఆకునై (మేఘసందేశం) పాటను ఉపయోగించుకున్నారు-దర్శకరత్న దాసరినారాయణరావు. ఫిబ్రవరి 24 దేవులపల్లి వారి వర్ధంతి సందర్భంగా ఆయనతో తనకున్న అనుభవాలను నెమరువేసుకుంటూ 'హాసం' పాఠకులకు శ్రీ దాసరి నారాయణరావు అందించిన ఓ మినీ ఇంటర్వ్యూ ఇది...**

**బా**పు బొమ్మ, ముళ్ళపూడి కథ, దేవులపల్లి కవిత ఈ మూడు నాకు తెలిసిన తెలుగు నుడికారాలు. ఈ ముగ్గురు నాకిష్టులు, ఆప్తులు. ఆ ముగ్గురికి నేను చాలా ఇష్టం. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి గురించి ఇపుడున్న తరానికి, ఇప్పుడున్న సినిమా జనరేషన్‌కి బహుశా సంబంధ బాంధవ్యాలు చాలా తక్కువనుకుంటా!. ఆయనతో కలిసి పాటల సిట్టింగ్‌లో కూర్చొని, ఆయనతో పాటలు రాయించుకున్న సహకార దర్శకుణ్ణి, దర్శకుణ్ణి ఆయన పాటలు ఆయన చనిపోయిన తర్వాత నా సినిమాకు తీసుకున్న నిర్మాతని నేను. కృష్ణశాస్త్రిగారితో నాకు పరిచయం ఏర్పడడానికి ముఖ్యకారకులు మా గురువుగారైన పాలగుమ్మి పద్మరాజుగారు. అలాగే నాకు దేవులపల్లిగారి అబ్బాయి బుజ్జాయితో చాలా ఎక్కువ స్నేహం. నేను తీసిన, పనిచేసిన సినిమాలలో దేవులపల్లి గారు ఏ పాటరాసినా పద్మరాజుగారు ప్రతి సందర్భంలోనూ, సిట్టింగ్‌లోనూ, డిస్కషన్స్‌లోనూ ఉండేవారు.

నాకు సంబంధించి నేను పనిచేసిన సినిమాల గురించి-నేను ఇప్పటికీ మరచిపోలేనిది సుఖదుఃఖాలులో "ఇది మల్లెల వేళయని" పాట. ఆ పాటకి ఆయన ముందు రెండే రెండు లైన్లు రాశారు. వాటిని కోదండపాణిగారు కంపోజ్ చేస్తుంటే...ఆయన ఫీలింగ్స్ చూడాలి. దేవులపల్లిగారిది చాలా గొప్ప గాత్రం అని, బాగా పాడేవారని విన్నాను. కాని దురదృష్టవశాత్తు అప్పటికి ఆయన గొంతు మూగపోయింది.

ఆయన తను చెప్పాలనుకున్నది ముఖకవళికలో చెప్పేవారు. అనుకున్నది రాకపోతే కాగితం మీద రాసేవారు. పాడడానికి, మాట్లాడటానికి భగవంతుడు అవకాశం ఇవ్వకపోయినా ఆయన మనసులో ఏమనుకుని రాసారో ఆ భావాన్ని వచ్చేటట్టుగా చేసుకోవడానికి విపరీతంగా కృషి చేసేవారు. ఒక పాట రాయడానికి ఇంత టైమ్ పడుతుందా అనుకునే వాణ్ణి నేను. నాకు బాగా గుర్తు...ఆయన మనసుకు నచ్చిన పాట నాలుగు రోజుల్లో తయారైపోయేది. ఆయన మనసుకు నచ్చని పాట పల్లవి కూడా కాగితం మీదకి వచ్చేది కాదు. రాసిన పాటని అందరూ బాగుంది, అద్భుతంగా ఉంది అన్న తర్వాత రాత్రంతా ఆలోచించి ఉదయం వచ్చిన తర్వాత మళ్ళీ దాన్ని 'సులువులు' చేసేవారు. సులువులు అంటే చాలా మందికి తెలియక పోవచ్చు. ఆయనతో పరిచయం ఉన్నవాళ్ళకే తెలుసు. ఆయన పాటల్లో గురువులు చాలా తక్కువగా ఉంటాయి. లఘువులు చాలా ఎక్కువగా ఉంటాయి. ద్విత్వాక్షరాలుండవు, ఉన్నా చాలా తక్కువగా ఉంటాయి. నేను ఇది చెప్పిన తర్వాత ఒక్కసారి ఆయన పాటలన్నింటిని పునఃపరిశీలన చేయండి, అర్థం అవుతుంది. మెత్తని పదాలు, లఘువులు ఆయన ప్రత్యేకత.



దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి

ఆయన కవిత్వం గురించి చెప్పేటంత మేధాశక్తి నాకు లేదు. కాని ఆయన పాటల్ని నా సినిమాల్లో రాయించుకున్న వాడిగా చెప్పగలను. ఆయన పాటల గొప్పతనం "మేఘసందేశం" ఒక సంగీత కావ్యం కావడానికి కారణం అయింది. "మేఘసందేశం" తీయాలన్నది ఆయన బ్రతికుండగానే మేము అనుకున్నది. అందుకోసమే ఆయన పోయిన తర్వాత 'ఆయన పాటలు ఈ సినిమాలో కావాలి' అని మేము అనుకున్నప్పుడు పద్మరాజుగారు, బుజ్జాయి, నేను కూర్చొని (ఆయన రాసిన పాటలు అప్పటికి కొన్ని ప్రింటు అయ్యాయి. కొన్ని కాలేదు). సెలక్టు చేసి 'మేఘసందేశం'లో పెట్టడం జరిగింది.

మనిషి లేనప్పుడు ఆయన పాటని సినిమాలో సన్నివేశంగా క్రియేట్ చేసుకొని పెట్టడం అనేది ఐ థింక్ దిస్ ఈజ్ ఎ రియల్ గ్రేట్ థింగ్. మేఘసందేశం సంగీత పరంగా, సాహిత్య పరంగా

ఎంత పేరు ప్రఖ్యాతులు అందరికి తెచ్చిందో అది మీకు తెలుసు. ఇప్పటికీ ఏ సున్నితమైన పదం వినిపించినా అది కృష్ణశాస్త్రిగారి పదం అనే అంటారు. ఆ పదం కృష్ణశాస్త్రిగారి కంటే ముందు పుట్టింది. కానీ ఆ పదానికి కృష్ణశాస్త్రిగారి వల్ల పేరు వచ్చింది. కారణం కృష్ణశాస్త్రిగారు అలాంటి పదాల్ని ఇష్టపడేవారు. అలాంటి పదాలకి ఆయన ఆవిష్కర్త. అటువంటి మహనీయుడుతో కలిసి పనిచేసే అదృష్టం నాకు కలిగింది. ఆయన పాటలు తీసుకునే అదృష్టం కలిగింది. నేను చాలా ధన్యుణ్ణి ఈ విషయంలో.

❑ **'ఎపుడైనా ఒక క్షణమైనా', అంటూ 'ఇదెక్కడి న్యాయంలో' సినిమాలో రాయించుకున్న పాట గురించి వివరిస్తారా?**

◆ ఆ పాట సన్నివేశం ఆయనకి చెప్పాను. ఎందుకంటే ఆయన మనసుకు బాగా పడితే తప్ప రాసేవారు కాదు. కనీసం వారం రోజులు దాని గురించి డిస్కషన్ చేసేవారు. ఇవాళ ఆ సంప్రదాయం ఎక్కడుందసలు? ఇవాళ ట్యూన్‌కి పాట రాస్తున్నారు. రికార్డింగ్ అయిన తర్వాత పదాలు ఇవ్వడం జరుగుతోంది. ట్యూన్‌కి ఆయన పాట రాయడం అనేది నాకు తెలియదు. ఒకవేళ రాసారేమోగానీ, నాకు తెలిసి ఆయన రాసిన పదాలకే ట్యూన్! అసలు ఓ పదం పెట్టడానికే ఆయనకు కనీసం ఒక వారం, పదిరోజులు పట్టేది. అలాగే ఈ పాటప్పుడు కూడ నేను పద్మరాజుగారిని ఉపయోగించుకున్నాను. ఎందుకంటే ఆయన కూర్చుంటేనే బాగుంటుంది. నేనేమో షూటింగ్ బిజీలో ఉండేవాణ్ణి. కాబట్టి ఆయన ప్రశాంతంగా కూర్చొని పాట రెడీ అయిందన్న తర్వాతే నేను పాట విన్నాను.

❑ **దేవులపల్లివారు మీతో ఎలా ఉండేవారు?**

◆ నన్ను చాలా ఆప్యాయంగా చూసుకునేవారు. అసోసియేట్ డైరెక్టర్‌గా ఉన్నప్పుడు నుంచి నేను ఆయనతో పనిచేసాను. ఆయనెప్పుడూ నన్ను మంచి రచయిత అనేవారు. నేను రాసిన సినిమా డైలాగ్‌లకి చాలా బాగా అభినందించే వారాయన.

❑ **'సీతారాములు' సినిమాలో మీరు రాసిన 'తొలిసంధ్య వేళలో' పాట దేవులపల్లి (లాగ) రాశారని ఆరోజుల్లో ఓ కాంట్రవర్సీ చెలరేగింది...దాని గురించి చెప్పండి?**

◆ దేవులపల్లి గారి ఇన్‌స్పిరేషన్ నా మైండ్‌లో ఉండిపోయింది. ఆయన పదాలు అలా ఉండేవి కాబట్టి నేను రాసిన ఆ పాటని ఆయన రాశారనే అనుకున్నారు. ఆ కాంట్రవర్సీ టైమ్‌లో నారాయణరెడ్డిగారు 'నాకు కృష్ణశాస్త్రి కవిత్వం గురించి తెలుసు. కృష్ణశాస్త్రి గారి పదాల అల్లిక ఎలా ఉంటుందో తెలుసు. దాసరి నారాయణరావు పదాల అల్లిక ఎలా ఉంటుందో తెలుసు. ఇది రాసింది దాసరి నారాయణరావు' అని ప్రకటించి వాటికి ముగింపు వాక్యం పలికారు. ఏదిఏమైనా నేను రాసిన పాటని నిజంగా ఆయన రాసారేమో అన్నట్టు భ్రమించడం అనేది చాలా గొప్ప విషయం. ■

## 'హాసం' ఆడియో క్లబ్ డేటా బేస్

**సంస్థ పేరు :** సాగర్ కల్చరల్ అసోసియేషన్ (స్కేన్) — **స్థాపించిన సంవత్సరం:** 1993

**ఉద్దేశ్యము :** సంగీతం, సాహిత్యం అభివృద్ధికి కృషి, యువకులకు ప్రోత్సాహం — **సభ్యుల సంఖ్య :** 30

**అడ్రసు :** దాసరి సత్యనారాయణ, రేడియో & టి.వి. ఆర్టిస్ట్, ఇం.నెం. 13-1, ఉప్పాడ, కొత్తపల్లి మండలం, తూర్పుగోదావరి జిల్లా, పిన్‌కోడ్ నెం: 533 448.

**కార్యనిర్వాహక సభ్యులు**

| | |
|---|---|
| 1. డా॥ మద్దాల భానుమూర్తి | ☎ 08869 245269 |
| 2. డా॥ దున్న హరనాథ్ రాజా | ☎ 08869 245128 |
| 3. డా॥ యేనుగు అచ్చయ్యదొర | ☎ 0884 306493 |

**సంప్రదించవలసిన వ్యక్తి, (ఫోన్ నెంబరుతో సహా) :** దాసరి సత్యనారాయణ, రేడియో & టి.వి. ఆర్టిస్ట్, ☎ 08869 245263 — **తేదీ:** 03-02-2003

## 'హాసం' ఆడియో క్లబ్ డేటా బేస్

**సంస్థ పేరు :** చైతన్య కళా స్రవంతి — **స్థాపించిన సంవత్సరం:** 1984

**ఉద్దేశ్యము :** వినోదం, విజ్ఞానం, సామాజిక చైతన్యము — **సభ్యుల సంఖ్య :** 26

**అడ్రసు :** కార్యదర్శి, శ్రీ మాలే పేరారెడ్డి, చైతన్య కళా స్రవంతి, రినెం: 722/02, ఇం.నెం. 21-4-33(1), నల్లమల్లివారి తోట, శ్రీశైలజ థియేటర్ దగ్గర, కందుకూరు, ప్రకాశం జిల్లా. పిన్‌కోడ్ నెం: 522 105

**కార్యాలయం ఫోన్ నెంబర్, ఈ మెయిల్ :** 08598 223952

**కార్యనిర్వాహక సభ్యులు**

| | |
|---|---|
| 1. కార్యదర్శి: శ్రీ మాలే పేరారెడ్డి | ☎ 08598 223952 |
| 2. ఉపాధ్యక్షులు: శ్రీ కోవూరు కృష్ణమూర్తి | ☎ 08598 223845 |
| 3. కోశాధికారి: శ్రీ ముదివర్తి వెంకట చలపతిరావు | ☎ 08598 227200 |

**సంప్రదించవలసిన వ్యక్తి, (ఫోన్ నెంబరుతో సహా) :** శ్రీ మాలే పేరారెడ్డి , ఫోన్: 08598 223952. — **తేదీ:** 19-01-2003

# దేవులపల్లి కృష్ణశాస్త్రి సినీ గీతాలు

## చిత్రం : బంగారు పంజరం

సంగీతం : యస్.రాజేశ్వరరావు  గానం: యస్.జానకి

గట్టుకాడ, ఎవరో!- సెట్టుకాడ ఎవరో!
నల్లకనుల నాగసొరము వూదేరు ఎవరో! ॥గట్టుకాడ॥
పాటుపోటు సూసుకోని - ఏరుదాటి రావాలా
ముళ్లురాళ్లు ఏరుకోని మళ్లతోవ నడవాలా
ఆగలేక, రాసకొడక, - సైగసేసే వెందుకు?
సైగెందుకు?
ఏటిగట్టుకాడ - మావిసెట్టు నీడ
ఎవరో...
హోయ్! నల్లకనుల నాగసొరము వూదేరు ఎవరో
పైరుగాలీ పడుసుపైట పడగలేసీ ఆడేను!
గుండెపైని గుళ్లపేరు ఉండలేక వూగేను!
తోపుయెనక రాసకొడక - తొంగిసూసే వెందుకు
నీవెందుకు? సైగెందుకు?
ఏటిగట్టుకాడ - మావిసెట్టు నీడ
ఎవరో...ఎవరో...
హోయ్! నల్లకనుల నాగసొరము వూదేరు ఎవరో ॥గట్టుకాడ॥

## చిత్రం : డాక్టర్ ఆనంద్

సంగీతం : కె.వి.మహదేవన్  గానం: పి.సుశీల, బృందం

నీల మోహనా!రారా!...
నిన్ను పిలిచె నెమలి నెరజాణ నీల మోహనా!రారా
జారు వలపు జడివాన కురిసెరా!
జాజి లత మేను తడిసెరా
లతలాగే నా మనసు తడిసెరా! ॥నీల మోహనా॥
చెలికత్తెలు :
ఏలాగె మతిమాలి? ఏడే నీ వనమాలి?
రాధ :
అతడేనేమో అనుకున్నానే
అంత దవుల శ్రావణ మేఘములగనీ- ॥అతడేనేమో॥
చెలికత్తెలు :
ప్రతిమబ్బూ ప్రభువైతే, ప్రతికొమ్మా మురళైతే,
ఏలాగే...ఆ...ఏలాగె మతిమాలి ఏడే నీ వనమాలీ
రాధ :
సారెకు దాగెద వేమి? నీ రూపము దాచి దాచి
ఊరించుటకా స్వామీ?
నీ కన్నుల తోడు నీ కలికి నవ్వుల తోడు
నీ కోసం ఎంత వేగిపోయానో కృష్ణా కృష్ణా కృష్ణా సారెకు దాగెదవేమీ
చెలికత్తెలు:
అటు...అటు...ఇటు..ఇటు..
ఆ పొగడ కొమ్మవైపు! ఈ మొగలి గుబురువైపు!
కార్తిక రాతిరిలో కరిమబ్బుంటుందా?
నీలమేఘమాకాశము విడిచి నేల నడుస్తుందా?
నడిచే మబ్బులకు నవ్వే పెదవుందా?
నవ్వే పెదవులకు మువ్వల మురకుందా?
పెదవి నందితే పేద వెదుళ్లు - కదిలి పాడతాయా?
నడిచే మబ్బులకు నవ్వే పెదవులు
నవ్వే పెదవులకు మువ్వల వేణువులు! మువ్వల వేణువులు!

## చిత్రం : సుఖదుఃఖాలు

సంగీతం : యస్.పి.కోదండపాణి  గానం: పి.సుశీల

ఇది మల్లెల వేళయని ఇది వెన్నెల మాసమని
తొందరపడి ఒక కోయిల ముందే కూసింది!
విందులు చేసింది! ॥ఇది॥
కసిరే ఎండలు కాల్చుననీ,
ముసిరే వానలు ముంచుననీ,
ఇక కసిరే ఎండలు కాల్చుననీ,
మరి ముసిరే వానలు ముంచుననీ,
ఎరుగని కోయిల ఎగిరింది!
విరిగిన రెక్కల ఒరిగింది!
నేలకు ఒరిగింది ॥ఇది॥
మరిగి పోయేది మానవ హృదయం!
కరుణ కరిగేది చల్లని దైవం!
వాడే లతకు ఎదురైవచ్చు
వాడని వసంతమాసం!
వసివాడని కుసుమ విలాసం ॥ఇది॥
ద్వారానికి తారామణిహారం!
హారతి వెన్నెల కర్పూరం!
మోసం ద్వేషం లేని సీమలో
మొగసాల నిలిచే నీ మందారం ॥ఇది॥

## చిత్రం : భక్తశబరి

సంగీతం : పెండ్యాల  గానం: పి.సుశీల

నిన్ను జూచు నందాక కన్నుల వెలుగుండేనా!
కన్న తండ్రి! ఎన్నాళ్లని నిలచే నీ ఉసురు ఇంక ॥నిన్ను॥
ఈ వాకిట తోరణమై, ఈలా వేలాడి వాడి,
రామాయని పిలిచిన నీరాకయె కరువాయెగాని ॥నిన్ను॥
అదిగో ఇదిగో యని మరి ఎదురరయుట చేతగాదు!
ఎదురుగ వద్దామంటే ముదుసలి ఇది కదలలేదు!
బడలిన పువ్విది వాడునొ తొడిమ వీడి పడి రాలునొ
అడుగుల కడ రామాయని పడితే అంతే చాలును ॥నిన్ను॥

## చిత్రం : ఉండమ్మా బొట్టు పెడతా

సంగీతం : కె.వి.మహదేవన్  గానం: పి.సుశీల

ఎందుకీ సందెగాలి? సందెగాలి తేలి మురళి!
తొందర తొందరలాయె! విందులు విందులు చేసే!
తొందర తొందరలాయె! విందులు విందులు చేసే!
ఆగలేక, నాలాగే ఊగే ఈ దీపము!
పరుగు పరుగునా - త్వర త్వరగా
ప్రభువు పాదముల వాలగ,
తొందర తొందరలాయె! విందులు విందులు చేసే! ॥ఎందుకీ॥
ఏనాటిదో గాని - ఆ రాధా పల్లవ పాణీ!
ఏమాయెనో గాని - ఆ పిల్లన గ్రోవిని విని, విని
ఏదీ ఆ యమున!
యమున హృదయమున గీతిక!
ఏదీ బృందావన మిక! ఏదీ విరహగోపిక! ॥ఎందుకీ॥

సీరియల్ 26

# సద్దాం ఆంటీ వెంటి కథ

-మల్లాది వెంకట కృష్ణమూర్తి



## జరిగిన కథ

అనన్య బామ్మ గారికి, గ్రామం అనే ఆయనకు ఆవిడ ఇల్లు గురించి కుదిరిన ఒప్పందం ప్రకారం బామ్మ బతికున్నంతకాలం ప్రతీనెలా గ్రామం డబ్బుఇవ్వాలి. బామ్మపోయాక ఇల్లు అతని స్వంతం అవుతుంది. కాలక్రమేణా గ్రామం, అతని కొడుకులు పోతారు కానీ బామ్మ ఆరోగ్యంగా ఉంటుంది. బామ్మ చస్తే ఇల్లు తన స్వంతమవుతుందని గ్రామం మనుమలలో ఒకడైన లింగమయ్య , రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే సుబ్బారావు, హరకేశం అనే కిరాయి హంతకుడిద్వారా బామ్మను చంపడానికి ప్లాను వేస్తారు. హరకేశం మూడురోజులు ప్రయత్నించి బామ్మను పాముకాటుతో చంపబోతాడు. ఆ లోగా అతన్ని మరో పాము కాటువేస్తుంది. లింగమయ్య తమ్ముడు నిరుపమ్, అనన్య ప్రేమించుకుంటారు. అష్టమి ఘడియలు దాటాక 'యస్ ఆర్ నో' చెప్తానంటుంది అనన్య.

(ఇక చదవండి)

"మన్నెలా తింటావుకృష్ణా.....నీకు వెన్నపూస కరువయ్యా కృష్ణా..."

పాటపూర్తి చేసి కృష్ణుడి రూపంలోని శోభన్‌బాబు స్టిల్‌కి హారతిచ్చి కొబ్బరికాయ కొట్టింది అనన్య. పూజ గదిలోంచి బయటకి వచ్చిన అనన్యకి హాల్లో బామ్మ టి.వి.చూస్తూ కనబడకపోవడంతో, హారతి పళ్ళెంతో బామ్మ పడగ్గదిలోకి వెళ్ళింది. ఆవిడ లేవక పోవడంతో చెప్పింది-

"ఏమిటి బామ్మా మొద్దు నిద్ర పోతున్నావివాళ!"

తట్టింది కాని బామ్మ లేవకపోవడంతో గట్టిగా కేకలు పెడుతూ కుదిపింది. అయినా బామ్మ లేవలేదు.

"ఓసారి వచ్చి మా బామ్మకేమైందో చూడండి"

అనన్య మొహంలోని దుఃఖాన్ని, భయాన్ని గమనించి వెంటనే ఆమె వెంట కిందకి వచ్చింది వాసవి. ఇద్దరూ బామ్మ గదిలోకి వెళ్ళారు. బామ్మ మొహంలో జీవకళ లేదని గ్రహించిన వాసవి ఆవిడ నాడి చూసి పెదవి విరిచి తల అడ్డంగా తిప్పింది.

"అంటే...మా బామ్మ...?" దుఃఖంగా అడిగింది అనన్య.

"అవును"

అనన్య విచారానికి అంతులేదు. తనకంటూ వున్న ఏకైక బంధువు, ఆత్మీయురాలు ఆవిడ ఒక్కతే కాబట్టి దుఃఖం సహజం. బామ్మని రెగ్యులర్‌గా చూసే డాక్టర్ వచ్చి పరీక్షించి రాత్రి హార్ట్ అటాక్ వల్ల పోయిందని చెప్పాడు. ఆ మేరకు డెత్ సర్టిఫికేట్ ఇచ్చాడు. ఇంకా ఆఫీస్‌కి వెళ్ళలేదు వాసవి భర్త. అతను అన్ని ఏర్పాట్లు చూసాడు.

ఈలోగా ఉదయం ఎనిమిదిన్నరకి లింగమయ్య వచ్చాడు బామ్మ సంగతి కనుక్కోడానికి. ఆవిడ పోయిందని తెలిసి తన సంతోషాన్ని దాచుకొని దుఃఖాన్ని అభినయించడం చేతకాక అక్కడనించి తక్షణం నిష్క్రమించాడు.

శవానికి స్నానం చేయించి కర్మకాండ పూర్తి చేసుకొని సికింద్రాబాద్‌లోని స్మశానానికి తీసుకెళ్లారు. అనన్య వేన్‌లో పాడెమీద వున్న బామ్మని చూస్తూ విలపిస్తోంది. పక్కనే ఉన్న వాసవి ఓదార్చ సాగింది.

* * *

ఆ వార్తని సంతోషంగా విన్నాడు సుబ్బారావు.

"ఎవరికీ ఎలాంటి అనుమానం రాలేదుగా?" ప్రశ్నించాడాయన.

"లేదు. పాముకాటు అన్న అనుమానమే రాలేదసలు డాక్టర్‌కి. ఇలా నాడి చూసి అలా హార్ట్ అటాక్ అనేసాడు"

"వెరీగుడ్. హరకేశం వస్తే బేలన్స్ పే చెయ్యి. అనన్యతో మన డీల్ గురించి ఎప్పుడు మాట్లాడితే




బావుంటుందో ఆలోచించు."

"బాగా విచారంగా వుంది. కాస్తంత తేరుకున్నాక

"అదీ నిజమే. ఆ పని కూడా చూడు"

"అలాగే సార్"

"పాపం సద్దాం ఆంటీ. మనం అమెరికన్ ప్రెసిడెంట్‌లకన్నా గొప్పవాళ్లం కదోయ్!" అడిగాడు సుబ్బారావు ఆనందంగా నవ్వుతూ

"అవును సార్, వాళ్ళు ఎంత ప్రయత్నించినా సద్దాంహుస్సేన్‌ని చంపలేక పోయారు. మనం మాత్రం సద్దాం ఆంటీని వదల్లేదు."

"అంత తేలిగ్గా జరిగిందా? మూడు రోజులు మనల్ని తిప్పలు పెట్టలా? ఎంతయినా గట్టి పిండం, గట్టి ప్రాణం"

* * *

బామ్మ శవాన్ని తీసుకువచ్చిన వేన్ శ్మశానం బయట ఆగింది. అందులోంచి కర్మకాండ చేసే బ్రాహ్మడు, అనన్య, వాసవి దిగారు. బామ్మ శవాన్ని కట్టిన పాడెని కిందకి దించారు. వేన్ వాడికి డబ్బిచ్చి పంపించేసింది వాసవి.

పాడెని స్మశానంలోకి చేర్చాక కర్మకాండలో భాగంగా నేలకి మేకుని కొట్టి, బామ్మ చెవిలో 'నారాయణ' అని ఓ సారన్నాడు బ్రాహ్మడు.

"నారాయణ" బామ్మ జవాబు చెప్పింది.

తను భ్రమపడుతున్నాడనుకుని మరో రెండు సార్లు 'నారాయణ' అన్నాడు బ్రాహ్మడు.

బామ్మ కూడా రెండుసార్లు 'నారాయణ' అన్నది. తెల్లబోయి భయంతో చూస్తున్న బ్రాహ్మడి వంక కళ్ళు తెరచిచూసి అడిగిందావిడ-

"నువ్వెవరు?"

**మొగుడు పెళ్ళాలని జీవిత భాగస్వాములని ఎందుకు అంటారు?**
**-ఆడవాళ్ళు వండితే మొగాళ్ళు తింటారు. ఆడవాళ్ళు బట్టలు ఉతికితే, మగాళ్ళు వాటిని మురికి చేసుకుని వస్తారు.**
**అలాంటి భాగస్వామ్యంలోకి ఎంటరౌతున్న ఓ యువకుడి కథ ఈ సీరియల్**

... ముందు మాకు కొంత అడ్వాన్స్ ఇచ్చి అగ్రిమెంట్ మీద సంతకం చేయిస్తే పోటీదార్లతో గొడవుండదు సార్ అప్పుడు మా బ్రదర్‌లిద్దరూ మాటకు కట్టుబడి ఉంటారు."



"దదద్దద్ద...నేను మీ కర్మకాండ చేయించ డానికి వచ్చిన బ్రాహ్మడ్ని"

"నే బ్రతికుండగానే? ఎవరిలా నన్ను కట్టేసింది? ఇదేంటి ఇది మా ఇల్లు కాదే? నన్నెవరిక్కడికి తెచ్చారు? అరె ఒకటి...రెండు...మూడు...అరె ఏడు కట్ల సవారి మీద ఎవరు నన్నెక్కించింది? ఆఁ?"

బామ్మ కళ్ళు తెరచి మాట్లాడుతూండడం చూసి తన కళ్ళని తానే నమ్మలేక పోయింది అనన్య.

"బామ్మా! నువ్వు బ్రతికే వున్నావా? నీకేం కాలేదా?" అడిగింది ఆనందంగా.

"నేను శుభ్రంగా బ్రతికేవున్నాను. ఇదేమిటి ఇక్కడికి ఎలా వచ్చాను?" అనన్య ఆ కట్లని విప్పుతూ జరిగింది వివరించింది.

"కాస్తంత మొద్దునిద్రపోయాను తప్ప చావలేదే. నీ పెళ్ళి చూడకుండా చస్తానుటే?" నవ్వుతూ లేచింది బామ్మ.

స్మశానానికి వచ్చిన మిగిలిన కేండిడేట్స్ బంధు మిత్రులు ఆ విచిత్రం చూసి చెవులు కొరుక్కో సాగారు.

అనన్య ఆటోని ఓ దాన్ని ఆపింది. బామ్మతో అనన్య, వాసవి ఆటో ఎక్కాక అడిగాడు బ్రాహ్మడు.

"మరి నామాటేంటి?"

"సంభావనా? నే చచ్చాకే. మళ్ళీ మాట్లాడితే బతికున్న వాళ్ళకి కర్మ చేసావని పోలీసు రిపోర్టిస్తాను" అని అరిచింది బామ్మ. ఆటోకదిలింది.

***

ఉస్మానియా హాస్పిటల్‌లోని ఓ వరండాలో నేల మీద పడుకున్న హాటకేశానికి సాయంత్రం నాలుగున్నరకి మెలుకువ వచ్చింది. గత రాత్రి తాను హాస్పిటల్‌కి రావడం, పాముకాటు గురించి చెప్తే డ్యూటీలో వున్న డాక్టర్ లంచం అడగడం, లేదంటే పొమ్మనడం మాత్రం గుర్తుంది. మరి తనెలా బ్రతికాడు?

పక్కనున్న ఇంకో రోగి చెప్పాడు.

"అదృష్టవంతుడివి. నైట్‌డ్యూటీలో వున్న మెడికో కుర్రాడికి బర్త్‌డేట. అందుకని నీకు పాము విషానికి విరుగుడు ఇంజక్షన్ చేసాడు."

హాటకేశానికి తను బ్రతికినందుకు సంతోషంగా వుంది. నీరసంగా ఉన్నా లేచి తడబడే అడుగులతో బయటికి నడిచాడు.

* * *

బామ్మపోయిన ఆ దుఃఖంలో అనన్య బేంక్‌కి ఫోన్ చేసి తను ఆ రోజు రావడంలేదని చెప్పడం మర్చిపోయింది. స్మశానం నించి తిరిగి వచ్చేసరికి ఫోన్ మోగుతోంది. అవతల బేంక్ నించి నిరుపమ్.

"మీరు ఇవాళ శెలవు పెట్టకుండా బేంక్‌కి రానందుకు మేనేజర్ చిందులు తొక్కుతున్నాడు. ఎందుకు రాలేదు? ఎక్కడికి వెళ్ళారు? ఇది నాలుగో సారి మీ కోసం ఫోన్ చేయడం"

అనన్య జరిగింది టూకీగా చెప్పింది.

"ఓ!...ఆయనకి చెప్తానైతే...ఇప్పుడుబామ్మ ఓకేనా?"

"బాగా ఓ.కే"

"పాము విషం పనిచేయలేదన్నమాట?"

"పాము విషమేమిటి?"

"మా అన్నయ్య లింగమయ్య..."

"ఏమిటి? లింగమయ్య మీ అన్నయ్యా?" అడిగింది అనన్య.

"అవును, అన్ని వివరాలు మనం కలిసినపుడు చెప్తాన్లెండి."

మధ్యాహ్నం లంచ్ అవర్‌లో బేంక్ స్టాఫ్‌లో అనన్యతో క్లోజ్‌గా మూవ్ అయ్యేవారంతా పరామర్శకి వచ్చారు. అంతా చచ్చిబ్రతికిన బామ్మని అనేక ప్రశ్నలు వేసారు. 'యమభటులెలా వున్నారు? చచ్చాక, యమలోకానికి వెళ్ళారా? స్వర్గానికా? యముడు కనిపించాడా?' వగైరాలు. అన్నింటికి బామ్మ చమత్కారంగా సమాధానాలు చెప్పింది. నిరుపమ్ అడిగాడు అనన్యని ఆ సాయం సంధ్యవేళ.

"నన్ను వివాహం చేసుకోవడం మీ కిష్టమో కాదో ఇవాళ చెప్తానన్నారు?"

"ఇంకా అష్టమి గడియలు దాటలేదు. ఇంకో గంటాగి..."

"సరే గంటసేపు వేచి వుంటాలెండి"

ఆ గంటసేపు అనన్య అతని వంక చూసినప్పుడల్లా చిరునవ్వులు చిందిస్తూ సిగ్గుగా చూస్తూనే వుంది. అయినా నిరుపమ్‌కి ఆమె చెప్పే సమాధానం అర్థం కాలేదు.

* * *

బామ్మ హడావిడికి శెలవుపెట్టి ఇంట్లో ఉన్న తన భర్తతో వాసవి రాజుగాడి కలగురించి చర్చిస్తోంది.

"మొత్తానికి మొదట్నించీ మీరు చెప్పిందే నిజమండి. వాడికి కలలో సాయిబాబా కనపడి చెప్పింది జరగడం కేవలం కాకతాళీయం. అన్నీ జరిగినట్లే ఇది మాత్రం జరగలేదంటే, మనది ఎంత అదృష్టమో కదండి"

"నిజంగా సాయిబాబా కలలో కనబడి చెప్తే, బామ్మ గురించి చెప్పేవాడు, ఆవిడ చచ్చి బ్రతుకుతుందని. అంతేకాని నేను పోతానని చెప్పేవాడు

**మెటర్నిటి హాస్పిటల్‌లో చేరిన ఓ గర్భవతి -డాక్టర్ ఇవాళ అష్టమి. కాన్పు రేపు వచ్చేలా ఇంజక్షన్ ఇవ్వండి అన్నది.**
**ఆమెని ఈ సీరియల్‌లో కలుసుకోండి.**






కాదు."

"నిజమేనండి.."

ఎస్.టి.డి.రింగ్ మోగింది. రామ్మూర్తి రిసీవర్ అందుకుని అవతలివైపు చెప్పేది విన్నాక

"అరెరె! వెరీసారీ. అలాగే వస్తాం" అని ఫోన్ పెట్టేసి భార్యతో చెప్పాడు. "మీ మామయ్య నిన్న రాత్రి స్కూటర్ ఏక్సిడెంట్‌లో పోయాట్ట"

వాసవి నిశ్చేష్టురాలైంది.

ఆమె నిశ్చేష్టురాలవడానికి రెండు కారణాలు. ఒకటి తన మామయ్య మరణం! రెండోది రాజు తండ్రి నిజానికి అతనే అన్న సంగతి అప్పుడు మాత్రమే స్ఫురించడం!!

"పాపం మన రాజు గాడు పుట్టినప్పుడు సంతోషంగా వాళ్ళ ఊళ్ళో అందరికీ స్వీట్లు పంచాడు కూడా" చెప్పాడు రామ్మూర్తి.

* * *

హరకేశం చెప్పింది మొత్తం విన్నాక అడిగాడు లింగమయ్య.

"వార్నీ? అంటే బామ్మ చచ్చింది పాము కాటువల్ల కాదన్నమాట?!"

"కాదు...ఏమిటీ? బామ్మ చచ్చిందా?"

"అవును. రాత్రి పడుకున్నది పడుకున్నట్లే పోయింది. పొద్దున నిద్ర లేవలేదు"

"అరెరె"

"ఆలిండియా రేడియోలోలా నువ్వు వచ్చి నేటి వార్తల్లోని ముఖ్యాంశాలు పద్ధతిలో ఇదంతా చెప్పకుండా వుంటే బామ్మని చంపింది నువ్వే అనుకుని బేలన్స్ మొత్తం ఇచ్చేవాడు సుబ్బారావు"

వెంటనే హరకేశం మొహం వాడిపోయింది.

"అరెరెరె!"

"మరేం ఫర్వాలేదు. ఇది నాకు మాత్రమే చెప్పావు కాబట్టి గుడ్డిలో మెల్ల. నేనిది ఆయనకి చెప్పను. చెరి సగం పంచుకుందాం...ఏం?"

ఇప్పుడతని మొహం కొద్దిగా వికసించింది.

"అలాగే ఇంకో గంటలో ఆఫీసుకి వస్తాను. నీ లాంటి దొంగబుద్ధి స్కాండ్రల్ నా మీడియేటర్ కావడం నా అదృష్టం" ఆనందంగా చెప్పాడు హరకేశం.

* * *

వేయించిన జీడిపప్పు తింటూ కేబుల్ టి.వి.లో కులాసాగా 'యమలీల' సినిమా చూస్తూ, మధ్య మధ్యలో విదేశీ బీర్ కేన్‌లోంచి బీర్ తాగుతూ, బామ్మ చావుని సెలబ్రేట్ చేసుకుంటున్న సుబ్బారావు ఫేవరెట్ సీన్ వచ్చింది; ఆవు గోడ మీదకి ఎక్కి పేడ ఎలా వేసిందబ్బా అన్న అనుమానం చిత్రగుప్తుడికి వచ్చే సీన్ అది. కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందంల డైలాగ్స్, ఎక్స్‌ప్రెషన్స్‌ని ఎంజాయ్ చేస్తున్న తరుణంలో కింద




వచ్చిన ఫ్లాష్ న్యూస్ చదివి అదిరిపడ్డాడు. బామ్మ స్మశానంలో ఉండగా ఓ మీడియా న్యూస్ సర్వీస్ జర్నలిస్ట్ తన బంధువు మరణం సందర్భంగా అక్కడికి వచ్చాడు. దాంతో బామ్మ ఉదంతం మొత్తం అన్ని వార్త మీడియాలకి వెంటనే చేరింది. స్మశానంలో చెవిలో నారాయణ అనగానే నారాయణ అని మూడుసార్లు బదులు చెప్తూ లేచి కూర్చొన్న బామ్మ ఉదంతం చదివిన సుబ్బారావు ఫీలింగ్స్ ఎలా ఉంటాయో పాఠకులకి వదలి వేయబడుతోంది.

అతను తీరుకోగానే ఇంటర్‌కం బటన్‌నొక్కి లింగమయ్యలైన్‌లోకి రాగానే అడిగాడు.

"హరకేశం సంగతి ఏమైంది?"

"ఇప్పుడే వచ్చాడు సార్. బేలన్స్ కేష్ ఇచ్చాను"

"మీ ఇద్దరూ ఆ కేష్‌తో నాగదిలోకి వెంటనే రండి"

"అదేం సార్?" అడిగాడు లింగమయ్య.

"బామ్మ బ్రతికే వుందోయ్." కీచు గొంతుతో అరిచాడు సుబ్బారావు.

"లేదు సార్. నేను స్వయంగా చూసాను. స్నానం చేయించి పాడె మీదకి ఎక్కించి ఏడుకట్లు కట్టి శవాన్ని వేన్‌లో వుంచేదాకా నేనక్కడే వున్నాను సార్"

"అదిగో మళ్ళీ ఫ్లాష్ వస్తోంది..."

హరకేశం, లింగమయ్య, సుబ్బారావు ఏసి గదిలోని టి.వి. స్క్రీన్ మీద యముడు కులాసాగా హిమక్రీములు తింటూంటే, కింద వచ్చే ఫ్లాష్‌ని చదివారు. వెంటనే ఇద్దరి మొహాలు పాలి పొయ్యాయి.

"ఛ! ఆఖరికి పాము విషంలో కూడా కల్తీ వుంది సార్." లింగమయ్య హరకేశం వంక చూసి కన్ను కొట్టి చెప్పాడు.

"ముంచుకు పోయిందేం లేదు హరకేశం, నువ్వు మళ్ళీ ఇంకో ప్రయత్నం చెయ్యి"

"అలాగే సర్"

**తెల్ల చీరతో మొదలై తెల్లచీరతో అంతం అయ్యేది ఏమిటి?**
**- సంసారం**
**ఓ జంట మొదలెట్టిన ఆ సంసారం సరదా విశేషాలకై ఈ సంచికలోని సీరియల్‌ని చదవండి.**



"ఇక రాత్రిళ్ళు వద్దు. నా నిద్ర చెడుతోంది. పగలు ఆ ఏర్పాటు చూడు. ఆ సమయంలో ఇంట్లో ఉండేది ఆవిడ ఒక్కతే కూడా" చెప్పాడు లింగమయ్య.

"అలాగే" వప్పుకున్నాడు హరకేశం.

* * *

యం.సెట్. రిజల్ట్సుని ఇంటర్‌నెట్‌లో చూసే తల్లితండ్రులకుండే ఆత్రం లాంటి ఆత్రంతో ఆ గంట ఎప్పుడు గడుస్తుందా అని ఓపికగా ఎదురు చూడసాగాడు నిరుపమ్. తన చూపులు నిరుపమ్ చూపుల్లో కలిసినప్పుడల్లా అనన్య అనురాగంగా చూస్తూ అందంగా చిరునవ్వు నవ్వసాగింది అనన్య.

ఆఖరి అయిదు నిముషాలు మరీ లేట్‌గా టిక్కు టిక్కులు వినబడ్డాయి నిరుపమ్‌కి, చివరికి గంటలని కొట్టింది గడియారం.

"ఇంకో అయిదు నిముషాలాగితే అష్టమి ఘడియలు దాటుతాయి" చెప్పింది అనన్య, వెంటనే తన వంక తలతిప్పి చూసిన నిరుపమ్‌కి. అయిదు నిముషాలయ్యాక తన ఉద్వేగాన్ని అణుచుకుంటూ అడిగాడు నిరుపమ్.

"అనన్యా. నన్ను పెళ్ళి చేనుకోవడం నీకిష్టమేనా?"

"కట్నం లేకుండా నన్ను చేసుకోవడం మీకు ఇష్టమేనా?" అడిగింది అనన్య బదులుగా.

"ఇష్టమే"

"ఇంకా కట్నం ఏమిటి ఇంత పెద్ద బంగ్లా వస్తూంటే?" చెప్పింది మంచం మీద కళ్ళు మూసుకుని పడుకున్న బామ్మ.

"అబద్ధాలాడకండి కంకాళమ్మగారూ" కోపంతో చెప్పాడు నిరుపమ్.

"నాపేరు నీకెలా తెలుసు?" అడిగింది బామ్మ ఆశ్చర్యంగా లేచి కూర్చుని.

"మీ వీలునామా....."

ఇంకాస్త ఆశ్చర్యపోయింది బామ్మ.

"నా వీలునామా నువ్వెప్పుడు చదివావు?" ప్రశ్నించింది.

"డేట్ గుర్తు లేదు, బ్రతికున్నంత కాలం మాత్రమే ఈ బంగ్లా మీదని, తర్వాత దీన్ని ఎన్నడో డబ్బిచ్చి కొన్న గ్రామం వారసులకే వీలునామా ప్రకారం చెందుతుందని తెలిసీ నేను అనన్యని పెళ్ళి చేసుకోడానికి ఇష్టపడుతున్నాను....."

నిరుపమ్ నోట్లోంచి వెలువడ్డ ఆ మాటలకి బామ్మ అడిగింది అతన్ని తేరిపార చూస్తూ.

"అనన్యా... ఆ సంగతంతా అతని కెందుకు చెప్పావు?"

"నేను చెప్పలేదు బామ్మ"

"లేకపోతే అతనికి మరెలా తెలుస్తుంది?"

"ఎలాగంటే, ఆ వీలునామా ప్రకారం ఈ బంగ్లాకి ఉన్న ముగ్గురు వారసుల్లోనూ ఒకడ్ని కాబట్టి".

"ఏమిటీ?? మళ్ళీ చెప్పు. నువ్వు ఈ బంగ్లాకి వారసుడివా?" అడిగింది బామ్మ.

"అవునండి . గ్రామం మా తాతయ్య"

"లింగమయ్య?"

"నా పెద్దన్నయ్య"

"అదీ సంగతి!" ముక్కు మీద వేలువేసుకుంది ఆవిడ.

"అష్టమి దాటాక కూడా యస్ చెప్పకుండా నన్నిలా కష్టపెడతావేం అనన్యా. చెప్పు యస్ అని చెప్పు త్వరగా"

"నో" చెప్పింది అనన్య.

"కాదు కాదు..యస్..యస్..అని చెప్పు" చెప్పింది బామ్మ.

"యస్ చెప్పడానికి నో చెప్పాను మీ వివాహ విషయాన్ని...ఈ సంగతి అంత సింపుల్‌గా ఒక సిలబల్‌తో చెప్పడం బావుండదని" గొంతు సద్దుకుని చెప్పింది అనన్య.

"మిస్టర్ నిరుపమ్. మీరు కోరినట్లుగా మిమ్మల్ని వివాహం చేసుకోవడం నాకిష్టమే"

బామ్మ మొహంలోని టెన్షన్ పోయింది. నిరుపమ్ మొహంలో చిరునవ్వు ప్రవేశించింది.

**ఉపసంహారం**

ఆ తర్వాతి కథ చాప్టర్స్‌గా వివరించ దగ్గంత ప్రాముఖ్యత కలదిగాదు.



అనన్య, నిరుపమ్‌ల వివాహం బంజారాహిల్స్ లోని ఖాజామేన్షన్‌లో ఓ ఆదివారం రాత్రి ఎనిమిది పన్నెండు నిముషాలకి జరిగింది. ఆ జంట బావుందని, డిన్నర్ కూడా బావుందని ముఖ్యంగా బగారా బైంగన్ చాలా బావుందని అతిథులంతా మెచ్చుకున్నారు.

ఈ లోకంలో రెండు రకాల మొగాళ్ళుంటారు.

**"మిగిలిన డాక్టర్లకి చెడ్డ పేరు తెచ్చే శాతం ఎంత?"**
**"99 శాతం"**
**అలాంటి 99వ శాతంలోని ఓ డాక్టర్‌ని ఈ సీరియల్‌లో ఈ సంచికలో తెలుసుకోండి.**

కొందరు పెళ్ళాం దగ్గర అంతా దాస్తారు. మరి కొందరు పెళ్ళాం దగ్గర ఏం దాచరు. నిరుపమ్ ఈ రెండో కోవకి చెందినవాడు కావడంతో, ఆ బిల్డింగ్ అమ్మని బామ్మ మీద హఠకేశం చేసిన విఫల హత్యాప్రయత్నాల వివరాలు చెప్పాడు.

దాంతో బామ్మ సుబ్బారావుకి ఆ బిల్డింగ్ అమ్మేసింది. తన వాటాగా వచ్చిన దాంతో నిరుపమ్ అక్కడ రెండు అపార్టుమెంట్స్ తీసుకుని ఓ దాంట్లోకి షిఫ్ట్ అయి, ఇంకోటి అద్దెకిచ్చు కున్నాడు. మిగిలిన కేష్‌తో భార్యకి నగలు చేయించి కారు కొన్నాడు.

ఆ విధంగా సద్దాం ఆంటీ ఇంటికథ ముగిసింది. కాని సద్దాం ఆంటీ కథ ఇంకా ముగియలేదు. ఎంచక్కా ఆవిడ పిజ్జాహట్‌లకి వెళ్తూనే వుంది. అల్లుడి కారు సొంతంగా డ్రైవ్ చేసుకుంటూ, టెన్త్ చదివే తన ముని మనవడిని స్కూల్లో పికప్ చేసి దింపే బాధ్యత సద్దాం ఆంటీ-ఉరఫ్ కంకాళమ్మదే.

బామ్మ సంస్కృతం నేర్చుకుంటోంది. మొదటి రోజు దాన్ని నేర్పే పండితు డడిగాడు.

"ఇంత లేటు వయసులో మీకెందుకీ కోరిక కలిగింది?"

"దేవుడితో ఆయన మదర్‌టంగ్‌లో మాట్లా డాలని" జవాబు చెప్పింది బామ్మ.

అనన్యకి ఈ జన్మకి 'అష్టమి కష్టమే' సెంటి మెంట్ వదలదని విసుక్కున్నాడు నిరుపమ్- ఆమె కాన్పుల డాక్టర్‌ని 'ఈ రోజు అష్టమి. డెలివరీ రేపటి దాకా ఎలాగైనా ఆపండి' అని కోరడంతో.

తనకి వచ్చే కలలని ఎవరికీ చెప్పవద్దని రాజు చేత వాసవి ఒట్టు వేయించుకుంది. రామ్మూర్తి ఇంకా కేంపుల ఉద్యోగంలోనే వున్నాడు. వాసవికి ఇంకో ఇద్దరు కొడుకులు పుట్టారు. ఆమె కింకో మామయ్య ఉన్నాడు మరి.

-శుభం-

ములాన్‌రూజ్ బాటలో...

# మరో మ్యూజికల్ 'షికాగో'

హాలీవుడ్‌లో మ్యూజికల్ చిత్రాల ప్రక్రియను తిరిగి ప్రారంభించిన 'ములాన్‌రూజ్' కోవలో కొత్త తరహాగా నిర్మించిన 'షికాగో' ఆస్కార్ రేసులో వడివడిగా ముందడుగు వేస్తోంది. అమెరికాలో గత డిసెంబర్‌లో విడుదలైన ఈ చిత్రం విమర్శకుల ప్రశంసలు అందుకుని 2002వ సంవత్సరపు ఉత్తమ చిత్రంగా ఆస్కార్ అవార్డు గెలుచుకోగల స్థాయికి ఎదిగింది. గత నెల హాలీవుడ్‌లో జరిగిన గోల్డెన్ గ్లోబ్ అవార్డ్స్ ప్రధానోత్సవంలో 'షికాగో'కు ఉత్తమ మ్యూజికల్ లేదా కామెడీ చిత్రం అవార్డు దక్కింది. ఈ చిత్రంలో నటించిన రిచర్డ్ గేర్, రెనే జెల్‌వెగర్‌లకు ఉత్తమ నటుడు, ఉత్తమ నటి అవార్డులు వచ్చాయి.

1975లో 'షికాగో' థియేటర్ మ్యూజికల్‌గా ప్రదర్శితమయింది. అప్పటినుంచి ఏదో ఒకచోట ప్రదర్శితమవుతూనే ఉంది. 1997 నుంచి బ్రాడ్‌వేలో తిరిగి ప్రదర్శించారు. ఇప్పుడు రాబ్ మార్షల్ అనే నూతన దర్శకుడు దీన్ని తెరకెక్కించారు. దీన్ని చలనచిత్రంగా రూపొందించటం అసాధ్యమని అన్నారు అందరూ. మామూలు మ్యూజిక్ చిత్రంలా కాకుండా వినూత్న పద్ధతిలో ఈ చిత్రాన్ని మలచి ఔననిపించుకున్నారు రాబ్ మార్షల్. రెనే జెల్‌వెగర్ (బ్రిజెట్ జోన్స్ డైరీ), క్యాథరిన్ జీటా-జోన్స్ (మాస్క్ ఆఫ్ జోరో), రిచర్డ్ గేర్ (ప్రెటీ వుమన్) ముఖ్యపాత్రధారులుగా ఈ చిత్రాన్ని నిర్మించారు.

ఈ చిత్రకథ 1920 దశకంలో షికాగోలో జరిగే కథ. అప్పట్లో షికాగోలో నేరాల సంఖ్య ఎక్కువగా ఉండేది. రాక్సీ హార్ట్ (రెనే) అనే యువతికి థియేటర్‌లో స్టార్‌గా ఎదగాలని ఆశ. అందుకోసం వివాహిత అయిన ఆమె థియేటర్‌కు చెందిన ఒక వ్యక్తితో సంబంధం పెట్టుకుంటుంది. అతను తనను మోసగించాడని తెలిసి అతణ్ని చంపేస్తుంది. ఫలితంగా జైలుకు వెళ్తుంది. అక్కడ వెల్మాకెల్లీ (క్యాథరిన్) అనే థియేటర్ తార పరిచయమవుతుంది. ఆమె తన భర్తను చంపడంతో జైలుకు వస్తుంది. తప్పుడు సాక్ష్యాలతో కేసులు గెలిచే ఓ లాయర్ (రిచర్డ్) సహాయంతో బయట పడిన రాక్సీ, వెల్మాకి పోటీగా నిలిచే తారగా ఎదుగుతుంది. ఇలా సాగిపోయే కథలో ఎన్నో పాటలున్నాయి. కోర్టు సీన్స్‌లో కూడా పాటలున్నాయి. ఈ పాటలు రాక్సీ ఊహల్లో వస్తాయి. ఈ పాత్రల కోసం రిచర్డ్, రెనే పాడటం, డ్యాన్స్ చేయటం నేర్చుకున్నారు. క్యాథరిన్ గతంలో బ్రిటన్‌లో థియేటర్ తారగా ఉండటంతో ఆమె ప్రతిభకు ఈ చిత్రం చక్కని గుర్తింపు తెచ్చింది. ఆమెకు ఉత్తమ నటి క్యాటగరీలో గోల్డెన్ గ్లోబ్ నామినేషన్ లభించింది. ఈ చిత్రానికి ఉత్తమ దర్శకుడు, ఉత్తమ స్క్రీన్‌ప్లే నామినేషన్స్ కూడా వచ్చాయి.



గత పక్షం ప్రకటించిన 2002 ఆస్కార్ నామినేషన్లలో 'షికాగో'కు అత్యధిక సంఖ్యలో పదమూడు నామినేషన్లు వచ్చాయి. మరే ఇతర చిత్రానికి ఇన్ని నామినేషన్లు రాలేదు. రెనే జెల్‌వెగర్‌కు ఉత్తమనటి నామినేషన్ రాగా క్యాథరిన్ జీటా-జోన్స్‌కు ఉత్తమ సహాయనటి నామినేషన్ వచ్చింది. ఈ చిత్రంలో జైల్లో మేట్రన్ పాత్ర వేసిన క్వీన్ లతీఫాకు కూడా ఉత్తమ సహాయనటి నామినేషన్ వచ్చింది. రాక్సీ భర్తగా నటించిన జాన్ సి.రైలీకి ఉత్తమ సహాయనటుడి నామినేషన్ వచ్చింది. ఇంకా ఉత్తమ చిత్రం, దర్శకుడు, అడాప్టెడ్ స్క్రీన్‌ప్లే, కళా దర్శకత్వం, దుస్తులు, ఎడిటింగ్, ఛాయాగ్రహణం, ధ్వని, ఒరిజినల్ సాంగ్ నామినేషన్లు కూడా వచ్చాయి. గత 20 ఏళ్లలో 18 సార్లు అత్యధిక నామినేషన్లు వచ్చిన చిత్రానికే ఉత్తమ చిత్రం అవార్డు లభించింది. ఈ లెక్కన 'షికాగో'కు 2002 సంవత్సరపు ఉత్తమ చిత్రం అవార్డు వచ్చే అవకాశాలు మెండుగా ఉన్నాయి.

గత సంవత్సరం 'ములాన్ రూజ్'కి ఉత్తమ మ్యూజికల్ కామెడీ చిత్రంగా గోల్డెన్ గ్లోబ్ నామినేషన్ వచ్చింది. నికోల్ కిడ్‌మన్‌కు ఆ చిత్రానికి ఉత్తమ నటి అవార్డు వచ్చింది. ఆస్కార్ అవార్డులలో ఆర్ట్ డైరెక్షన్‌కు, కాస్ట్యూమ్‌కు అవార్డులు వచ్చాయి.

'షికాగో' ఈసారి ఉత్తమ చిత్రం ఆస్కార్ గెలుచుకుంటే 34 ఏళ్ళ తర్వాత ఒక మ్యూజికల్ చిత్రం ఈ అవార్డు గెలుచుకున్నట్టవుతుంది. 1968లో 'ఆలివర్!' అనే మ్యూజికల్ చిత్రానికి ఉత్తమ చిత్రంగా ఆస్కార్ అవార్డు వచ్చింది. ఆ తర్వాత ఏ మ్యూజికల్ ఈ అవార్డు గెలుచుకోలేదు. మ్యూజికల్స్ నిర్మాణమూ తగ్గిపోయింది. 'షికాగో'తో మ్యూజికల్స్ నిర్మాణం మళ్ళీ ఊపందుకుంటుందనటంలో సందేహం లేదు.

**-పి.వి.సత్యనారాయణరాజు**

## కొంటెకొశ్చెన్లు-తుంటరి జవాబులు




పి.యస్.యస్.పవన్ గణేష్, రాయవరం

❖ విస్కీ, బ్రాండీలు లేని బారు ఏది?

✦ సాంబారు

కూర్మాన వెంకట సుబ్బారావు, విశాఖపట్నం

❖ పెళ్లంటే...

✦ మొదట తాళి తర్వాత తాళింపు

వై.మంజురాణి, హైద్రాబాద్

❖ పరమ ఛాందసురాలు?

✦ శనివారం తప్ప తక్కిన రోజులలో ఉల్లి పొరలాంటి చీరలను కట్టుకునేది (శ్రోత్రీయులకు శనివారం ఉల్లి నిషిద్ధం)

## డబుల్‌రోల్




ఆ 'సిగ' చూసి ఆవిడని 'పసిగట్ట'వచ్చు

-బి.శ్రీరాం, కరకవలస.

ఆవిడ 'మరచి'న విషయాలను నేను విడ'మరచి' చెప్పానంతే!

- ఎల్.యస్.రెడ్డి, కొంగర్‌కలాన్.

ఆ చెరుకు 'గడ'ని ఇక లా'గడ'ం ఆపండి

- పూజారి సింహాచలం, పాడేరు.



## చిలిపి లిపి




Wonda = వంద

At Low Key = ఏటిలోకి

SonT Pkka = శొంటిపిక్క

- బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.

## ఈ రూటే వేరు



Cot Hens = మంచం కోళ్ళు

Eye Shoe = కళ్ళజోడు

Come Close = రా బందు

- వరద సాయికుమార్, పర్లాకిమిడి.

## చిలిపికవిత




ఆ నాయకుడి మీద
ఇవాళ
దండెత్తిన వారు
ఒకప్పుడు
అతగాడి
మెడమీద
వెయ్యడానికి
బరువైన
దండెత్తిన వారే!!

-భమిడిపాటి వెంకటేశ్వరరావు
చందానగర్

## పేరడీ పేరేడ్

('టక్కరిదొంగ' చిత్రంలోని 'నలుగురికీ నచ్చినది' అనే పాటని వీరప్పన్ విని ఇన్‌స్పయిర్ అయి తనకు అన్వయించు కుంటూ పాడుకుంటూ ఉంటే ఎలావుంటుందో నన్న చిలిపి ఊహకి రూపకల్పన యిది)

ప: టమిళ్‌నాడుకి సొంతోణ్ణి నేనసలే ఇహ చిక్కనురో
కన్నడోళ్ళకి అల్లుడిని ఏ రూట్లోనూ దొరకనురో
ఏనుగు దంతాలన్నీ అవి మాత్రం నాసొంతం
గంధపు చెట్లున్నడవే నేనుండే సుఖ ప్రాంతం
రెండు రాష్ట్రములు ఒకవైపు కేంద్రం ఒకవైపు
నేను ఒక్కడినివైపు టాస్క్‌ఫోర్స్ ఒకవైపు

చ: నువ్వు భయపడి పట్టుబడితే అది... నథింగ్ స్పెషల్
అడవుల్లో పడి ఎస్కేపవడం... సమ్‌థింగ్ స్పెషల్
అశోకుడల్లే చెట్లునాటడం నథింగ్ స్పెషల్
ఎక్కడెక్కడి చెట్లు నరకడం సమ్‌థింగ్ స్పెషల్
థమ్సప్,పెప్సీ, కోకు తాగడం నథింగ్ స్పెషల్ ॥థమ్సప్॥
ఆడ కోతుల బ్లడ్డు తాగడం సమ్‌థింగ్ స్పెషల్ ॥టమిళ్॥

చ: బుద్ధిగా చదివి పైకొస్తే అది నథింగ్ స్పెషల్
అడవిదొంగలా చరిత్రకెక్కితె సమ్‌థింగ్ స్పెషల్
విదేశాలకు పారిపోవటం నథింగ్ స్పెషల్
కారడివిలో దూసుకెళ్ళడం సమ్‌థింగ్ స్పెషల్
చిన్నపిల్లలను ఎత్తుకెళ్ళడం నథింగ్ స్పెషల్ ॥చిన్న॥
గొప్పవాళ్ళని కిడ్నాప్ చేస్తే సమ్‌థింగ్ స్పెషల్ ॥టమిల్॥



- గూటూరి వెంకటేశ్వరరావు, కశింకోట.

## పేరు -రిపేరు




ఓసేయ్ రాములమ్మ-నువ్వునేను-ప్రేమించుకుందాం..రా

- ఈశ్వర్జీ, సింహాచలం.

అబ్బాయిలు అమ్మాయిలు-ష్... గప్‌చుప్
అక్కడ అమ్మాయి-ఇక్కడ అబ్బాయి- ఎవరికివారే యమునా తీరే

- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ.

## షార్ట్‌కట్స్




గోడ మీద పిల్లి = గోపి
మంగళంపల్లి కీర్తన = మంకీ
చెన్నకేశవరెడ్డి = చెడ్డి

-పి.గిరి, లక్ష్మీపురం

సీరియల్ (10)

# హాస్యవల్లరి సంగీతలహరి

# కిశోర్ జీవనఝరి



- ఎమ్మెస్ స్వాతి

తెలుగు సినిమా పాటకు ఘంటసాల ఎలాగో హిందీ సినీ గీతానికి రఫీ అలాగ. శ్రావ్యమైన గొంతు, ఎవరికైనా నప్పే వాయిస్, శాస్త్రీయ సంగీతపు నేపథ్యంలో కొన్ని దశాబ్దాలపాటు అతని ఏలుబడి సాగిందంటే ఆశ్చర్యమేముంది?

రఫీ దిలీప్‌కుమార్ (దీదార్ -1951), భరత్ భూషణ్ (బైజుబావ్‌రా -1951), గురుదత్ (ప్యాసా -1957) టైపు పాటలు మాత్రమే కాదు, షమ్మీకపూర్ టైపు 'యాహూ' పాటలు (జంగ్లీ - 1961), మహమూద్ టైపు 'హమ్ కాలే హైతో క్యా హువా' (గుమ్‌నామ్- 1965 ), కూడా పాడి ఒప్పించగలడు. రఫీ పూర్తిస్థాయి గాయకుడు. శాస్త్రీయ సంగీతం అభ్యసించినవాడు. వివాదాలలో చిక్కుకోనివాడు. తన శక్తిసామర్థ్యాలన్నీ గానానికే ఉపయోగించాడు కానీ నటనలోనూ, సంగీత దర్శకత్వంలోనూ, చిత్రనిర్మాణంలోనూ ప్రయత్నించి చూద్దామని అనుకోలేదు. సంగీత దర్శకులు చెప్పిన ట్యూన్‌ను అలవోకగా అర్థం చేసుకుని సునాయాసంగా పాడి అటు నిర్మాతలను, ఇటు ప్రేక్షకులనూ ఆనందపరిచాడు. అందువల్లనే కొత్తనటుడుగానీ, పాత నటుడూనీ, కొత్తనిర్మాతగానీ, పాత నిర్మాతగానీ (పారితోషికం విషయంలో పేచీపడిన దాఖలాలు లేవు) రఫీ లేనిదే సినిమాను ఊహించలేక పోయేవారు.

మరి అటువంటి అసమాన ప్రజ్ఞాశాలి రఫీని

## మహాగాయకుడు మహమ్మద్ రఫీ (1924-80)



మహమ్మద్ రఫీ పంజాబ్‌లో జన్మించారు. ఆయన 14వ యేట శాస్త్రీయ సంగీతం అభ్య సించడానికి లాహోర్ వెళ్ళా రు. ఖాన్ అబ్దుల్ వహీద్ ఖాన్, జీవన్‌లాల్ మట్టూ, ఘులాం అలీఖన్‌ల శిష్యరికం నెరపారు. ఫిరోజ్ నిజామీ అనే సంగీత దర్శకుడు ఆయన్ను లాహోర్ రేడియోకు పరిచయం చేశారు. చిత్రరంగప్రవేశం 'గుల్‌బలోచ్'(1944) అనే పంజాబీ సినిమాతో, శ్యామ్ సుందర్ సంగీత సారథ్యంలో! 1944లో బొంబాయికి వచ్చేశారు. నౌషాద్ "పహలే ఆప్" (1944) అనే సినిమాలో ఛాన్సు ఇచ్చారు. మెహబూబ్‌ఖాన్ తీసిన 'అన్‌మోల్ ఘడీ' సినిమాతో 'స్టార్‌సింగర్' అయ్యారు. "షాజహాన్" (1946) సినిమాకై కె.ఎల్.సైగల్‌తో కలిసి 'మేరీ సప్నొంకీ రాణీ' అనే క్లాసికల్ సాంగ్ పాడారు. జుగ్నూ (1947), సాజన్ (1947), మేలా (1948) సినిమాలలో నూర్జహాన్‌తో కలిసి పాడిన డ్యూయెట్లు ఆయనకు మంచి పేరు తెచ్చాయి.

దేశవిభజన తర్వాత ఆయన పుట్టిన కొట్లా సుల్తాన్ సింగ్ గ్రామం పాకిస్తాన్‌లోకి చేరినా ఆయన మాత్రం భారతదేశంలోనే ఉండిపోవడానికి నిశ్చయించుకున్నారు.

మతంపట్ల అచంచల విశ్వాసం, ధార్మిక బుద్ధి, నిరాడంబరత, సహచరులపట్ల గౌరవం వీటన్నిటివల్లా రఫీ 'పెద్దమనిషి' (జెంటిల్మన్)గానే పేరు నిలుపుకున్నారు. కడదాకా వివాద రహితుడిగానే నిలిచారు.



తలత్ మెహమూద్,ముకేష్,లతామంగేష్కర్, మహమ్మద్ రఫీ, మన్నాడే

వెనుకకు నెట్టి ఒక దశలో కిశోర్ ముందుకు ఎలా సాగగలిగేడు? నెంబర్‌వన్ స్థానం నుండి రఫీని తప్పించి, అతడి స్థానాన్ని ఆక్రమించి కూడా స్నేహ బాంధవ్యాలు చెడకుండా ఎలా చూసుకున్నాడు? ఈ ప్రశ్నలకు సమాధానం వెతకాలంటే కిశోర్ రంగప్రవేశం చేసేనాటికి ఉన్న సాటి గాయకుల గురించి తెలుసుకోవలసినదే.

### అప్పటి నేపథ్య గాయకులు

ఆనాటికి తలత్ మెహమూద్ మంచి 'ఫామ్'లో ఉన్నాడు. తలత్ లక్నోలోని మారిస్ కాలేజ్ ఆఫ్ మ్యూజిక్ పట్టభద్రుడు. సురయ్యాతో కలిసి వారిన్ (1954)లో పాడిన 'రాహీమత్ వాలే' మంచి పేరు తెచ్చింది. 'జాయేతొ జాయే కహా' 'ప్యార్ పర్ బస్ తో నహీ' వంటి పాటలు అజరామరమైనవి. ఇప్పటికీ తలత్ గొంతు అంటే పడిచచ్చే అభిమానులు ఎందరో ఉన్నారు. ఘజల్ పాడాలంటే తలత్‌యే పాడాలి అని విశ్వసించే వారున్నారు. కానీ అతను నటనపై, ఫారిన్ టూర్స్‌పై ఎక్కువ శ్రద్ధ పెట్టడంతో క్రమంగా చిత్ర పరిశ్రమకు దూరమయ్యాడు.

హేమంత్‌కుమార్ బెంగాలీ టాప్ హీరోలకు పాడే గాయకుడు. కానీ హిందీ రంగానికి వచ్చేసరికి కొన్ని రకాలైన పాటలకే అతడిని పరిమితం చేశారు. ఎస్.డి.బర్మన్ వంటివారు అతనికి సమర్థవంతంగా ఉపయోగించుకున్నా, హేమంత్‌కుమార్ వాయిస్‌ను హీరోలు

కోరుకున్నట్టు కనబడదు. బిశ్వజిత్ కు పాడకపోలేదు. కానీ అది హేమంత్ స్వంత సినిమాలలోనే!బయట సినిమా లలో రఫీయే పాడాడు.

ముకేష్, తలత్ కంటె ఎక్కువ మందికి ప్రీతిపాత్రుడయ్యాడు. భావం వ్యక్తీకరించేట్లా పాడడంలో సిద్ధహస్తుడైన ముకేష్‌ను రాజ్‌కపూర్ స్వంతం చేసేసుకున్నా, తక్కిన వాళ్లకు కూడా ముకేష్ పాడడం జరిగింది. మనకు ఘంటసాల తర్వాత పి.బి.శ్రీనివాస్ పేరే గుర్తుకు వచ్చినట్టుగా రఫీ తర్వాత ముకేష్ పేరే వినబడుతుంది.

తక్కిన గాయకులలో మన్నాదే అప్పుడప్పుడు రాజ్‌కపూర్‌కు పాడినా అతడిని హాస్యగీతాలకు, శాస్త్రీయ గీతాలకు ఎక్కువగా ఉపయోగించుకున్నారు. హేమంత కుమార్‌లాగే మన్నాదే కూడా బెంగాలీ సీమలో హీరోలకు పాడినవాడే. అయినా హిందీరంగంలో రఫీ ఎదుట వీరంతా వెలగలేదనే చెప్పాలి. రఫీ పాటలను శ్రోతలు విపరీతంగా ఆదరించటంతో కమ్మర్షియల్‌గా రఫీకి ఎదురులేక పోయింది. 'నౌదో గ్యారహ్' సినిమాకై రఫీచేత పాడించాలా, కిశోర్ చేత పాడించాలా అని విజయ్ ఆనంద్, దేవ్ ఆనంద్ తర్జన భర్జన పడ్డారు. కారణం అప్పటికి కిశోర్‌కు 'కమ్మర్షియల్ సేలబిలిటీ' లేకపోవడం.

### టాప్‌త్రీలో కిశోర్‌ను అడిగినవారు లేరు

అప్పట్లో పెద్ద హీరోలు ముగ్గురు - దిలీప్‌కుమార్, రాజ్‌కపూర్, దేవ్ ఆనంద్. దిలీప్ కుమార్ తొలుత ప్రాధాన్యం ఇచ్చినది తలత్‌కు. తర్వాత రోజుల్లో రఫీకు, అప్పుడప్పుడు (మధుమతి, యహూదీ) ముకేష్‌కు (దిలీప్‌ని అనేక విషయాల్లో అనుకరించిన రాజేంద్రకుమార్ రఫీనే నమ్ముకున్నాడు) రాజ్‌కపూర్‌కు ముకేష్, లేదా మన్నాదే పాడారు. (అతని తమ్ముడు షమ్మీకపూర్‌కూ రఫీయే) ఇక మిగిలినది దేవ్ ఆనంద్. అతనికీ రఫీయే ఎక్కువగా పాడాడు. కిశోర్‌తో స్నేహం, ఎస్.డి.బర్మన్ సలహాల వల్ల కిశోర్‌ను తీసుకున్నా అదీ అప్పుడప్పుడే! ఇలాటి పరిస్థితుల్లో నిలదొక్కుకోవటం, గాయకుడిగా పైకి రావడం కిశోర్‌కు ఎంత కష్టమో ఊహించుకోవచ్చు.

ఇదంతా 'ఆరాధనా' (1969) వరకే. ఆ



రాజ్‌కపూర్ తో కిశోర్‌కుమార్

తరువాత పరిస్థితి పూర్తిగామారింది. ముందులో తలత్‌ను, తర్వాత రఫీని నమ్ముకున్న దిలీప్ కూడా 'సగీనా' (1974) సినిమాలో 'సాలా మైతో సాబ్ బన్ గయా' కు కిశోర్‌ను పిలవాల్సివచ్చింది. రాజ్‌కపూర్ ముకేష్‌కే అంకితమయినా అతని కుమారుడు రణధీర్ కపూర్ కిశోర్‌ని నమ్ముకున్నాడు.

### నవకేతన్‌లోనూ రఫీయే...

కిశోర్‌కి కమ్మర్షియల్ సేలబిలిటీ పెరగడంతో దేవ్‌ఆనంద్ ఇక పూర్తిగా కిశోర్‌నే తీసుకోసాగాడు. రఫీకై పట్టుబట్టే విజయ్ ఆనంద్ కూడా మెత్తబడవలసివచ్చింది. నిజానికి విజయ్ ఆనంద్ డైరెక్షన్‌లో తయారయిన 'కాలా బజార్' (1960), 'తేరే ఘర్‌కే సామ్ నే' (1963)లో అన్నీ రఫీ పాటలే! ఇదేకాదు, రాజ్‌భోస్లా దర్శకత్వం వహించిన దేవ్ సినిమా 'కాలాపానీ'లో కూడా రఫీయే! 1965 నాటి 'గైడ్' (1965 విజయ్ ఆనంద్ డైరెక్షన్)లో కిశోర్‌కు 'గాతా రహే' పాట ఒక్కటే దక్కింది. ఇవన్నీ ఎస్.డి.బర్మన్ సంగీత దర్శకత్వంలో తయారయినా ఆయనా కిశోర్‌కి ఏమీ చేయలేక పోయాడు. మార్కెట్ శక్తులు అలాటివి.

'జ్యూయల్ తీఫ్' (1967)కి వచ్చేసరికి ఒక సోలో (యే దిల్ నహోతా బేచారా) ఒక డ్యూయెట్ (ఆన్ మాఁకే నీచే) వచ్చాయి. ఇది డైరెక్ట్ చేసిన విజయ్ ఆనంద్ "జానీ మేరా నామ్'' (1970)లోనే కాక తన స్వంత సినిమా 'తేరే మేరే సప్నే' (1971)లో పాటలూ కిశోర్‌కే ఇవ్వవలసి వచ్చింది.



పరిస్థితులు ఎలా మారాయో చూడండి! అయితే ఈ మార్పు ఒక్క రోజులో వచ్చినది కాదు. ఎన్నో ఏళ్ల కృషి ఫలితంగా వచ్చింది. ఈలోపున కిశోర్ అసూయతో గానీ, మరో కారణంతోగానీ రఫీమీద ద్వేషం పెంచుకోలేదు. నిజానికి ఏ అరమరికలూ లేకుండా ఇద్దరూ కలిసి పాటలు పాడారు కూడా. 'భాగంభాగ్' (1956) సినిమా 'అల్‌బేలా' ఫేమ్ భగవాన్ స్వంతసినిమా. అతనిదే దర్శకత్వం. తనూ, కిశోర్‌కుమార్ జంట హీరోలుగా నటించారు. ఆ సినిమాలో భగవాన్‌కి రఫీ పాడగా, కిశోర్ తనకు తానే పాడుకున్నాడు. అందువల్ల 'గాలే తూ ఖుశీ కా రాగ్, దునియాహై భాగంభాగ్' అనే టైటిల్‌సాంగ్‌ను రఫీ, కిశోర్ కలిసి పాడారు. అదే సినిమాలో రఫీ, కిశోర్ ఇద్దరూ నానాహంగామా చేస్తూ పాడిన పాట ఉంది 'ఛోడ్ చలే ప్యారీ దునియాకో' అని.

రఫీతో కలిసిపాడడం ఒక ఎత్తయితే రఫీని నేపథ్యగాయకుడిగా ఉపయోగించుకోవడం మరో ఎత్తు. 'రాగిణి' (1958) అశోక్ కుమార్ ఓ.పి.నయ్యర్ సంగీత దర్శకత్వంలో తీసిన సినిమా. 'మన్ మోరా బావ్ రా' అనే క్లాసికల్ సాంగ్ కిశోర్ మీద చిత్రీకరించవలసి వచ్చింది. 'నా వల్ల కాదు, రఫీ సాబ్‌చేత పాడించండి' అన్నాడు కిశోర్.

'షరారత్' (1959) తీసేరోజుల్లో నటుడిగా కిశోర్ చాలా బిజీగా వున్నాడు. టాప్‌క్లాస్ హీరోయన్స్ అతని సరసన నటిస్తున్నారు. 'షరారత్'లో అతని హీరోయిన్ మీనాకుమారి! 'హమ్ మత్ వాలే నౌజవాన్' వంటి కిశోర్ హిట్‌సాంగ్స్ ఆ సినిమాలోవే. సినిమా నిర్మాణం సాగుతూండగా దర్శకుడు హెచ్.ఎస్.రవైల్ కిశోర్ మీద ఓ సీరియస్ సాంగ్ పెడితే బాగుండు ననుకున్నాడు. కిశోర్ సరేనన్నాడు కానీ అతనికి బొత్తిగా టైములేదు. రవైల్ అతని వెంటపడ్డాడు. కిశోర్ దొరకలేదు. ఓ రోజు ఇంటి దగ్గర మాటు వేశాడు. కిశోర్ ఇంట్లోలేడని నౌకర్లు చెప్పినా నమ్మకుండా బయట కాశాడు.

కిశోర్‌కారు రాగానే అడ్డుపడ్డాడు ."ఒక్క పాట రికార్డు చేయాలి. నాకు ఖచ్చితమైన డేట్ ఇస్తే తప్ప నిన్ను పోనివ్వను" అన్నాడు. కిశోర్ "ఏం చెయ్యమంటావు చెప్పు. నాకస్సలు టైము ఉండడం లేదు" అని మొత్తుకున్నాడు.

"అయితే రఫీ చేత పాడించుకోనా? అది బాక్‌గ్రౌండ్ సాంగ్ కాదు సుమా. తెరమీద నువ్వు కనబడతావు" అన్నాడు రవైల్ బెదిరింపుగా.

"నిరభ్యంతరంగా పాడించు" అని చెప్పేసి కిశోర్ వెళ్లిపోయాడు. అహంభావంతో కొట్టుకుచచ్చే సినిమా సీమలో అరుదుగా కనబడే సౌజన్యం కిశోర్‌లో కనబడే సరికి రవైల్‌కి మతిపోయింది. 'తన కెరియర్ గురించి బొత్తిగా పట్టదు అతనికి' అనుకుంటూ వెళ్లి రఫీచేత ఆ పాట పాడించాడు.

### 'ఆరాధనా' ఛాన్సు వచ్చిన తీరు

కిశోర్ జీవితాన్ని మలుపు తిప్పిన 'ఆరాధనా' సినిమా దర్శక నిర్మాత శక్తి సామంతా బెంగాలీ వాడు. హుషారైన సినిమాలు, క్రైమ్ థ్రిల్లర్స్ తీయడంలో పేరుగాంచినవాడు. "హౌరా బ్రిడ్జి'' (1958), "సింగపూర్'' (1960), "జాలీనోట్'' (1960), "చైనాటౌన్'' (1962), "కాశ్మీర్ కీ కలీ'' (1964), "సావన్ కీ ఘటా'' (1966), "ఏన్ ఈవెనింగ్ ఇన్ పారిస్ '' (1967) వంటి సినిమాలలో అతను ఓ.పి.నయ్యర్‌ను, శంకర్ జై కిషన్‌ను, రవిని ఉపయోగించుకున్నాడు. "ఇన్‌సాన్ జాగ్ ఉఠా'' మాత్రం బర్మన్‌కి ఇచ్చాడు.

సంగీత దర్శకుడు ఎవరైనా గాయకుడు మాత్రం ఎప్పుడూ రఫీయే. అటువంటి

శక్తిసామంతా సడన్‌గా ఓ సెంటి మెంటల్ సినిమా, అదీ ఓ కొత్త నటుడికి డబుల్ రోల్ ఇచ్చి తీద్దామనుకున్నాడు. (అది హిట్ కావడంతో ధైర్యం వచ్చి తరువాత కటీ పతంగ్, అమర్ ప్రేమ్, అనురాగ్, అమానుష్, ఆనంద్ ఆశ్రమ్ వంటి 'క్లాస్' ఫిల్మ్స్ తీశాడు) సంగీతం ఇచ్చే బాధ్యత సాటి బెంగాలీ సచిన్ బర్మన్‌కి ఇచ్చాడు.

బర్మన్ కారణంగా కిశోర్‌కు శక్తిసామంతా వంటి పెద్ద నిర్మాతకు పాడే అవకాశం వచ్చింది. రాగానే కిశోర్ ఎగిరి గంతేయ లేదు. "ఆ హీరో వేషం వేసే కుర్రాణ్ని పంపించండి. ఓ సారి చూస్తాను'' అన్నాడు. "సరే పంపుతా'' అన్నాడు శక్తిసామంతా.



**కిశోర్ -రాజేష్ ఖన్నా**

కొన్నిరోజులకు రాజేష్‌ఖన్నా కిశోర్ ఇంటికి వచ్చాడు. కిశోర్ అతన్ని సాదరంగా ఆహ్వానించి చాలాసేపు మాట్లాడేడు. 'సినిమాలకు ఎందు కొచ్చావ్?' అని కిశోర్ అడిగిన ప్రశ్నకు సమాధానంగా "మంచి సినిమాల ద్వారా ప్రజలకు చేరువవుదామని'' అన్నాడు రాజేష్‌ఖన్నా. అతను మాట్లాడుతున్నంతసేపు కిశోర్ అతన్ని, అతని మాటతీరును, హావభావాలను బాగా పరిశీలించాడు. చివరగా అతన్ని సాగనంపుతూ "నువ్వు వృద్ధిలోకి రావాలని నా కోరిక. నీకు తప్పకుండా పాడతాను'' అన్నాడు.

కిశోర్ తన పట్ల చూపిన సుహృద్భావాన్ని రాజేష్‌ఖన్నా మర్చిపోలేదు. 'ఆరాధనా' హిట్ కావడంతో అతను సూపర్ స్టార్ అయ్యాడు. 'ఆరాధనా'లో అతనికి రఫీ, కిశోర్ ఇద్దరిచేతా పాడించాడు బర్మన్. తనకు ప్లేబ్యాక్ ఎవరు పాడాలో నిర్ణయించుకోగల స్థానానికి చేరుకున్న రాజేష్ ఖన్నా కావాలంటే రఫీని కొనసాగించ గలిగేవాడు. కానీ అతను కిశోర్ వైపు మొగ్గు చూపాడు.

దీనికి రెండు కారణా లున్నాయి. కిశోర్ స్వతహాగా నటుడు, మిమిక్రీ కళాకారుడు. కాబట్టి హీరోను దృష్టిలో పెట్టుకుని అతను పాడితే ఎలా పాడతాడో ఊహించుకుని పాడేవాడు. (తెలుగు నాట ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం ఇలా చేయబట్టే అతి త్వరగా పైకొచ్చారు.) భావాన్ని బట్టి పాడడమే కానీ రఫీ ఈ విషయమై ప్రత్యేక కృషి చేసినట్టు రాజేష్ ఖన్నాకు అనిపించలేదు.

ఇంకో కారణం - ట్యూన్ విషయంలో కూడా కిశోర్ సంగీత దర్శకుడితో చర్చించి ఇంప్రొవైజ్ చేయడం రాజేష్‌కు నచ్చింది. తనకెంతో పేరు తెచ్చిన 'రూప్ తేరా మస్తానా' పాటరూపుదిద్దుకోవడంలో కిశోర్ పాత్ర అతనికి తెలుసు.

**'రూప్‌తేరా మస్తానా'**

సచిన్ దేవ్ బర్మన్ తొలుత ఆ పాటకు కూర్చిన ట్యూన్ - టిపికల్ బెంగాలీ భాటియాలీ స్టయిల్‌లో ఉంది. అది విని కిశోర్ 'దీనికంటె కాస్త వెస్టర్నయిజ్‌డ్ ట్యూన్ పెడితే బాగుంటుంది' అన్నాడు. 'ఠఠ్' అన్నాడు పెద్దాయన. "సరే, ఇండియన్ ట్యూనే అనుకోండి. దాన్ని ప్రెజంట్ చేసినప్పుడు వెస్టర్న్ మోడల్‌లో చేద్దాం' అన్నాడు కిశోర్. పెద్దాయన తలకాయ అడ్డంగా తిప్పుతుండగానే కిశోర్ చిన్నప్పుడు తను విన్న ఓ బెంగాలీ పాట పాడనారంభించాడు.

"ఏక్‌టూ పాడే షాషుర్ బాడీ, దీయే దేబో గొడాగొడీ' అనే ఆ పాట తీసుకుని కిశోర్ స్పీడు పెంచి, గమ్మత్తులు చేసి పాడాడు. సచిన్ చిరునవ్వు నవ్వి 'సరే అలాగే కానీ' అన్నాడు. ఆ ట్యూన్‌తో 'రూప్ తేరా మస్తానా' పాట సూపర్‌హిట్ అయింది.

**రఫీ, కిశోర్ పద్ధతులు వేరువేరు**

ఇలా చొరబడడం రఫీకి అలవాటులేదు. సంగీత దర్శకుడు ఫోన్ మీద ట్యూన్ చెబితే చాలు. ఇంటి దగ్గరే రిహార్స్ చేసుకుని మర్నాడు ఉదయం వచ్చి పాడేసేవాడట. రీరికార్డింగు అవసరమే లేకుండా భోజనం వేళకు ఇల్లు చేరేవాడట.

కిశోర్ పద్ధతి వేరు. గంటల తరబడి పాటను రిహార్సు చేయడం, సంగీత దర్శకుడితో డిస్కస్ చేయడం, 'ఇంప్రొవైజ్' చేయడం అతని అలవాటు. ఓ మాట అర్థం కాకపోతే గీత రచయితను పిలిపించి అంతకంటె తేలిక మాట

## కిశోర్ జీవితాన్ని మలుపు తిప్పిన ఓ సీరియస్ పాట



సత్యజిత్‌రే తో కిశోర్

హాస్యనటుడిగా కెరియర్ ముగిసిపోయి, స్వంత సినిమాలు ఫ్లాప్ అయి, కచ్చేరీలు చేసుకుంటూన్న కిశోర్ జీవితంలో సెకండ్ ఇన్నింగ్స్ 'ఆరాధనా'కు పాటలు పాడడంతో ప్రారంభమయిందని అందరికీ తెలుసు. 'ఆరాధనా'లో కొత్త నటుడు రాజేశ్ ఖన్నాకు కిశోర్ చేత నేపథ్యగానం చేయించాలన్న నిర్ణయం సచిన్ దేవ్ బర్మన్‌దే నన్న విషయం కూడా చాలామందికి తెలిసివుంటుంది. బర్మన్‌కి ఆ ఉద్దేశ్యం కలగడానికి కారణభూతమైన పాట ఒకటి ఉంది. అదే 'పంథీ హూ మై ఉస్ పథ్ కా'!

'దూర్ గగన్ కి ఛావోం మే' తీసిన ఏడేళ్లకు కిశోర్ అలాటి సినిమా ఇంకోటి తీశాడు. దాని పేరు - 'దూర్ కా రాహీ'. (ఈ సినిమాకు ఇన్‌స్పిరేషన్ 'షేన్' అనే ఓ వెస్టర్న్ మూవీట!) ఈ చిత్రం 1971 లో విడుదలయినా పాటలు మాత్రం చాలాముందే తయారయ్యాయి. ఆ సినిమాకై కిశోర్ తయారుచేసుకున్న పాటే - 'పంథీ హూ మై ఉస్ పథ్ కా'! ట్యూన్ రవీంద్రనాథ్ టాగూర్ పాట నుండి తీసుకున్నది. బహుశా కిశోర్‌కు ఆ ఇన్‌స్పిరేషన్ ఇచ్చినవాడు సత్యజిత్ రాయేమో! రాయ్ తను తీసిన 'చారులతా' (బెంగాలీ) సినిమాలో 'అమీ చీనీగో చీనీ తొమారే' అనే రవీంద్రగీతాన్ని ఉపయోగించుకుంటూ వెరయిటీగా ఉంటుందని కిశోర్ చేత పాడించాడు. అప్పటిదాకా రవీంద్రగీతాలు పాడే ధోరణికి భిన్నంగా సాగిన కిశోర్ గానశైలి సచిన్ దేవ్ బర్మన్‌కు నచ్చింది. కిశోర్ బర్మన్‌కు కొత్త కాదు. అంతకుముందు ఎన్నో హిట్స్ పాడించాడు. అయినా ఈ కొత్త స్టయిల్, కిశోర్ గళంలో ఉన్న మెచ్యూరిటీ సచిన్‌దాకు బాగా నచ్చాయి.

ఓ రోజు తన ఇంట్లో జరిగిన పార్టీలో కిశోర్ ఆయనకు 'పంథీ హూ మై ఉస్ పథ్ కా' పాడి వినిపించాడు. అంతే! వెంటనే బర్మన్ నిర్ణయించాడు - 'నువ్వు పూర్తి స్థాయి గాయకుడిగా అవతారం ఎత్తు. నీకూ, దేవ్ ఆనంద్‌కి తప్ప వేరెవరికీ పాడనన్న నియమం సడలించుకో. నిన్ను ఆకాశమంత ఎత్తు గాయకుణ్ని చేస్తాను. శక్తిసామంతా 'ఆరాధనా' అనే సినిమా తీస్తున్నాడు. దానిలో నీచేత పాడిస్తాను.' అన్నాడు.

అన్నట్టుగానే పాడించాడు. చరిత్ర సృష్టించాడు.

కొసమెరుపు ఏమిటంటే 'దూర్ కా రాహీ' రిలీజయ్యింది. ఘోరంగా ఫెయిలయింది. జన్మలో ఇక సీరియస్ సినిమాలు తీయకూడదని కిశోర్ ఒట్టు వేసుకున్నాడు!



'దూర్ కా రాహీ' లో కిశోర్, అశోక్‌కుమార్

పెట్టమని అడగడం, అన్ని మాటలకు అర్థం తెలుసుకుని పాడడం అతని నియమం. రికార్డింగు థియేటర్‌లో సంగీత దర్శకులతో, ఆర్కెస్ట్రా వాళ్లతో, సహగాయకులతో ముచ్చట్లు చెప్పి, చర్చలు జరిపి, ఎన్నిసార్లు కావాలంటే అన్నిసార్లు ప్రాక్టీసు చేసి, పాటను రకరకాలుగా పాడి ప్రయోగాలు చేసి, నటుడిని దృష్టిలో పెట్టుకుని పాడేవాడు.

ఇంకో విషయం ఉంది. రఫీ పాడే పద్ధతి అతి 'పెర్‌ఫెక్ట్'గా ఉంటుంది. దానివల్ల 'మానవీయత' లోపించిందా అనిపిస్తుంది. గాయకుడు సరదాగా ఎంజాయ్‌చేస్తూ పాడినట్టు కాకుండా ఏదో వృత్తి ధర్మంగా పాడినట్టు ఉంటుంది. కొద్దిపాటి లోపాలుంటే బాగుండునురా అనిపిస్తుంది. పాపిట తీసుకుని జుట్టు దువ్వుకుని శుభ్రంగా జడవేసుకుంటే అందంగా ఉందని అనిపిస్తున్నా, ఒక్కోప్పుడు సరిగా దువ్వీ దువ్వుకోకుండా గాలికి ముంగురులు ఎగిరేట్లా వదిలేస్తే బాగుంటుందనిపిస్తుంది కదూ!

ఈ విషయం అర్థం కావాలంటే నూర్జహాన్, షంషాద్ బేగం, గీతదత్‌లాంటి వారి వాయిస్‌లు వినండి. లతా కున్న శ్రావ్యత వారికిలేదు. కానీ వారి పాటల్లో 'ఎమోషన్' ధ్వనిస్తుంది. కిశోర్ విషయంలో కూడా అదే జరిగింది. అందునా 1970 ల నుండి వచ్చిన పాటల్లో హోరు పెరగడం, ప్రజల అభిరుచులలో మార్పు రావడం జరిగింది. ఆ యుగానికి, ఆనాటి యువతకు నచ్చే విధంగా 'ఇన్వాల్వ్' అయి పాడే కిశోర్ ధోరణి వాళ్లకు బాగా నచ్చింది. ఒక పద్ధతికి కట్టుబడకుండా 'డిజార్డర్లీగా' స్వేచ్ఛగా పాడుతున్నాడ్రా, అనుకుని మురిసి పోయారు. బ్రహ్మరథం పట్టారు.

కిశోర్ 'హవా' ఉధృతం సాగే రోజుల్లో కూడా రఫీ ఎన్నో మంచిపాటలు పాడేడు. గాత్ర మాధుర్యం, గానకుశలత ఏ మాత్రం తగ్గక పోయినా రఫీకి అవకాశాలు తగ్గడం అన్యాయం అనిపించింది అందరికీ. ఆ విషయం కిశోర్ కూడా



గుర్తించి రఫీతో తరచుగా అనేవాడు 'మనిద్దరి మధ్యా విభేదాలు సృష్టిద్దామని కొందరు ప్రయత్నించవచ్చు. నాకు మీ పట్ల ఎప్పుడూ గౌరవ భావమే' అని.

అన్నట్టుగానే 'రఫీ పాడితే నేను ఆ సినిమాలో పాడను' లాటి బెదిరింపులు, 'ఇపుడు నేనే నెంబర్ వన్' వంటి స్టేటుమెంట్లు -ఇటువంటివి కిశోర్ నోటి వెంట ఎప్పుడూ రాలేదు.

సహగాయకులతోనే కాదు, సహహాస్యనటు లతో కూడా కిశోర్ గౌరవంగానే మెలిగాడు, 'మెహమూద్'తో పంతం వచ్చినప్పుడు తప్ప!

**(ఇంకా ఉంది)**

తనను తొలిదశలో ఉత్సాహపరచిన అరుణ్‌కుమార్ ముఖర్జీని కిశోర్‌కుమార్ ఎప్పటికీ మరువలేదు. అతన్నే కాదు, అతన్ని కుటుంబాన్ని కూడా.

అశోక్‌కుమార్, మీనాకుమారి నటించిన "బందిష్" (1955) సినిమాకు సంగీత దర్శకత్వం వహించే అవకాశం వచ్చింది అరుణ్‌కుమార్‌కు. అతనిలాంటి వర్ధమాన మ్యూజిక్ డైరెక్టరుకి ఇది గొప్ప ఛాన్సు. "బందిష్" ప్రీవ్యూ చూసి వస్తుండగానే గుండెపోటు వచ్చి హఠాత్తుగా మరణించాడు.

చిన్నవయస్సులోనే అతను పోవడం, భార్య ఇద్దరు పిల్లలు ఉండడం సినీ పరిశ్రమలో చాలా మందిని కలచివేసింది. అశోక్‌కుమార్, హృషీకేశ్ ముఖర్జీ ఇతర మిత్రులు అప్పటికప్పుడు విరాళాలు పోగుచేసి భాగల్పూరులో ఉన్న అతని కుటుంబానికి పంపించారు.

కానీ కిశోర్‌కుమార్ మాత్రం ఒకసారి డబ్బిచ్చి ఊరుకోలేదు. ప్రతీనెలా వాళ్ళకు డబ్బు పంపేవాడు. ఆ విషయం ఎవరికీ చెప్పలేదు కూడా. పిసినారిగా పేరుబడ్డ కిశోర్‌కుమార్‌లో ఈ దాతృత్వ గుణం కూడా ఉందంటే ఎవరూ నమ్మరు కూడా. నిజానికి కిశోర్ గుప్తదానాలు పొందిన వ్యక్తులు కొందరున్నారు. కానీ వారెవరో కిశోర ఎప్పుడూ తెలియపరచలేదు. అరుణ్‌కుమార్ ముఖర్జీ భార్య తన స్నేహితులతో చెప్పకపోయివుంటే ఈ విషయమూ బయటకు వచ్చేదికాదు!

## కిశోర్ గీతావళి

కుచ్ తో లోగో కహేంగే లోగోంకా కామ్ హై కెహనా
ఛోడో బేకార్‌కి బాతోంమే కహీ బీత్‌న జాయే రేనా ॥2॥ ॥కుఛ్॥
కుఛ్ రీత్ జగత్‌కి ఐసీ హై హర్ ఏక్ సుబహ్ కీ షామ్ హుయీ ॥2॥
తూ కౌన్ హై తేరా నామ్ హై క్యా సీతా భీ యహా బచ్‌నామ్ హోయీ
ఫిర్ క్యూ సంసార్‌కి బాతోంసే భీగ్ గయే తెరె నేనా ॥కుఛ్॥
హమ్ కో జో ఆనే దేతే హై హమ్ ఖోయే హై ఇన్ రంగ్ రలియోంమే ॥2॥
హమ్‌నే ఉన్‌కో భీ ఛుప్ ఛుప్ కె ఆతే దేఖా ఇన్ గలియోంమె
మే సచ్ హై ఝూఠీ బాత్ నహీ తుమ్ బోలో యే సచ్ హై నా ॥కుఛ్॥





'సూపర్ స్టార్' బిరుదు సంపాదించుకున్న రాజేష్‌ఖన్నా తన 24 వ యేట 'ఆఖ్రీ ఖత్' (1966) అనే లోబడ్జెట్ సినిమాలో హీరోగా ప్రవేశించాడు. 1967లో 'బహారోంకే సప్నే', 'రాజ్' సినిమాలలో చక్కగా నటించినా 'ఆరాధనా' (1969) అతన్ని రాత్రికి రాత్రి స్టార్‌ను చేసేసింది. అదే సంవత్సరంలో విడుదలయిన 'దోరాస్తే' 'బంధన్'లో లవర్‌బాయ్ ఇమేజ్ ప్రదర్శిస్తూనే ఆ ఇమేజ్‌కి విరుద్ధమైన పాత్రలు ధరించడానికి ఎన్నడూ వెనుకంజ వేయలేదు రాజేష్‌ఖన్నా. 'ఇత్తెఫాక్', 'ఖామోశీ' కూడా 1969లో విడుదలయినవే. తదుపరి సంవత్సరంలో సచ్చాఝూటా, నాన్ మిలో సజీనా, ది ట్రెయిన్ వంటి ఫక్తు కమ్మర్షియల్ చిత్రాలతో బాటు, 'సఫర్', 'కటీ పతంగ్' 'ఆనంద్' వంటి ఉదాత్తమైన చిత్రాలలో నటించి ప్రేక్షకులను మెప్పించాడు.

1971లో 'జిందగీ ఎక్ సఫర్' (అందాజ్) నాయకుడుగా, అమ్మాయిలను 'హాథీమేరే సాథీ' ద్వారా పిల్లలను ఒక పక్క ఆకర్షిస్తూనే, 'అమర్ ప్రేమ్'లో పంచీ, లాల్చీలో నాన్-హీరో వేషం వేయడానికి సాహసించాడు. రాజేష్‌ఖన్నా సంగీతం ఆర్.డి.బర్మన్‌ది. కిశోర్‌కి చిన్ననాటి నుండి ఫ్రెండు కాబట్టి అరమరికలు లేకుండా చర్చించుకుని పాటలు రూపొందించుకొనేవారు వారిద్దరూ. 'అమర్ ప్రేమ్'లోని ఈ పాట కిశోర్‌కి గర్వకారణమైనపాటల్లో ఒకటి.

ఫిబ్రవరి 19 చలం వర్ధంతి సందర్భంగా...



నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



# హాస్యామరథం

ఒకసారి 'విజయచిత్ర' పత్రిక హాస్య సంచిక అంటూ ప్రత్యేక సంచిక వేసింది. "నరుడా! ఏమి నీ కోరిక?" అని అడిగింది విజయచిత్ర. "హాస్యనటులందర్నీ ఓ దగ్గరికి తెచ్చి గ్రూప్ ఫోటో తీయించు" అన్నారు పత్రిక సంపాదకులు.

"చిక్కుల్లో పడతార్రా! ఎలా కలుపుతారు వీళ్లని-అందరూ బిజీ బిజీ" అంది విచి. "ఏదో తంటాలు పడతాంలే" అన్నారు. నిజంగానే తంటాళ్లు క్వింటాళ్ళ కొద్దీ పడ్డారు. రేలంగి హాస్య కుటుంబానికి యజమాని. ఆయనకి వీనస్‌లో షూటింగు. బాలకృష్ణ అల్లురామలింగయ్య అక్కడే వున్నారు గనక, తక్కినవాళ్లని తెచ్చుకోవాలి. వాళ్లూ షూటింగుల్లోనే వున్నారు. వేర్వేరు స్టూడియోల్లో, ఆయా ప్రొడ్యూసర్లు డైరెక్టర్లతో మాట్లాడి, మనవి చేసుకుని దొరికినంత మందిని కలిసే సరికి సాయంకాలం నాలుగైంది. కుర్చీలు వేసి గ్రూప్ ఫోటోకి సిద్ధమైనా, రావలసిన ఇంకొకరు ఎంతకీరాడు. అతను చలం! "నే చెప్పానా! విన్నారు కాదు. అనుభవించండి" అంది విజయచిత్ర. రమణారెడ్డి, పద్మనాభం అంతా వచ్చి కుర్చీల్లో కూచున్నారు. కెమెరా పొజిషను రెండుగంటల నుంచి సిద్ధం చేసి నిరీక్షిస్తున్నాడు కె.ఆర్.వి.భక్త. "చలం రాడా? వస్తాడా? కాల్‌షీటుకీ వెయిటింగే, ఫోటోకీ వెయిటింగే? వాట్ నాన్సెన్స్ వాట్ సూట్ సూట్" అని రేలంగి గారు ఆయన ధోరణిలో నరదాగా అరుస్తున్నారు. "చలం లేకపోతేనేం-తీసేద్దాం ఫోటో" అన్నారు కొందరు. "లేకపోతే ఎలా! బాగుండదు" అన్నారు మరికొందరు. చెట్టుచాటున నిలబడి కనబడీ కనబడకుండా విజయచిత్ర నవ్వుతోంది"-నేను చెప్పానా కుదరదర్రా అని" అనుకుంటోంది. ఇక లాభం లేదని, ఫోటో కార్యక్రమం ముగించేశారు-ఆర్గనైజర్లు. "ఉన్న వాళ్లలో ముఖ్యులు వున్నారు, ఎక్కువ మందీ వున్నారు. సరే



కానీండి" అనుకున్నారు అందరూ కోరస్‌తో. అందరూ వెళ్లిపోయారు. కుర్చీలు సర్ది, కెమెరా సర్దుకుంటూంటే రయ్‌మని వచ్చి ఓ కారు ఆగింది. దిగారు చలం. "ఏంటింకా ఎవరు రాలేదా? నేనే ఫస్టు అన్నమాట" అని జోక్ చేశాడు-తెలిసే. "సారీ-ఎప్పటికీ మీరు రాకపోతే..." అని నసిగాడు భక్త. "అదెలా! చలం లేకుండా హాస్య కుటుంబమా! మళ్ళీ అందర్నీ పిలుద్దాం" అన్నాడు చలం. "మళ్ళీనా! నెక్స్ట్ ఇయర్ పడుతుంది" అన్నాడు కుటుంబ సభ్యుడూ, సహకార సంపాదకుడూ అయినా రా.కొ. కొంత ఘర్షణయింది. 'శుభం కార్డు' పడి పోయింది. ఆ మర్నాడు చలం తన ఫోటో ఒకటి పట్టుకొచ్చి "ఎలాగోలా, దీన్ని మధ్యలో గుచ్చండి. చలం లేకపోతే గ్రూపుకి నిండుదనం రాదు" అని నవ్వుతూనూ సీరియస్‌గానూ చెప్పి తుర్రుమని పారిపోయాడు. తర్వాత, భక్తతో మాట్లాడి టెక్నికల్‌గా ఎలా చెయ్యాలని ఆలోచించి(అప్పటికి ఈ కంప్యూటర్లూ సులభ విధానాలూ రాలేదే!) గ్రూపులో గుచ్చాం చలాన్ని. అయితే విడిగా పెట్టినట్టుగానే కనిపిస్తుంది. ఏం చెయ్యలేం! ప్రింటు అయిన తర్వాత చూసి "చూశారా! నా ఫోటో వుండడం వల్లనే ఈ శోభ. కాని, నేనే ప్రామినెంటుగా కనిపిస్తున్నాను" అన్నాడు చలం ఘనత సాధించిన నవ్వుతో. 'ప్చ్ పాపం' అనుకుంది వి.చి.

* * *

'పాల మనసులు' సినిమాలో నేను చలానికి మామని. అప్పట్నుంచి 'మామా' అని నన్ను పిలవడం అలవాటు చేసుకున్నాడు. నేను "అల్లూ" అనేవాణ్ణి. చలానికి నిదానం అలవాటు-అదే బద్ధకం! ఆలస్యంగా లేవడం, షూటింగుకి ఆలస్యంగా రావడం లాంటిది. 'పాల మనసులు' సినిమాకి డైరెక్టరు పుట్టన్న. ఒకరోజు చలం చాలా లేటు. "ఏమిసార్, చలమ్ గారు వస్తురా, ఏమి ఇంత లేటయితే ఏమి తీస్తును?" అంటూ విసుక్కుంటున్నారు. ఆ విసుగు మూడ్‌లో దిగాడు చలం. "సారీ" అన్నాడు రెండక్షరాల్లో తేలిగ్గా. "ఏమిసార్ పెద్ద సీను సార్, ఎలా తీస్తును చలమ్‌గారూ" అన్నాడు దర్శకుడు. "డైరెక్టర్ గారూ! నేను ఇప్పుడు స్టార్స్‌లో చేరాను. స్టార్సు లేటుగా రావాలి. సరైన సమయానికొస్తే స్టారు స్టారు కాడు, స్కూలు మాస్టారు, స్టారు ఎంత లేటుగా వస్తే





అంత గొప్పవాడు. మినిస్టరు చూడండి, ప్రతి షూటింగుకీ లేటే. చలం చూడండి ప్రతి మీటింగుకీ లేటే! అందుకని లేటుగా వచ్చాను గాని, ఇంకోటి కాదు." అని చమత్కారాలూ అవీ కలిపి, ఉపన్యాసం లాంటిదిచ్చి, డైరక్టరుకీ ప్రొడ్యూసరుకీ కోపం రాకుండా మేనేజ్ చేసి, "రడీ రడీ ఇంకా ఆలస్యం ఎందుకు-షాటు ఎక్కడ? సీను ఏది? ఎక్కణ్ణుంచి ఎంతవరకు?" అంటూ అడావుడి చేసి మూడ్ మార్చి, ఆరంభం చేయించాడు చలం.

* * *

చలం పేకాడేవాడు. అంటే, ఎప్పుడూ కాదు గాని, ఆడేవాడు. ఒక అవుడ్డోర్‌లో సాయంకాలపు విశ్రాంతి సమయంలో అంతా పేకాడుతున్నారు. చలం ఎవరితోనో మాట్లాడుతున్నాడు. ఆడుతున్న వాళ్లు చలాన్ని రమ్మన్నారు. మూడ్ లేదన్నాడు. మీరాడండి అన్నాడు. "కాదు కాదు మీరు రావాలి, ఆడాలి" అని ఆ పేకాట సిబ్బంది ఇబ్బంది పెట్టింది. "సరే పంచండి" అన్నాడు చలం. పంచారు. ఆరు ఆటలయినాయి గాని, ప్రతి ఆటా చలం కార్డులు పడేస్తున్నాడు "డ్రాప్" అని. డ్రాపుకి 50 రూపాయలు ఇచ్చేస్తున్నాడు. "ప్రతి ఆటా పారేస్తున్నావేమిటి అల్లూ" అన్నాన్నేను. "అవును. నేను ఆడను వద్దు మొర్రో-నాకు మూడ్‌లేదు అంటే రమ్మన్నారు. నా మీద భక్తా? డబ్బులు ఇవ్వాలనే కదా. అందుకనే ప్రతి ఆటా పడేస్తున్నాను-డబ్బూ పారేస్తున్నాను. పోతేపోనీ, మూడువందలు పోయిందిప్పటికి. మీ అందరికీ తృప్తే కదా" అన్నాడు చలం. "అయితే వద్దులే నాయనా. నువ్వేం ఆడొద్దు. ముక్కలు చూడకుండానే పారేస్తున్నావు కదా" అన్నాడొక క్రీడాకారుడు. "రక్షించారు-" అని చలం తప్పుకున్నాడు. తన పాచిక పారినందుకు సంతోషిస్తూ.

* * *

చిరంజీవి అనే సినిమాలో చలం హీరో. 'నీర్‌కుమిళి' అనే తమిళ చిత్రం ఆధారం. నాగేష్ వేసిన వేషం చలం వేస్తున్నాడు. తెలుగు సినిమాకి డైరెక్టరు సావిత్రి. మధ్యాహ్నం లంచ్ బ్రేక్‌లో చలం ఇంటికి వెళ్ళాడు. మూడున్నర అయినా రాడే! సావిత్రి గారు షాటు కూడా ఏర్పాటు చేసేసి, బుగ్గమీద చెయ్యి పెట్టుకుని అలా కూచున్నారు. "ఎందుకమ్మా ఈ డైరెక్షన్ పెట్టుకున్నారు? నటీమణిగా మీ కోసం నిరీక్షించే డైరెక్టర్లున్నారు. ఇప్పుడు మీరు నిరీక్షిస్తున్నారు" అన్నాన్నేను ఏదో అనాలి కదా అని. ఆమె తన సహజమైన చిరునవ్వొకటి చిందించి, కాంతికళ్లతో చూశారు. "వీటన్నింటికీ ప్రిపేరయే కదా, డైరెక్షనుకి వచ్చింది! మరీ ఇంత లేటేమిటి ఈ చలం!" అందామె. "వచ్చేశాను" అన్నాడు చలం, సమయానికి నారదుడు వచ్చి 'నారాయణ' అన్నట్టు. "అమ్మా డైరెక్టరు గారూ క్షమించండి. భోజనానికి గెస్టులొచ్చారు. వాళ్లతో కూచుని లేచే సరికి ఈ టైమైయింది. మిమ్మల్ని వెయిట్ చేయించాను. క్షమించండి" అన్నాడు చలం. ఆమె చిరునవ్వు సంధించారీ సారి, చిందించకుండా. దీపాలు వెలుగుతున్నాయి.



"ఏమయ్యా అల్లూ! అప్పుడు స్టార్సు లేటుగా రావాలి, లేటుగా వస్తేనే స్టారు అన్నావు. ఇప్పుడా మంత్రం వల్లించలేదే" అన్నాను. "అమ్మో ఆవిడ స్టార్- పెద్ద స్టారయ్య బాబూ. ఆవిడ దగ్గర ఆ మంత్రం చెప్పకూడదు. ఇంకోటి చెప్పాలి. అసలు సంగతేమిటో తెలుసా-తినగానే చిన్న కునుకు పట్టింది. అదే లేటుకి కారణం-నేను కాదు, నన్నెవరన్నా ఒప్పుకోను. కునుకుననండి. అసలదెందుకు రావాలి?" అని నవ్వుతూ వెళ్లి షాటుకి రడీ అయ్యాడు.

చలానికి పెద్దగా కోపం వచ్చేది కాదు. నవ్వుతూనే మాట్లాడేవాడు. ఏదీ సీరియస్‌గా తీసుకోలేదు-జీవితాన్ని కూడా! సరదాగా ఆటగా, జనాన్ని నవ్విస్తూ తాను నవ్వుతూ కాలం గడిపేశాడు చలం నటుడిగా, నిర్మాతగా, మిత్రుడిగా! ■

## చిత్రం : పెళ్ళి సందడి

రచన: జూ. సముద్రాల సంగీతం: ఘంటసాల గానం: జిక్కి, జె.వి.రాఘవులు

ఆ: బైరో బైరో పెళ్ళికొడకా
అ: ఆల్ రైరో రైరో నా పెళ్ళి కూతురా ||బైరో||
అ: అడ్రస్ తెలియక అల్లాడిపోతి అందాల పూబంతి ||అడ్రసు||
నిను చూచి నా దినం మొదలు నే మజ్నూ నైపోతినే
మజ్నూ నై పోతినే ||బైరో||
ఆ: అయ్యో పాప మీ అవస్థ చూస్తే గుండె నీరుకాదా ||అయ్యో||
వెళ్ళి వెదకు నీ చెలీ లైలను ఎడారీ దారులా ||వెళ్ళి||
హాయ్ ఎడారీ దారులా ||బైరో||
అ: వలచి నన్ను దయ తలచకున్న
నా తలను కోసుకుంటా ||వలచి||
ఆ: తలా తీసుకొను పనే లేదురా నిన్నే చేసుకుంటా ||తలా||
అ: హాయ్ అదే కావాలంటా ||బైరో||

## చిత్రం : బుల్లెమ్మ - బుల్లోడు

రచన: రాజశ్రీ సంగీతం: సత్యం గానం: ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం

అ: నీ పాపం పండెను నేడు
ప: నీ భరతం పడతా చూడు
నీ పాలిటి యముణ్ణి నేను
నీ కరెక్ట్ మొగుణ్ణి నేను యహ్ ||నీ పాపం||
చ: నమ్మిన వారికి నమ్మక ద్రోహము చేసినందుకు శిక్ష
ఎప్పటికప్పుడు తప్పుడు లెక్కలు రాసినందుకు శిక్ష ||నమ్మిన||
నీ డొక్కచించి నే డోలుకట్టి వాయించుటే నా దీక్ష ||నీ పాపం||
చ: దెబ్బకు దెబ్బ చెల్లిస్తాను చూసుకో నా దమ్ము
తల పొగరంతా తగ్గేదాకా దులుపుతాను నీ దుమ్ము ||దెబ్బకు||
నీ కోసమే నే నీ దినం యెత్తేను ఈ అవతారం ||నీ పాపం||

## చిత్రం : సత్తెకాలపు సత్తెయ్య

రచన: ఆత్రేయ సంగీతం: M.S.విశ్వనాథన్ గానం: పి.బి.శ్రీనివాస్

ఒల్ ఒల్ ఒల్ లాయీ ఒల్ ఒల్ ఒల్ లాయీ ఒల్ ఒల్ ఒల్ లాయీ
ముద్దు ముద్దు నవ్వు బుగ్గల్లో రువ్వు
జాజిమల్లె పూవు బజ్జోమ్మ నువ్వు ||ముద్దు||
ఏ యింటి పంటవో ఏ తల్లి నోమువో
ఈ యింటివానికి నా వంటి పేదకు
ప్రాణాలు పోశావు బ్రతకాలి అన్నావు
ఉరిత్రాడు జోజోల ఉయ్యాల చేశావు...ఉయ్యాల చేశావు ||ముద్దు||
నా బాధ విన్నావు నీ గాధ చెప్పావు
ఈ పూరి గుడిసెలో నా బీదమనసులో
చిన్నారి పొన్నారి చిగురల్లె వెలిశావు
సిరిలేదు గిరిలేదు మనసుంటె అన్నావు...మనసుంటె అన్నావు ||ముద్దు||

## చిత్రం : మట్టిలో మాణిక్యం

రచన: ఆత్రేయ సంగీతం: సత్యం గానం: ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, సుశీల

ఆ: నా మాటే నీ మాటై చదవాలి
నే నంటే నువ్వంటూ రాయాలి ||నా మాటే||
ఆ: అఆ.....ఇఈ.....ఉఊ.....ఎఏ
అ: అఆ.....ఇఈ.....ఉఊ.....ఎఏ
అ: మట్టిలో రాసిన రాతలు గాలికి కొట్టుకుపోతే
ఎట్లాగా...ఎట్లాగా
ఆ: మనసున రాసి మననం చేస్తే
జీవితమంతా వుంటాయి.....నిలిచుంటాయి
అ: ఆ మాటే నిజమైతే నేర్పమ్మా
మనసంతా రాసేస్తా కోకమ్మా
ఇ: పడవా....
కడవా...
చిలకా...
పలకా....
అ: కొండలు కోనలు ఏం చదివాయి
కో అంటే అవి కో అంటాయి.....కో అంటాయి
ఆ: హృదయాలుండి కదిలాయంటే
చదువులు చదవకే వస్తాయి...బదులిస్తాయి
అ: ఆ చదువే నేనింకా చదవాలి
ఆ చదువే నీ నుంచి రావాలి ||నా మాటే||
ఆ: ఆహా....ఆహా....హా....హా....
అ: ఓహో....ఓహో....హో...హో...

## చిత్రం : సంబరాల రాంబాబు

రచన: రాజశ్రీ సంగీతం: వి.కుమార్ గానం: ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం

జీవితమంటే అంతులేని ఒక పోరాటం
బ్రతుకు తెరువుకై పెనుగులాడుటే ఆరాటం
కృషి చేశావంటే ఎదురీదావంటే
సాధించేవు, గెలిచేవు, నీదే జయం...
పాపను కడుపున మోసేతల్లికి పదిమాసాలూ పోరాటం
పుట్టిన పాపకు నడిచేవరకూ తప్పటడుగులే పోరాటం
కుటుంబ భారం మోసేతండ్రికి సంసారం ఒక పోరాటం
విద్యార్థులకూ పరీక్ష వస్తే చిత్రమైన దా పోరాటం...పోరాటం ||జీవిత||
క్రొత్త జంటకూ మూడు రాత్రులూ తనివితీరని ఆరాటం
ఆ తరువాతే మొదలవుతుందీ అహోరాత్రులూ పోరాటం
లెక్కకు మించిన పిల్లల కంటూ పోషించుటయే పోరాటం
డాబులు కొడుతూ ఓటును కొంటూ డబ్బుదోచుటే పోరాటం...పోరాటం ||జీవిత||
న్యాయానికి అన్యాయానికి అనుక్షణం ఒక పోరాటం
మంచి చెడులకూ నిజానిజాలకు యుగయుగాలుగా పోరాటం
ఇరుగూ పొరుగుల క్షేమం కోరని కాపురాల కథ పోరాటం
హృదయంలేని మనుషుల మధ్య కలిసిబ్రతికేడం పోరాటం...పోరాటం ||జీవిత||



## జాతి వివక్షపై గళమెత్తిన యాంగ్రీ సింగర్

# ఎమినెమ్

**జాతి వివక్ష అనగానే నల్లవారి కష్టాలే గుర్తుకువస్తాయి సాధారణంగా. నల్లవారు ఎక్కువగా ఉండే ప్రాంతాల్లో తెల్లవారూ వివక్షకు గురవుతారు. అలా ఇబ్బందిపడిన ఎమినెమ్ తన పాటల ద్వారా నిరసించడమే కాక ఆ సబ్జెక్ట్‌పై తీసిన '8 మైల్'లో నటించాడు కూడా.**

అతని వివాదాస్పదమైన పాటలు సంప్రదాయవాదులకు ఆగ్రహం తెప్పించినా అతని ఆల్బమ్స్ లక్షల కొద్దీ కాపీలు అమ్ముడుపోయి యువతరాన్ని ఉర్రూతలూగించాయి. అతను పాడిన 'ద మార్షల్ మాథర్స్ ఎల్‌పి'(2000) గ్రామీ అవార్డులలో 'ఆల్బమ్ ఆఫ్ ది ఇయర్' అవార్డుకు నామినేట్ అయిన మొట్టమొదటి ర్యాప్ ఆల్బమ్. అతనే మార్షల్ బ్రూస్ మ్యాథర్స్ ఎలియాస్ ఎమినెమ్.




24 ఏళ్ళ ఎమినెమ్ పాటల్లో క్రోధం, ద్వేషంతో కూడిన భావాలే వినిపిస్తాయి. అతని నిజ జీవితంలోని ప్రేమ రాహిత్యం, జాతి వివక్ష అతని పాటల్లో కనిపిస్తాయి.

- ఎమినెమ్ తల్లి డెబీ మ్యాథర్స్‌కు పదిహేనవ ఏట పెళ్ళయింది.
- రెండేళ్ళ తర్వాత సెయింట్ జోసెఫ్, మిసోరీలో ఎమినెమ్ పుట్టాడు.
- తల్లిదండ్రులు విడిపోయిన తర్వాత కొన్నేళ్ళకు ఎమినెమ్ తల్లితో పాటు డెట్రాయిట్‌లో స్థిరపడ్డాడు.
- నల్లజాతి వారు ఎక్కువ నివసించే చోట తల్లి, ఇద్దరు పిల్లలు (మరొకరి ద్వారా కలిగిన ఎమినెమ్ తమ్ముడు) ఉండేవారు. నల్లజాతి కుర్రవాళ్ళు ఎమినెమ్‌ను హింసించేవారు. జాతి వివక్ష అంటే ఏమిటో తెలిసిందతనికి.
- తొమ్మిదవ తరగతిలో మూడుసార్లు తప్పిన తర్వాత చదువుకు స్వస్తి చెప్పి ర్యాపర్‌గా స్థిరపడాలని ప్రయత్నాలు ప్రారంభించాడు.
- ఎమినెమ్ తొమ్మిదవ ఏట విన్న తొలి ర్యాప్‌పాట 'రెక్‌లెస్' గాయకుడు ఐస్-టి మరియు మరో ర్యాప్ గాయకుడు ఎల్‌ఎల్ కూల్‌జెల పాటలను అభిమానించి వాటి నుంచి ప్రేరణ పొందాడు.
- తన తోటి ఎమ్సీ ప్రూఫ్, మరో నలుగురు ర్యాపర్స్‌తో 'డర్టీ డజన్' అనే గ్రూపు ఏర్పాటు చేశారు.
- ఎమినెమ్ డెబ్యూ ఆల్బమ్ 'ఇన్‌ఫినైట్' 1995లో విడుదలయింది.
- నల్లజాతి వాళ్ళు ఎక్కువగా పాడే ర్యాప్ మ్యూజిక్‌లో తెల్లవాడైన ఎమినెమ్ పాడటం చూసి చాలామంది అతన్ని 'ర్యాప్ ఎందుకు, రాక్ అండ్ రోల్ పాడొచ్చు కదా' అనేవారు.
- అలాంటి మాటలు అతనికి ఆగ్రహం కలిగించేవి. పరిస్థితులకు ఎదురీదుతూ తన జీవన పోరాటం సాగించాడు.
- 'స్లిమ్ షేడీ' అనే పేరుతో రైమ్ అయ్యే పదాలతో, ప్రతీకార ధోరణితో పాటలు రాయడం ప్రారంభిం చాడు. ఈ విధంగా తనను బాధపెట్టిన ప్రపంచంపై కసి వెళ్ళగక్కాడు.
- 1997లో ఎమినెమ్ ఎనిమిది పాటలతో 'స్లిమ్ షేడీ ఇపి' అనే డెమో రికార్డ్ చేశాడు.
- ఇంటర్‌స్కోప్ రికార్డ్స్ వారు ఆ డెమోను ప్రసిద్ధ ర్యాపర్ డాక్టర్ డ్రేకు వినిపించగా ఆయన వెంటనే ఎమినెమ్‌ని పిలిపించి అతని భవిష్యత్తుకు బంగారు బాట వేశారు.
- అతని ప్రేయసి కిమ్, వారి కూతురు హెయిలీ అతని జీవితంలో అతి ముఖ్యమైనవారు. ఎమినెమ్ సాధించిన మరో విజయం అతను ఇటీవల నటించిన '8మైల్' చిత్రం. అతని స్వీయ చరిత్ర ఆధారంగా తీసిన ఈ చిత్రం పెద్ద హిట్ అయింది. ఈ చిత్రం విశేషాలు:
- గత సంవత్సరం ఉత్తమ చిత్రంగా ఆస్కార్ అవార్డు అందుకున్న 'ఎ బ్యూటిఫుల్ మైండ్' చిత్రాన్ని నిర్మించిన బ్రయన్ గ్రేజర్ ఈ చిత్రాన్ని నిర్మించారు.
- 'ఎల్.ఎ.కాన్ఫిడెన్షియల్', 'వండర్ బాయ్స్' చిత్రాలకు దర్శకత్వం వహించి అవార్డులందుకున్న కర్టిస్ హాన్సన్ ఈ చిత్రానికి దర్శకుడు.
- 'ఎల్.ఎ.కాన్ఫిడెన్షియల్' చిత్రంలో నటనకు ఉత్తమ సహాయ నటిగా ఆస్కార్ అవార్డు అందుకున్న కిమ్ బేసింగర్ ఈ చిత్రంలో ఎమినెమ్ తల్లిగా నటించింది.
- '8 మైల్' అనేది డెట్రాయిట్ నగరంలో నల్లజాతి వారుండే చోటును, తెల్లజాతి వారుండే చోటను విడదీసినట్టుండే రోడ్డు పేరు. ఈ చిత్రంలో ఎమినెమ్ నిక్‌నేమ్ ర్యాబిట్.
- ఇటీవలి కాలంలో సంగీత రంగం నుంచి చిత్ర రంగంలోకి వచ్చిన స్పైస్ గరల్స్, బ్రిటీ స్పియర్స్ సాధించలేని విజయాన్ని ఎమినెమ్ సాధించాడు.
- ఈ చిత్రంలో ఎమినెమ్ పాడిన 'లూజ్ యువర్ సెల్ఫ్' పాటకు ఉత్తమ ఒరిజనల్ సాంగ్ అస్కార్ నామినేషన్ లభించింది.
- సంగీత రంగంలోనూ, చిత్ర రంగంలోనూ ఎమి నెమ్ సాధించిన విజయాన్ని చూసి విమర్శకులు అతన్ని ఈ తరానికి చెందిన ఎల్విస్ ప్రెస్లీగా వర్ణి స్తున్నారు.



**-పి.వి.సత్యనారాయణరాజు**

**అలనాటి ఆణిముత్యాల గురించి**
**నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే**

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల




## అంకెలతో పద్యాలాట

అంకెలతో సాహిత్యానికి చాలా అనుబంధం ఉంది. జ్ఞానానికి సంఖ్య (అంకె) ఆధారం. పరీక్షల్లో వచ్చే మార్కుల్ని అంకెలతోనే తెలియజేస్తాం. ఈ మహాసృష్టిని కూడా అంకెల ఆధారంతోనే గుర్తిస్తాం. అంకెకి ప్రత్యేక అస్తిత్వమంటూలేదు. వస్తువు మీద గాని అది తెలియబడదు. లోక దృష్టిలో 10 పూర్ణ సంఖ్య అయినా విజ్ఞాన దృష్టితో 9 పూర్ణ సంఖ్య. 9, 99, 999 మొదలైన క్రమంలో సంఖ్యా విరామం 9తో అవుతుంది. బిందువు (0) ఆధారంగా 1,2 అంకెలుంచుతూ పోతే 9తో సమాప్తమై బిందువు ముందుకు వచ్చి 10 అవుతుంది. ఎంత ప్రస్తరించినా యింతే కాబట్టి 9 నూతన భావమొందటం చేత దీన్ని 'నవ' అన్నారు. 9 నెలా ప్రస్తరించినా 9 వస్తువుంది. నవీనత, పూర్ణత దీని ప్రత్యేకత. కవులు తమ రచనల్లో అంకెలతో చాలా ఆటలాడుకున్నారు. వాటిలో కొన్ని చమత్కార పద్యాలు మీకు పరిచయం చేస్తాను. అసలు పేర్లలోనే వున్న అంకెల్ని గుర్తించారా? ఏకామ్రనాధుడు, ద్వైమాతురుడు, త్రివిక్రముడు, చతుర్ముఖుడు, పాంచాలి, షణ్ముఖుడు, సప్తాశ్వుడు, అష్టావక్రుడు, నవనాథుడు, దశరథుడు - ఇలా ఎన్నో వున్నాయి.

ఆఢ్యుడంటే గొప్పవాడు. గొప్పవాడే లెక్కలో మనిషంటూ ఓ కవి-

**ఆఢ్యుడున్న యప్పు డందరు పూజ్యులే**
**లెక్క మీద సున్న లెక్కినట్లు**
**అతడు పోవు వెనుక నంద రపూజ్యులే**
**లెక్కలేక సున్న లేగినట్లు!!**

అని చమత్కరించాడు. సున్నాకి ఏదైనా అంకెతో కూడి వున్నప్పుడు తప్ప ప్రత్యేకంగా విలువ లేదు కదా! అలాగే గొప్పవాడితో జనాలన్నాడు.

మరోకవి హనుమత్సందేశాన్ని అంకెల్లో దాచి ఎంత గంభీరంగా చెప్పాడో చూడండి.

**అంచిత చతుర్థ జాతుడు**
**పంచమ మార్గమున నేగి ప్రథమ తనూజన్**
**గాంచి తృతీయం బక్కడ**
**నుంచి ద్వితీయంబుదాటి యొప్పుగ వచ్చెన్!!**

ఈ పద్యాన్ని పంచభూతాలతో అన్వయించి చెప్పుకోవాలి.

1. భూమి 2. నీరు 3. అగ్ని 4. వాయువు 5. ఆకాశాలు పంచభూతాలు. ఇప్పుడు చూడండి. చతుర్థజాతుడంటే వాయునందనుడు ఆంజనేయుడు, పంచమ మార్గమున నేగి అంటే ఆకాశ మార్గాన వెళ్లి, ప్రథమ తనూజన్ గాంచి అంటే భూపుత్రి అయిన సీతను చూచి, తృతీయం బచ్చట నుంచి అంటే అగ్నితో లంకా దహనం చేసి, ద్వితీయంబు దాటి వచ్చెన్ అంటే సముద్ర జలాన్ని దాటి వచ్చాడని అర్థం.

గద్వాల సోమరాజుని పొగుడుతూ ఓ కవి 'నలుగురు బలికిరి' అంటూ పద్యమెత్తుకుని ఎంత గమ్మత్తు చేశాడో చూడండి.

**నలుగురు బలికిరి సరియని**
**నలుగురు బలి కిరి సురూప నయ దాన ధరా**
**వలయ ధురా చరణోన్నతి**
**పొలుపుగ గద్వాల సోమ భూపాలు నకున్!!**

గద్వాల రాజు (సురూప) అందంలో నలుడు, (నయ) బుద్ధిలో గురుడు అంటే బృహస్పతి, దానంలో 'బలి' చక్రవర్తి, ధరావలయాన్ని (భూమిని) మోయటంలో (కిరి) వరహావతారంగా సరియని అంటే ఒప్పుకొని నలు-గురు-బలి-కిరి ట!

**మరోకవి వేయిపడగల ఆదిశేషుడు పదునైదు పదునైదు**
**నిరువదైదు నూట యిరువదైదు**
**నెలమి మూడు నూరు లిన్నూరు మున్నూరు**
**తలల వాడు మిమ్ము ధన్యు జేయు!!**

ఈ భావాని కింత లెక్కెందుకో అర్థం కాదు. ఇలాంటి వాళ్లని దృష్టిలో పెట్టుకునే కాబోలు వొళ్లుమండి ఆడిదం సూరకవి -

**దేవునాన మున్ను దేశాన కొకరుండు**
**ఇప్పుడూర నూర నింట నింట**
**నేడ్వు రార్వు రేడ్వు రెనమండ్రు తొమ్మండ్రు**
**పదువు రైరి కవులు పద్మనాభ!!**

అని దేవుడి దగ్గర మొర పెట్టుకున్నాడు. అవును. ఇదివరకు దేశాని కొకడైతే

యిప్పుడింటికి పదిమంది కవులయ్యారు. ఆలోచించ వలసిందే!

**జగములు వణంకు నొకతెకు**

**అగణితముగ నిద్దరైన నంబుధు లింకున్**

**ముగురాడు వారు గూడిన**

**సుగుణాకర! పట్ట పగలె చుక్కలు పొడుచున్!!**

అని ఒక కవి ఆడదాన్ని చూసి హడలెత్తిపోతే మరో కవి ఆమె ముఖం మీదే లెక్క వేసుకుని-

**అనువై నెన్నుదు రొంటు గా౯ బదునొకండై బొమల్ జంటగా**

**ఘనతం బొల్పగ రెండు తొమ్ముదులునై కర్ణద్వయం బొప్పగా**

**గన పూర్ణస్థితి బర్వులీల నెసగంగా నింతయుంగూడ దా**

**దిన సంఖ్యం దిలకింప నిందు నెలగా దీపించు మో మింతికిన్!!**

అంటూ సంబరపడిపోయాడు. ఆమె నుదురు ఒకటిలా, కనుబొమలు పదకొండులా, చెవులు రెండు తొమ్మిదుల్లా వుండి 1+11+18=30 అయి పూర్ణిమ నాటి చంద్రునిలా ముఖం ప్రకాశిస్తూవుందని ఆయన గారి వెర్రి సంబరం. ఆమె ముఖాన్ని తెలుగు అంకెల్లో చూస్తేనే గానీ అర్థంకాదు. చూడండి.

ఇంగ్లీషు అంకెలు 1 2 3 4 5 6 7 8 9 10

తెలుగు అంకెలు ౧ ౨ ౩ ౪ ౫ ౬ ౭ ౮ ౯ ౧౦

ఆమె నుదురు౧, కనుబొమలు ౧౧, చెవులు ౧౮లా ఉన్నాయట!

ఇక కవి కస్తూరి రంగనాథునికి ఎటువంటి కన్యని చూసి వివాహం చేసుకోమంటున్నాడో చూడండి.

**కన్యకునైదు జంఘలును కన్యకు నేడు విశాల నేత్రముల్**

**కన్యకు నాల్గు కన్బొమలు కన్యకు నారు కుచద్వయంబులున్**

**కన్యకు ద్వాదశంబరయగా వర మధ్యము గల్గినట్టి యా**

**కన్యకు నీకునుం బదియు గావలె కస్తూరి రంగ నాయకా!!**

ఈ పద్యం ఖగోళశాస్త్ర పరిజ్ఞానంతో అర్థం చేసుకోవాలి. ఖగోళంలో 12 రాశులున్నాయి. 1. మేషం 2. వృషభం 3. మిథునం 4. కర్కాటకం 5.సింహం 6. కన్య 7. తుల 8. వృశ్చికం 9. ధనస్సు 10. మకరం 11. కుంభం 12. మీనం. ఇప్పుడు 'కన్య' రాశి నుండి మొదలుపెడితే ఐదో రాశి మకరం (మొసలి వంటి పిక్కలు), ఏడో రాశి మీనం (చేపల్లాంటి కళ్లు), నాలుగో రాశి ధనస్సు (విల్లువంటి కనుబొమలు), ఆరో రాశి కుంభం (కుంభాల వంటి కుచాలు), పన్నెండో రాశి సింహం (నడుము), పదోరాశి మిథునం (జంట), ఆ కన్య నీకు జంట కావాలని కోరిక. ఆ కోరిక నిలా 'రాశి' పోశాడీ కవి.

ముష్టి చెంబు కొనిపెట్టమని అడిగిన తిరుపతి కవులు తమ 'శ్రవణానందం' కావ్యంలో ఒక స్త్రీకి ఎంత విలువ కట్టారో ఈ పద్యం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. చూడండి : ఈ పద్యంలో వరాలు అంటే వరహాలు అంటే వరాహ ముద్రగల బంగారు నాణేలని అర్థం. ఇప్పుడు చూడండి.

**పలుకొక్కటియె సేయు పదివందల వరాలు**

**వాలు చూపులు రెండు వేలు సేయు**

**నగవొక్కటియెసేయు నాల్గువేల వరాలు**

**విర్రవీగుట లారువేలు సేయు**

**పదమొక్కటియె సేయు పదివేల వరహాలు**

**లావణ్యమది యొక లక్ష సేయు**

**బలుసోయగమె సేయు పది లక్షల వరాలు**

**కులుకు నడక తీరు కోటి సేయు**

**ముద్దు గుల్కెడు నెమ్మోము మూడుకోట్లు**

**నాస సొబగెన్న డెబ్బది నాల్గు కోట్లు**

**నుదుటి సిందూర నామమ్ము నూరు కోట్లు**

**నీకు వెల జెప్ప శక్యమే నీలవేణి!!**

కొనేవారుంటే ఎంత వెలపెట్టినా వస్తువుకి గిట్టుబాటే గదా! "రమ్మంటే చాలు గాని రాజ్యాలు విడిచి రానా?'' అన్నారు దాశరథి, ఆయనకేవో రాజ్యాలున్నట్టు! కవులంతే! అలాగే వుంటారు. అలాగే అంటూవుంటారు.

సంస్కృతంలో సంఖ్యాశాస్త్ర విజ్ఞానం పారం ముట్టింది. ఆ శాస్త్ర అధ్యయనంతో ఎన్నెన్నో నిగూఢ విషయాలు బోధపడతాయి. సంఖ్యాగత శ్లోకాలు కొన్ని చూడండి :

శ్రీరాముడు 11 వేల సంవత్సరాలు రాజ్యమేలాడని రామాయణం యుద్ధ కాండలోని యీ శ్లోకం వల్ల తెలుస్తుంది.

**దశ వర్ష సహస్రాణి - దశ వర్ష శతాని చ**

**భ్రాతృభి స్సహిత: శ్రీమాన్ రామో రాజ్యమకారయత్!!**

([10x1000=10,000] + [10x100=1000] = 11,000 వేలు)

ఇది దేవమానంలో చెప్పిన లెక్క. ఆ మానంలో చెప్పిన లెక్కలకి వేరే అర్థాలుంటాయని గుర్తించాలి.

**లాల యేత్ పంచవర్షాణి - దశ వర్షాణి తాడయేత్**

**ప్రాప్తేతు షోడశే వర్షే - పుత్రం మిత్రవ దాచరేత్!!**

కొడుకుని ఐదేళ్ళ వరకు బుజ్జగించాలి. పదేళ్ల వరకు కొట్టి బుద్ధి చెప్పాలి. పదహారో ఏటి నుండి స్నేహితునిలా చూడాలని పై శ్లోకం చెప్తూ వుంది. అతి గారాబం వల్ల పిల్లలు చెడిపోతారని తల్లిదండ్రులు గ్రహించటం మంచిది. ఎందుకంటె పుట్టినవాడు శూరుడో, పండితుడో, మహా వక్తో, దాతో, కావాలి గానీ పరమ శుంఠ కాకూడదు గదా! అది కూడా దుర్లభమంటూ -

**శతేషు జాయతే శూర:**

**సహస్రేషు చ పండిత:**

**వక్తా దశ సహస్రేషు**

**దాతా భవతి వా నవా!!**

అనే శ్లోకం తెలియజేస్తూవుంది. అంటే వందమందిలో ఒక శూరుడు, వేయి మందిలో ఒక పండితుడు, పదివేల మందిలో ఒక మహావక్త పుడతారేమో గానీ దాత అనే వాడుంటాడో వుండడో అని అర్థం. అటువంటి కోవకు, స్థాయికి చెంది వుండాలంటే మనిషికి చాలా నియమాలు కావాలి. ఈ శ్లోకం చూడండి :

**శత విహాయ భోక్తవ్యం - సహస్రం స్నాన మాచరేత్**

**లక్షం విహాయ దాతవ్యం - కోటిం త్యక్త్వా హరిం భజేత్!!**

వంద పనులు విడిచిపెట్టయినా వేళకు భోజనం చెయ్యాలి. వేయి పనులు విడిచి స్నానం చెయ్యాలి, లక్ష పనులు విడిచి దానం చెయ్యాలి, కోటి పనులు విడిచి దైవ ప్రార్థన చెయ్యాలని శ్లోకార్థం. అటువంటి సంఖ్యా శ్లోకాలు సంస్కృత సాహిత్యంలో వందల్లో, వేలలో కనిపిస్తాయి. భావనాబలాన్ని బట్టి సంఖ్యకు విలువ పెరుగుతుంది. భావన అంటే తెలుగులో భావ కవిత్వం గుర్తొస్తూ వుంది. దాన్ని అభావ కవిత్వంగా జమకట్టి, హేళన చేస్తూ అనంత పంతుల రామలింగస్వామిగారు -

**రెండు కాకులు కూర్చుంటె బండ మీద**

**నొండెగిరి పోయె నంత నందొండు మిగిలె**

**రెండవది పోయె పిదప నందొండు లేదు**

**బండ మాత్రము పాప మందుండి పోయె!!**

అనే పద్యం చెప్పారు. ఈ హేళనలోంచి కూడా వేదాంతపరమైన అర్థాన్ని బయటకు తీసి భావకవిత్వానికి ఏదో ఒక అర్థం వుంటుందని కొంతమంది ప్రబుద్ధులు రుజువు చేశారు. ఇందులో జీవాత్మ, పరమాత్మలు రెండు కాకులట. బండ - శరీరంట! జీవాత్మ ఎగిరి పరమాత్మలో కలియగానే బండలాంటి శరీరం మాత్రం మిగిలిపోయిందట! అంతే మరి. ఎలాగైనా అర్థం చేసుకోవచ్చు. వాది దౌర్బల్యమే గాని వాదానికి దౌర్బల్యమేమిటి చెప్పండి? ఎలాగైనా సమర్థించవచ్చు.

తెలుగు మాష్టారొక కుర్రాణ్ణి "సున్నాని ఉభయాక్షరమని యెందుకంటారురా?" అని అడిగితేవాడు తన ప్రోగ్రెసు కార్డు చూసుకుని తడుముకోకుండా- "అది తెలుగులోను, లెక్కల్లోనూ వస్తుంది గనుక" అన్నాడట.

ఆ కుర్రాడి నాన్న "పరీక్ష పేపరెలా వుందిరా? మార్కులెలా వస్తా"యని లెక్కల పేపరు నాడు అడిగితేవాడు - "పేపరు దీర్ఘ చతురస్రంలో వుంది. మార్కులు వృత్తాకారంలో రావచ్చు"నని చెప్పాడట!

దీన్నిబట్టి లోక జ్ఞానాన్ని అంకెల్లో బొమ్మా-బొరుసులుగా చూడవచ్చునని గ్రహించటం బుద్ధిమంతుల లక్షణం!

కామెడీ స్కిట్

# ఒరేయ్... నువ్వు నాకు నచ్చావురా...!

- రాజా



ఫోన్ మోగుతుంది ఆమె వచ్చి ఫోన్ ఎత్తుతుంది.

అతడు : హలో...

ఆమె : హలో...ఎవరండీ...

అతడు : అది కృష్ణవేణిగారిల్లేనా అండీ...?

ఆమె : ఇది కృష్ణవేణిగారి ఫోనేండి...

అతడు : ఆ!...అహహహ....కరక్టే అనుకోండి. ఇంతకీ ఆ ఫోను ఉన్నది కృష్ణవేణిగారి ఇంట్లోనే నా అండీ....

ఆమె : కృష్ణవేణిగారి ఫోను కృష్ణవేణిగారింట్లో కాకుండా పక్కింట్లో ఉంటుందాండీ...అసలెందుకిలా అడుగుతున్నారు మీరు... టెలిఫోన్ కనక్షన్ తీసుకుని పక్కింటి వాళ్ళకు అమ్ముకునే టైప్ అనుకున్నారా మేము?

అతడు : (తనలో) అయ్య బాబోయ్...ఇదెక్కడి మనిషండి బాబూ. వాక్యం దొరికితేచాలు వాయించే స్తోంది.... ఖచ్చితంగా ఈవిడ ఆవిడే...

కృష్ణవేణి చెల్లెలే...

ఆమె : హలో...ఇంతకీ ఎవరండీ మీరు?

అతడు : నేనాండి...నేను...అనంత్‌నండీ...

ఆమె : ఈ అనంత విశ్వంలో 'అనంత్ నండీ' అంటే ఫట్‌మని గుర్తొచ్చేటంత ఫేమసా మీరు...కాస్త వివరంగా చెప్పండి టైమ్ వేస్ట్ చెయ్యకుండా...

అనంత్: (తనలో) ఓరి దేవుడో...(పైకి) ఏవండీ...మీరు, మీ అక్క కృష్ణవేణి గారు మీ కార్లో వెళుతుంటే టైర్ పంక్చరైతే...గుర్తొచ్చానండీ...

అమె : చూడండీ...మా కారు టైరు ఇప్పటికి కొన్ని వందలసార్లు పంక్చరైంది. ఎక్కడని గుర్తుపెట్టుకొంటాం ఎంత మందని గుర్తుపెట్టుకొంటాం-పంక్చరేసేవాళ్ళని!

అనంత్: ఆ!

ఆమె : అయినా మేం ఎవరికీ డబ్బులివ్వకుండా రాలేదు! ఇప్పటిదాకా...

అనంత్: ఏవండీ...టైర్లకి పంక్చరేసుకొనేవాళ్ళు ఇలా ఫోనులు చేస్తారటండీ... కాస్త నామాట వినిపించుకోండీ...ప్లీజ్...

ఆమె : చెప్పండి...

అనంత్: ఓసారి మీ కారుటైరు పంక్చరైతే, ఆ పక్కన ఎవరూ లేకపోతే నేను చూసి నా స్కూటర్‌మీద వెళ్ళి పంక్చరేసే వాణ్ణి ఒకణ్ణి తెచ్చాను...

ఆమె : ఆ...ఆ....గుర్తొస్తోంది లైట్ లైట్‌గా....

అనంత్: ఆ లైట్‌ని మరి కాసేపు వెలగనీయండి ప్లీజ్....

ఆమె : ఆ...ఇప్పుడు పూర్తిగా వెలిగిందిలెండి...గుర్తొచ్చింది చెప్పండి... ఏంకావాలి

అనంత్: ఉద్యోగం అండీ...

ఆమె : ఎవరికి

అనంత్: నాకే...

ఆమె : మీకా...? మీకు జాబ్ లేదా?

అనంత్: లేదండీ...వచ్చే అవకాశం ఎలా వస్తుందో కూడా తెలీడం లేదండీ అందుకనీ...

ఆమె : అవకాశం అనేది దానంతట అది రాదండీ అదొచ్చినప్పుడు మనమే దూకెయ్యాలి...

అనంత్: దూకొచ్చునుకోండి కానీ ఏది అవకాశమో ఏది అవకాశం కాదో ఎలా తెలుస్తుందండీ మనకి?

ఆమె : తెలీదండి...దూకుతూ ఉండటమే మన పని...

అనంత్: భలేవారే...అయితే ఎప్పుడూ దూకుతూ కూచోమంటారా

ఆమె : కూర్చొని దూకటం కష్టం అండీ నిలబడి దూకటమే బెటరు

అనంత్: అంతేనంటారా?

ఆమె : నిక్షేపంగా

అనంత్: అయితే వన్‌మినిట్ మేడమ్... వన్‌మినిట్

(ఆమెకు అర్థంకాక పట్టుకొని అలానే ఉండిపోతుంది. అనంత్ ఫోన్ పెట్టేసి ఎగురుతాడు కట్‌చేస్తే కృష్ణవేణి ఇంట్లో ఫోన్ పట్టుకుని ఉన్న ఆమె ముందు దబ్‌మని పడతాడు. ఆమె కెవ్వుమంటుంది.)

అనంత్: నేనండీ...అనంత్‌ని...

ఆమె : అయితే అయ్యారు....ఈ విచిత్రమైన ఎంట్రన్సేంటండీ?

అనంత్: మీరు చెప్పినట్టే చేశా కదండీ..!?

ఆమె : ఛంపారు పొండి...

అనంత్: నేను చంపను, పోను, జాబ్ చెయ్యటానికి మీరు నాకు అవకాశం ఇచ్చేదాకా మీరు చంపినా పోను...అంతే...మీరు నాకు సీరియస్‌గా ఛాన్స్ ఇచ్చి తీరాల్సిందే.

ఆమె : సీరియస్‌గా కాకుండా జోక్‌గా చాన్స్ ఇచ్చేవాళ్ళుంటారా?

అనంత్: ఎందుకుండరండి బాబూ...నా ఫ్రెండొకడు విశ్వనా-'థమ్' అని సినిమాలంటే విపరీతమైన ఇంట్రస్ట్...ఓ రోజేంజరిగిందంటే... వాళ్ళ వూరికి షూటింగ్ చేసుకోడానికి ఓ సినిమా యూనిట్ వచ్చింది. వీడు వెళ్ళి ఛాన్సు అడిగాడు. వాళ్ళు వీడిని ఆటపట్టించడానికి గుడ్డి వాడైన ఓ బిచ్చగాడు ఎలా అడుక్కుంటాడో చేసి చూపించమన్నారు. వాడు మా వూళ్ళో అంతమంది ముందు 'అమ్మా గుడ్డోణ్ణి తల్లే ధర్మం చెయ్యండి బాబూ' అని కళ్ళుమూసుకుని అడుక్కుంటూ ఉంటే వాళ్ళు చెప్పాచెయ్యకుండా వుడాయించారు. కళ్లు తెరిచి చూస్తే వాళ్ళంతా మాయం. వీడు అయోమయం. ఊరి జనం ఒకటే నవ్వులు. అదిగో అప్పట్నించి అవకాశం కోసం ఎవర్నైనా అడగడం అంటే భయం....అలా ఆటపట్టిస్తారేమోనని...

ఆమె : ఛా ఛా...నేను ఆ టైపు కాదులెండి....

అనంత్: నాకు తెలుసు మీరు టైపు షార్ట్ హాండ్‌లాంటి వారు కారని కంప్యూటర్ లాంటి వారని.... అందుకే అడుగుతున్నా ప్లీజ్...

ఆమె : మిమ్మల్ని రికమెండ్ చెయ్యొచ్చునుకోండి...కానీ...బొత్తిగా... చాలా...ఇన్నోసెంట్‌గా ఉన్నారు కదా...ఎలాగా అని...

అనంత్: ఇన్నోసెంటా...అదేంసెంటండీ...ఇంపోర్టెడా

ఆమె : అదిగో అంత అమాయకంగా ఉన్నారు కనుకనే రికమెండ్ చెయ్యడానికి భయం వేస్తోంది నాకు

అనంత్: అదేంటండీ అలా అంటారు...అమాయకంగా ఉన్నవారు ఉద్యోగాలకు పనికిరారా...అసలు వాళ్ళేనండి సిన్సియర్‌గా ఉండేది

ఆమె : సరేనండీ...! కాకపోతే నాదో చిన్న సందేహం

సాంగురే బంగారు రాజా...




అనంత్: అడగండి...

ఆమె : మిమ్మల్ని చూస్తుంటే సినిమాలో యాక్ట్‌చెయ్యడానికి రెడీగా ఉన్న టి.వీ. ఆర్టిస్ట్‌లా స్టయిల్‌గా ఉన్నారుకదా...

అనంత్: అంటే?

ఆమె : చిన్న చిన్న జాబ్స్ చేస్తారా అని?

అనంత్: ఇంకానయం 'నిన్ను చూస్తుంటే సినిమాకి తక్కువా టి.వీ.కి ఎక్కువా' అని అన్నారు కాదు... స్టయిల్‌గా ఉన్నవాళ్లు కష్టపడి పనిచెయ్యలేరనా మీ అభిప్రాయం...?

ఆమె : అదికాదండీ...ఈ వీధి చివర్న ఉండే సూపర్‌బజార్‌లో ఓ అబ్బాయి ఉన్నాడు

అనంత్: తెలుసండీ...అద్భుతమైన సేల్స్‌మాన్...బట్టతల ఉన్నవాళ్ల చేత హెయిర్ ఆయిల్, షాంపూ బాటిల్స్‌ని, దువ్వెనలని కొనిపించ గల సమర్థుడు....

ఆమె : మీరు చూశారా!?

అనంత్: అవునండి మీరు నమ్మండి నమ్మకపోండి నేను కళ్లారా చూసిందే చెప్తానండి... ఇంతకీ మీరు అతని గురించి ఎందుకు చెప్తున్నారు.

ఆమె : యాక్చుయల్‌గా అతన్ని ఆ ఉద్యోగానికి పంపింది నేనండి. ఇంటర్వ్యూ అదీ అరేంజ్ చేస్తే దానికి అటెండ్ కాకుండా ట్రిక్స్‌ప్లే చేసి సంపాదించాడు ఆ ఉద్యోగం

అనంత్: ట్రిక్సా

ఆమె : అవునండి...సమ్ హౌ నాకెందుకో అది నచ్చలేదు. అప్పట్నించి ఉద్యోగాలకు రికమెండ్ చెయ్యడం మానుకున్నాను.

అనంత్: మీరు చెప్పిన ఫ్లాష్ బ్యాక్‌కి మరికొంచెం బ్యాక్‌కి వెళితే - అతనిలో 'ఎలాంటి ఉద్యోగమైనా చేసితీరాలి' అనే ఫ్లాష్‌ని వెలిగించిందే మా బ్రదరండి.

ఆమె : మీ బ్రదరా

అనంత్: అవునండి...మీరు చెప్పేరే ఆ సేల్స్‌మాన్ అతని బాగా చదువుకున్న మనిషే. కానీ ఏదో భ్రమలో ఉండేవాడు- 'ఈ పని ఎక్కువ ఆ పని తక్కువ' అని. 'అదేంకాదు కష్టపడి చేసేపని ఏదైనా ఒక్కటే' అని అతనికి బోధించిందే మా బ్రదర్

ఆమె : మీ బ్రదర్ చదువుకున్నారా? ఏం చేస్తుంటారు?

అనంత్: అతణ్ణి మించి చదువుకున్నాడు. అయినా ఏ మాత్రం మొహమాట పడకుండా రిక్షా లాక్కుని బ్రతుకుతున్నాడు.

ఆమె : ఎవరి దగ్గర్నించి లాక్కొని...?అయినా లాక్కోవటం ఎందుకు... కొనుక్కోవచ్చుగా...?

అనంత్: అమ్మబాబోయ్...ఇంత సీరియస్‌గా చెప్తుంటే మధ్యలో జోకులేస్తారేంటండీ...

ఆమె : నాకు మొత్తం అర్థం అయింది...సో...మీరు ఏ జాబైనా సరే చేస్తానంటారు.

అనంత్: కరెక్ట్...ఆఖరికి పెళ్ళికొడుకుల్ని తీసుకువచ్చే జాబ్ అయినా సరే...

ఆమె : అదేంటీ

అనంత్: అది తర్వాత చెప్తానండి...ముందు నన్ను పూర్తిగా చెప్పనివ్వండి... నేను మీ అక్కయ్య కృష్ణవేణిగార్ని పెళ్ళి చేసుకుందాం

అనుకున్నాను. అదే విషయం మీ అక్కయ్యగార్ని అడిగితే 'మా చెల్లెల్ని అడగండి తను ఒప్పుకుంటే మన పెళ్ళి అయిపోయినట్టే లేకపోతే మా చెల్లెలు పెళ్ళయ్యాకే మన పెళ్ళి' అని అన్నారు... అంచేత...

ఆమె : ఓహో అదా సంగతి...ఇంతకీ మా అక్క మీకు ముందర్నుంచీ తెలుసా

అనంత్: లేదండీ...ఆరోజు పంక్చరేయించానే ఆరోజే ఫస్ట్ టైమ్ చూడ్డం.

ఆమె : మరి నన్ను కూడా ఆరోజే కదా ఫస్ట్ టైమ్ చూశారు

అనంత్: అవును

ఆమె : మరి నన్నెందుకు పెళ్ళిచేసుకోవాలనిపించలేదు మీకు...

అనంత్: అయ్‌బాబోయ్

ఆమె : ఏం ఆ పాటి అందంగా లేనా నేను?

అనంత్: అయ్యయ్యెయ్యొయ్యో...మీరు అందంగా లేకపోవటం ఏంటండీ... ప్రపంచ సుందరీమణిగా పోటీ చేసుంటే ఈ పాటికి ఐశ్వర్యరాయ్ అయిస్‌క్రీమ్‌లు అమ్ముకుంటూ, సుస్మితాసేన్ సున్నుండలు చేసుకుంటూ బ్రతికేవారు

ఆమె : మరి నన్ను పెళ్ళిచేసుకోవచ్చుగా

అనంత్: చేసుకోవచ్చునకోండి...కానీ మీకు నేను తగనేమోనని...

ఆమె : అందుకని తగుదునమ్మా అంటూ పోయి మా అక్కని అడిగారు అవునా...

అనంత్: యక్జాక్ట్‌గా అంతేనండి

ఆమె : అందుకని ఆవిడలా చెప్పగానే చేసుకోబోయే లవర్ చెల్లెలికి సంబంధాలు వెతకడానికి బయల్దేరారు అంతేనా

అనంత్: అంతేనండి

ఆమె : ఇది చెప్పండి...మా అక్కకి మీరు నచ్చారా

అనంత్: అందులో సందేహంలేదండి నూటికినూరు పాళ్లు నచ్చా

ఆమె : అయితే నా అభిప్రాయం చెప్తున్నా వినండి నాకూ మీరు నచ్చారు

అనంత్: అయ్యబాబోయ్...ఇందేంటండీ

ఆమె : అలా ఆశ్చర్యపోతారేంటండీ...!? 'ఒరేయ్ నువ్వు నాకు నచ్చావురా' అంటూ నేను పాటందుకున్నంత లెవెల్లో ఇచ్చారు ఎక్స్‌ప్రెషను...

అనంత్: అలాగనక మీరు సాంగేసుకుంటే ఈ పాటికి నేను ఢామ్మని వడిపోయివుండే వాణ్ణండీ... పెట్రోలు రేట్లు పదిహేనురోజులకోసారి పెంచేస్తున్నంత కూల్‌గా చెప్పారు కాబట్టి ఈ మాత్రమైనా తట్టుకోగలిగాను. నిజం చెప్పండి... 'ఒరేయ్ నువ్వు నాకు నచ్చావ్‌రా' అంటూ మీరు నాతో డ్యూయెటేసుకున్నంత లెవెలా నాది!?

ఆమె : అవునండి...నిజంగా మీరు నాకు నచ్చారు..మీరు గనుక 'ఊఁ' అంటే మనిద్దరం పెళ్ళిచేసుకుందాం అప్పుడు మనిద్దరం కలిసి మా అక్కకి సంబంధం వెతకొచ్చు మీరు కనక 'ఊఁ' అనకపోతే నేను 'నో' అంటాను. అప్పుడు ఎవ్వరికీ పెళ్ళికాదు. ముగ్గురం 'అల్లరిప్రియుడు' సినిమాలోలా తలో వైపు నుంచి - "ప్రణయమా నీ పేరేమిటి ప్రణయమా" అంటూ పాడుకోవాలి




ఆ పైన మీ ఇష్టం...ఆలోచించుకోండి...

అనంత్: ఊఁ...ఆలోచించగా... చించగా...చించగా...'ఊఁ' అనడమే అన్నివిధాలా బెటరని పిస్తోంది...అంచేత...ఊఁ...

ఆమె : హమ్మయ్య... ఒప్పుకున్నారు కదా...ఉండండి...లోపలికెళ్ళి తాళి తెస్తా

అనంత్: ఇంతస్పీడా

ఆమె : మీదే అన్నారుగా నాది కంప్యూటర్ స్పీడని...ఇప్పుడు గనక పెళ్ళయిపోతే ఇంక ఎవ్వరూ దేనికీ.నో అనే ప్రసక్తి ఉండదు ఉండండి.

(లోపలికెళ్లి తాళి తెచ్చి ఇస్తుంది.)

అనంత్: (తాళి కట్టేస్తూ) ఏమిటో..... అందర్నీ పిలిచి పదిమంది ముందు తాళికడితే బావుంటుందేమో

ఆమె : నాకాపట్టింపు లేవీ లేవండి... నేననుకున్నది నాకు వెంటనే దక్కాలి. అయినా పదిమంది సాక్ష్యం లేకపోతే మీరునన్ను కాదంటారా నేను మిమ్మల్ని ఒదులుకుంటానా...ఒకసారి తాళిమెడలో పడ్డాక..అంతే...

అనంత్: అంతేకదా?

ఆమె : అంతే ఏమిటండీ ముమ్మాటికీ అంతే

అనంత్: అయితే అసలు విషయం చెప్తా... వినండి...సారీ విను... నేను ప్రేమించింది, పెళ్లాడుదాం అనుకున్నది నిన్నే...

ఆమె : నన్నా...మరి మా అక్కని ప్రేమించానన్నారు, మా అక్కకి కూడా మీరు నచ్చానని అన్నారు

అనంత్: చెప్తా...చెప్తా...నేన్నిన్ను ప్రేమించాక నీ గురించి ఎంక్వైరీ చేశాను. మీకు ఆస్తి ఉంది గానీ అండగా ఎవరూలేరని, మీ అక్కే నీకు పెద్ద దిక్కు అనీ తెలిసింది. అంచేత ఆవిణ్ణి వెళ్ళి అడిగాను.

ఆమె : అడిగితే?

అనంత్: దానికావిడ 'మా చెల్లెల్ని నువ్వు చేసుకుంటే నాకేం అభ్యంతరం లేదు కాకపోతే డైరెక్ట్‌గా వెళ్ళి అడిగితే మా చెల్లెలు ఒప్పుకోదు. పైగా రిజెక్ట్ చేస్తుంది కూడా' అని అంది. 'ఇప్పుడేంచెయ్యాలి' అన్నాను దానికి - 'నన్ను పెళ్ళిచేసుకుంటాను అను'... దెబ్బకి ఒప్పు కుంటుంది అని అంది.

ఆమె : అలా ఎందుకంది?

అనంత్: ఎందుకేమిటీ...చిన్నప్పుడు గౌన్ల దగ్గర్నుంచి ఇప్పటి చీరల వరకు నీ సైకాలజీ అంతేనట.... నీకుగా డైరెక్ట్‌గా ఏదీ నచ్చదట... కానీ మీ అక్క ఏది ముచ్చటపడితే అది నువ్వు బలవంతాన లాక్కుంటావట.

ఆమె : ఆఁ!?

అనంత్: ఆ! అందుకే ఇలా చెప్పమంది...చెప్పా...ఆవిడ అన్నట్టే జరిగింది...

ఆమె : అన్యాయం

అనంత్: అన్యాయం లేదు గిన్యాయం లేదు- నువ్వే అన్నావుగా ఒకసారి మూడుముళ్లు పడ్డాక అంతేనని...ఇకంతే...పద...వెళ్ళి మీ అక్కకి నమస్కారంపెట్టి ఆవిడకి సంబంధాలు వెదుకుదాం...పద...




పాటలోని నాదానికి సంగీత దర్శకుడు సృష్టికర్త అయితే గాయకుడు ఆవిష్కర్త. మనో గర్భంలో అంకురార్పణ జరిగి ఆ నాద బీజానికి ఊపిరి పోసి, జవసత్వాలతో నింపి సునాదంగా మార్చి బాహ్య ప్రపంచానికి పరిచయం చేసే గాయకుడు తల్లి అయితే కారకుడైన స్వరకర్త తండ్రి వంటి వాడని వేరే చెప్పనవసరం లేదు. తల్లీతండ్రీ తానే అయి బాధ్యత వహించిన తల్లి పెంపకంలో పెరిగిన సంతానం గణనీయమైన పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోవడానికి ఎంత అవకాశమున్నదో-తానే సంగీత దర్శకుడైన గాయకుని స్వర రచనలలో ప్రాణ ప్రతిష్ఠ వినూత్న చైతన్యంతో జరగటానికి కూడా అంతే అవకాశముంది. ఘంటసాల సంగీత దర్శకత్వంలో వచ్చిన




చిత్రంలోని పాటలు ఆ భావనకు తగిన బలాన్ని చేకూరుస్తూ నిరూపిస్తాయి. సముద్రాల రాఘవాచార్య మాటలు, పాటలు రచించగా 1957లో విడుదలయిన ఈ చిత్రాన్ని మినర్వా పిక్చర్స్ వారు నిర్మించారు. చక్కని అభిరుచికి మచ్చు తునకలుగా నిలిచే ఆ చిత్రంలో కొన్ని పాటలివి.

అతడు : అన్నానా... భామినీ..
ఆమె : ఏమని
అతడు : ఎపుడైనా... అన్నానా... భామినీ
ఆమె : ఏమని
అతడు : అరవిరిసిన పూలలోన
నీదు మురుపె మెరసేనని ॥అర విరిసిన॥
మాటవరకెపుడైనా ॥అన్నానా॥
ఆమె : అన్నానా... మోహనా
అతడు : ఏమని
ఆమె : తొలిచూపులనాడె నీవు
వలపుదోచుకొనినావని ॥తొలిచూపు॥
ఆదమరచి ఎపుడైనా ॥అన్నానా॥
అతడు : లోకానికి రాజునైన
నీ ప్రేమకు దాసుడనని ॥లోకానికి॥
మాటవరసకెపుడైనా ॥అన్నానా॥
ఆమె : నిన్నె నమ్ముకున్నానని
నీవె నా దైవమని ॥నిన్నెనమ్ము॥
ఆదమరచి ఎపుడైనా ॥అన్నానా॥
ఇద్దరూ : ఆ...ఆ...ఆ...



ఈ పాటను ఘంటసాల, పి.లీల గానం చేయగా ఎన్.టి.ఆర్., రాజసులోచన అభినయించారు. సాహిత్యపరంగా సముద్రాల సీనియర్ కొత్త పోకడలు పోయారీ గీతంలో. మనసులో అనుకున్నదంతా ఓ వైపు తెలియజేస్తూనే మరోవైపు 'ఆదమరచి ఎపుడైనా అన్నానా', 'మాట వరసకెపుడైనా అన్నానా' అని చిలిపిగా తప్పించుకుంటూ ఎదుటివారిని ఆటపట్టించుకోవడం వంటి ప్రక్రియ ప్రేమికుల మధ్య చాలా ఆకర్షణీయంగా, తమాషాగా

ఉంటుంది. ఆ స్పందనను సమతూకంతో అందించటంలో సముద్రాల-సీనియర్‌నని అనిపించుకున్నారు. సంగీత దర్శకునిగా ఘంటసాల ఈ పాటను స్వరపరిచిన తీరు ప్రత్యేకించి పేర్కొనదగినది.

1948లో మద్రాసు వచ్చి కచ్చేరీ ఇచ్చిన ఉత్తరాది విద్వాంసుడు బడే గులాం అలీఖాన్ ప్రభావం ఘంటసాలపై ఎంతగానో ఉందని 'చంద్రహారం' చిత్రంలోని 'ఇది నా చెలి' పాట విశ్లేషణలో ప్రస్తావించడం జరిగింది. బడేగులాం అలీఖాన్ ప్రేరణగా హిందుస్థానీ సంగీతం నుంచి తీసుకున్న రాగేశ్వరి రాగంతో ఘంటసాల ఎంతగా ప్రభావితులయ్యారో మరోసారి చెబుతుందీ 'అన్నానా భామిని' పాట. విరామాలు పాటలో వుంటే మనసుకి రిలీఫ్ ఎంత చక్కగా లభిస్తుందో తెలుసుకోవాలంటే ఈ పాటను వింటే చాలు. మాట వరసకెపుడైనా అన్నానా, ఆదమరచి ఎపుడైనా అన్నానా వాక్యాల వద్ద లయని పూర్తిగా ఆపేసి డైలాగ్ ఫార్మ్‌లో ఆ లైన్లని రాగయుక్తంగా పలికించటంలో రసోత్పత్తి ఎంతగా పండిందో అనుభవైకవేద్యమే తప్ప వర్ణించలేం. గాయకుడే సంగీత దర్శకుడైతే సమకూరే కొత్త అందాలవి. ఇక గాన మాధుర్యాన్ని అందించటంలో ఆ రెండు గళాలు అనర్గళాలే కదా...

**అడుగడుగో అల్లడుగో**
**అభినవ నారీ మన్మథుడు**
**అభినవ నారీ మన్మథుడు** ॥ఆడు॥
**మదిలో మెదిలే దేవుడే**
**కనిపించెను కన్నులకే** ॥మదిలో॥
**వ్రతము ఫలించే**
**బ్రతుకు తరించే** ॥వ్రతము॥
**వరుడరుదెంచెనుగా** ॥అడుగడుగో॥

**నీ... రూపురేఖ**
**నీ... నవ యవ్వన శోభా...**
**సఫలమయె శుభవేళ**
**సమకూరెనుగా...** ॥అడుగడుగో॥

**నీ చెలికానిని దోచుకునేనని**
**అలుగకుమా పావురమా...**
**నీ ఉపకృతికి బహుకృతిగా...**
**గైకొనుమా నా ప్రేమా...** ॥అడుగడుగో॥







'అడుగడుగో అల్లడుగో' పాటను భానుమతి పాడేరు, అభినయించారు అని వేరుగా చెప్పడం కన్నా 'ఇది భానుమతి పాట' అని అంటే నేరుగా ఆ భావం అందరికీ అందిపోతుంది. భీంప్లాస్ రాగంలో మలచబడ్డ ఈ పాట భానుమతి స్వరజీవితానికి మరో ప్లస్ అయింది. దగ్గరి గమకాలు ఆమె గొంతులో ఎంత హాయిగా పలుకుతాయో గ్రహించి సమయస్ఫూర్తితో... ఇంకా చెప్పాలంటే 'రసమయస్ఫూర్తితో... ఉపయోగించుకున్నారు ఘంటసాల. హిందూస్థానీ సంప్రదాయంలో గల సాకీల ప్రయోగంలా రెండవ, మూడవ చరణాలను మలచుకొని పాటకు కొత్త సొగసులు సమకూర్చారాయన. ఈ పాట వింటుంటే-ఘంటసాల సంగీత దర్శకత్వంలో వచ్చిన మరో రెండు చిత్రాల్లోని పాటలు గుర్తొచ్చే అవకాశం వుంది. మొదటి చరణంలోని రెండవ లైన్ అయిన 'కనిపించెను కన్నులకే' పూర్తి కాగానే వచ్చే ఇంటర్‌లూడ్-'మాయాబజార్'లోని 'నీవేనా నను తలచినది' పాటలో 'ఆ మెలకువలోనే ఒక కలగా' లైన్ తర్వాత వచ్చే ఇంటర్‌లూడ్‌ను స్ఫురింపచేస్తుంది. అలాగే ఈ పాటలోని సాకీల వలె సాగే చరణాలు వింటుంటే 'పెళ్ళినాటి ప్రమాణాలు' చిత్రంలోని 'నీతోనే నా లోకము' పాటలో గల 'కనులు తెరిచినా కనులు మూసినా ఆఫీసులో ఫైళ్ళు తెరిచినా' చరణం (ఇది కూడా సాకీలా సాగే ప్రయోగమే) జ్ఞప్తికి వస్తుంది.

సాకీ : రాజా-నారాజా-ఓ రాజా॥

పల్లవి: ఓనారాజా-ఇటుచూడవోయి

నేనోయ్-భీతిలవలదోయి ॥ఓనా॥

చరణం: అలిగిపోతివి-అలనాడు

ఔనా నేడేది నీకు దారి

చరణం: కూరి తమి మీరి దరిజేరనా

మురిసి నీ మ్రోల కరిగిపోనా

వేసీ కూరిమి చెరలోనా

కొసరి నా దాసు చేసుకోనా ॥ఓనా॥



ఈ పాటకు గానం, అభినయం శ్రీమతి భానుమతే! సన్నివేశ ప్రాధాన్యంగా నటుడు సీనియర్ ఏవీ సుబ్బారావు కూడా పాట చివర్లో కనిపిస్తారు. ఈ పాట కళ్యాణి రాగంతో స్వరపరచబడింది. అక్కడక్కడ యమన్ కూడా తొంగి చూస్తూ వుంటుంది. సంగీతానికి సంబంధించినంత వరకూ ఈ పాట స్వరకల్పన ఒక ఎత్తు, గానం ఒక్కటీ ఒక ఎత్తు. ఎందుకంటే కళ్యాణిరాగంలో స్వరపరచటంలో ఘంటసాలగారికి తనకంటూ ఓ శైలి, ముద్ర వుంది. రావే చెలియా (మంచిమనసుకు మంచిరోజులు), విరిసె చల్లని వెన్నెల (లవ-కుశ), తలనిండా పూదండ దాల్చిన రాణి (ప్రైవేట్ సాంగ్), పాటలను కూలంకషంగా మధించిన వారికి ఆ శైలి, ముద్ర మనోగతమై పోతూ వుంటాయి. అలాగే కళ్యాణి రాగంలో గల పాటలను పాడటంతో భానుమతిగారికి విలక్షణమైన పంథా వుంది. ఆ రెండు రీతులను కలగలపుకున్న పాట యిది. మరోవిధంగా చెప్పాలంటే- ఈ పాటను గనుక సాధనచేసి యధాతథంగా పాడగలిగినవారికి కళ్యాణి రాగంపై మంచిపట్టు లభిస్తుంది.

## సాంకేతికవర్గం

| | |
|---|---|
| కథ, సంభాషణలు, | |
| పాటలు | : సముద్రాల రాఘవాచార్య |
| ప్రాసెసింగ్ | : వి.డి.యన్.నందరం (విజయా లేబొరేటరీస్) |
| సంగీతం | : ఘంటసాల |
| స్టిల్సు | : ఆర్.ఎన్.నాగరాజారావు, మీనాక్షి సుందరం |
| నృత్య దర్శకులు | : పసుమర్తి కృష్ణమూర్తి, మాధవన్, సంపత్ |
| ఎడిటింగ్ | : వి.ఎస్.రాజన్ |
| కళ | : ఎస్.వి.ఎస్.రామారావు |
| సౌండు | : టి.ఆర్.సారంగపాణి |
| మేకప్ | : హరిబాబు, స్వర్ణప్ప, నాగేశ్వరరావు |
| పాటల రికార్డింగ్, | |
| రీరికార్డింగ్ | : ఆర్.కణ్ణన్ (రేవతిలో) |
| సెట్టింగ్స్ | : టి.నీలకంఠన్ |
| స్టూడియో | : రేవతి |
| కెమెరా | : హెచ్.ఎస్.శ్రీవాత్సవ |
| ఫోటోగ్రఫీ దర్శకుడు | : యస్.సి.బాలకృష్ణన్ |
| నిర్మాత | : నామదేవరెడ్డియార్ |
| దర్శకత్వం | : వి.యస్.రాఘవన్ కె.యస్.రామచంద్రరావు |

## నటీనటవర్గం

| | |
|---|---|
| యన్.టి.రామారావు | పి.భానుమతి |
| యస్.వి.రంగారావు | పి.శాంతకుమారి |
| ముక్కామల కృష్ణమూర్తి | రాజసులోచన |
| రేలంగి వెంకట్రామయ్య | సురభి బాలసరస్వతి |
| గుమ్మడి వెంకటేశ్వరరావు | ప్రభావతి |
| చలం | |
| ఏ.వి.సుబ్బారావు | గౌరీపతిశాస్త్రి |
| మిక్కిలినేని | విశ్వనాధశాస్త్రి |
| సి.వి.వి.పంతులు | సి.హెచ్.వి.రావు |




| | |
|---|---|
| నృత్యం | : ఇ.వి.సరోజ |
| నేపథ్య గాయకులు | : ఘంటసాల, పి.నాగేశ్వరరావు, మాధవపెద్ది సత్యం, యం.యస్.రామారావు, పి.లీల, జిక్కి కృష్ణవేణి, స్వర్ణలత. |

# స్వరాల రాజు టి.వి.రాజు

- పి.బి.శ్రీనివాస్





శ్రీ టెలివిజన్ (టి.వి.) రాజుగారిని, 'టింగురంగా' వెంకట్రాజుగారని కూడా అంటూ వుంటాం. ఎంచేతంటే వీరిని ప్రజా దృష్టిలో పడేసిన చిత్రం 'టింగురంగా', అదీకాక, ఎలాంటి చిక్కుల్లో చిక్కుకున్నా, చీమంతైనా చీకాకు చెందకుండా, సాయంత్రం అయేసరికల్లా, గ్లాస్గో జుబ్బా, పంచెధరించి, వ్రేళ్ళ సందున సగం కాలుతున్న సిగరెట్టు ఖండాన్ని బలంగా బిగించి, 'టింగు రంగా' అని బయలుదేరి, పాండీ బజార్లోనో మరో ప్రదేశంలోనో మిత్రులతో ముచ్చటగా ముచ్చటిస్తూ, తను నవ్వుతూ అందర్నీ నవ్వించడం అనేది, వీరి దైనందిన కార్యక్రమంలో ముఖ్యమైనది.

పూర్ణానుసారంలా గుండ్రని ముఖం, బూరి బుగ్గలూ, భారీ శరీరం, "వస్త్ర శిరం" ఆదిగా గల ప్రత్యేక లక్షణాలు గల వీరిని ఎట్టిగుంపులోనైనా ఇట్టే ఆనవాలు పట్టేయగలరు పరిచయస్తులందరు. నిగనిగలాడే వీరి శిరస్సు పై భాగం పండిన మేధకు నిదర్శనం. వెన్నెల రాత్రుళ్ళ, ఆకాశంలో పయనించే అందాల చందమామ, వీధిని పోయే వీరి శిరోదర్పణంలో ధగధగ మెరిసే తన ముఖమండలం చూచు కుంటూ మురిసి పోతూ వుంటాడు. రాజుగారు రాజులేగాని, రాజతంత్రం (పోలిటిక్సు) నేర్వనివారు. ఎవరైనా ఏదైనా చప్పని జోకు చెప్పినా, ఛప్పున నవ్వి, పెద్దగా అభినందించే మొగమాటస్తులు.

హిందూస్తానీ, పాశ్చాత్య సంగీతాలంటే పంచప్రాణాలూను. కర్నాటక సంగీతమన్నా, కావలసినంత అభిమానం కలవారే. వీరు మెచ్చేలాగా సంగీతం యిచ్చే ఔత్తరాహ సంగీత దర్శకులలో ముఖ్యులు. మనందరికీ కూడా నచ్చే నౌషాద్, సి.రామచంద్ర, మదన్‌మోహన్, సలిల్ చౌధురీ, శంకర్ జైకిషన్, సజ్జాద్ హుసేన్ మున్నగువారలే. ఈ పై పేర్లు గల హిందీ చిత్రాలు తప్పకుండా చూడడం విరివిగా గల వీరి హాబీలలో ఒక ముఖ్యాంగం. క్రికెట్ ఆడడం (ఇతరులు) చూడడం, వినడం మరో హాబీ. చదరంగం ఆట ఆడడం బాగా చేతవును. జీవితపు చదరంగంలో మాత్రం వరుల్ని పల్టీకొట్టించే చదరంగపు ఎత్తులు వేయడాని కిచ్చ గింపరు. సౌమ్యులు. సాధుశీలురు. స్నేహ పాత్రులు. ధనంజయ గోత్రులు. గోత్రం అనగా జ్ఞాపకం వచ్చింది. వీరి యింటి పేరు ఆంధ్రుల అభిమానపు టాకు కూర అనబడే "ఉద్యానశాకం" (తోటకూర).

వీరు 1916 ప్రాంతంలో, రాజమండ్రి తాలూకా రఘుదేవపురంలో తోటకూర వంశాంకురులై అవతరించారు. వీరి తండ్రి శ్రీ సోమరాజుగారు వసుదానాథులు(భూస్వాములు). ఆరేళ్ళ చిరుత ప్రాయంలోనే రాజుగారు పితృహీనులైనందు వల్ల చదువు సాగక, ఫోర్తు ఫారం వరకూ చదివి, ఫుల్‌స్టాప్ పెట్టేశారు విద్యకి. కాని సంగీత జ్ఞానం మట్టుకు దినదినాభివృద్ధి చెందింది. రఘుదేవపురంలోనే శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచారిగారి గురుత్వంలో మూడేళ్ళు నేర్చుకున్న జ్ఞానంతోనే 1934 సంవత్సరంలో శివరాత్రి తర్వాత పాఠాలు చెప్పడం ప్రారంభించారు అమ్మాయిలకి. ఆ కాలంలోనే వీరికి మంచి నాటకానుభవం కూడా చేకూరింది. కోరుకొండ, రాజమండ్రి ప్రాంతాలలో డ్రామాల్లో వేషాలు వేసేవారు. తనకి తనే పాడుకునేవారు. ఆ రోజుల్లో ఇప్పటిలా "ప్లే బ్యాక్" వుండేది కాదు. కనక పాడగలిగినవాళ్ళే వేషాలు వేయగలిగే వారు. వీరు లోహితాస్యుడు, కనకసేనుడు, కబీరు, నారదుడు, కృష్ణుడు వగైరా పవిత్రమైన పాత్రలు ధరించి తరించేవారు. సురభి డ్రామా ట్రూపులో హార్మోనీ వాయించేవారు. రెండు మూడేళ్ళు తమిళదేశంలోని రాజపాల్యంలో, అన్నగారైన శ్రీ సత్యనారాయణ రాజుగారితో వుంటూ, అక్కడి హైస్కూల్లో అరవ డ్రామాల్లో చిరంజీవి మార్కండేయుడుగా జీవించారు.

1934 మొదలు ఏడెనిమిదేళ్ళిలా, మ్యూజిక్ ట్యూషన్లతోనూ, డ్రామావేషాలతోనూ సాగాయి. అనకాపల్లి, చోడవరం వంటి వూళ్ళలో ఆనాటి ప్రఖ్యాత అభినేత్రి శ్రీమతి అంజనీకుమారి (అనగా నేటి అంజలీదేవి) జరిపే నృత్య ప్రదర్శనలకూ "మిస్, ప్రేమా బి.ఏ" లాంటి వార్ ఫండ్ డ్రామాలకు హార్మోనీ వాయిస్తూ సంగీత శాఖలో ఒక ఆకుగా వుండేవారు. గుత్తి వంకాయకూరను ప్రేమతో వండిపెట్టిన శ్రీ బి.వి.నరసింహారావుగారి డ్యాన్సు గ్రూపుతో కూడా రాజుగారు కొన్నాళ్ళు తిరిగారు. ఆదర్శ నాట్యబృందంలో కూడా పాల్గొనేవారు. ఈ సందర్భంలో, ఆంధ్రా, ఒరిస్సా పరిసరాలు యావత్తూ పర్యటించ గలిగే అపూర్వావకాశం పొందగలిగారు. ఈ నాటక ప్రకరణం ముగిసి, సినిమా జీవితం ప్రారంభ మైంది 1946లో.

శోభనాచల స్టూడియోలో హార్మోనిస్టు పోస్టు ఖాళీగా వుందని, శ్రీమతి రమాజోషి వీరిని తంతియిచ్చి పిలిపించారు. తీరా మద్రాసు వచ్చే సరికదివరకే ఆ ఖాళీ భర్తీ అయిపోయిందని తెలిసేసరికి, నిరాశతో వేడి నిట్టూర్పు వదిలారు. కాని కొన్నాళ్ళకే, శ్రీమతి కాంచన్‌గారి మొదటి చిత్రంలో సంగీత దర్శకులైన శ్రీ నాళం నాగేశ్వరావుగారికి సహాయం చేస్తూ పనిచేశారు. తిరిగి, శ్రీమతి కృష్ణవేణిగారు ఎమ్.ఆర్.ఎ. ప్రొడక్షన్సు నిర్మించిన "మనదేశం"లో ఆర్గన్ వాయించడానికి నియుక్తులయారు. తదువరి అంజలీ ఆదినారాయణుల ఆదరాభిమానాలు పొంది, శ్రీ బి.ఏ.సుబ్బారావుగారికి, ఎసోసియేట్‌గా కుదిరి, ఎసిస్ట్ చేశారు.శ్రీయుతులు ఎన్.టి.రామారావు, ఎస్.వి.రంగారావుగార్లతో కలిసి వీరా రోజుల్లో మాంబళంలో వ్యాసారావు వీధిలో నివసిస్తూ వుండేవారు. ఈ ముగ్గురి మధ్యా ముచ్చటైన మైత్రి కుదిరింది.

వీరు స్వతంత్రంగా సంగీత దర్శకుడుగా పేరుపొందిన ప్రథమ చిత్రం "టింగు రంగా"యే. ఇదే చిత్రం తమిళంలో "శ్యామల"గారి రూపొందింది. ఈ చిత్రాల ఘనవిజయం వీరిని

ఫిలింపొలంలో లోతుగా నాటి నిలబెట్టింది. తదాదిగా లెక్కకందని పెక్కు చిత్రాలకు చక్కని చిక్కని సంగీతం యిచ్చినా టెక్‌నిక్ తప్ప, టెక్కు, నిక్కు ఎరగని నిగర్వి.

బూజుపట్టిన పాత సంప్రదాయాలకోసమనే ప్రాకులాడుతూ మడిగట్టుక్కూర్చోకుండా, రోజురోజుకీ మారే ప్రజలమోజుని గుర్తించి మనసులో పెట్టుకుని మరీ వరసలు కడుతూ, ప్రజలకు నచ్చిన ఫణతులనే ప్రత్యేకతతో ప్రయోగిస్తూ వుంటారు మన రాజుగారు. ఇదే వీరి విజయరహస్యానికి కీలకం.

ఒక పర్యాయం వీరు కంపోజింగుకని కూర్చుని, ఒక గీతానికి మట్టుకట్టే సమయాన, పక్కనున్న పదిమంది పదిరాగాలు సజెస్ట్ చేశారు. వాటిలో వీరికి 'ఉదయరవిచంద్రిక' నచ్చింది. సన్నివేశానికి సమంజసంగా వుంటుందని తోచింది. ఆ రాగపు పోకడలో హార్మోని మెట్లపై వ్రేళ్ళని పయనింపజేస్తూ నాలుగైదు మట్లుకట్టారు. ఆ నాల్గింటిలోనూ ఒకటి అందరికీ నచ్చింది. కాని ఆ వరస తయారించే విధానంలో ఒక వింత జరిగింది. ఉదయరవిచంద్రిక రాగంలో "సగమపనిస" అనే స్వరాలే ఆరోహణా వరోహణలలో పలుకుతాయి శాస్త్ర ప్రకారం, వాయించే జోరులో అనుకోకుండా అకస్మాత్తుగా అంగులీయకపుటంగుళి (ఉంగరం వ్రేలు) ఈ రాగానికే వర్జ్యస్వరమైన ధైవత ప్రాంతంలో అన్యాయంగా, అన్యాక్రాంతం జరిపింది. మనను గతుక్కుమంది వీరికి-పక్కనున్న శ్రీ మునిస్వామిగారే మనుకుంటారోనని. రాగాల శుద్ధ ప్రయోగాలలో మాత్రమే నెమ్మికా. నమ్మికా గల మునిస్వామి (వీరి సహాయకులలో నొకరు- మరొకరు ధోలక్ సత్యం) ఇంచుక ముఖం చిట్లించారు అప్రయత్నంగా. కాని, ధోలక్ సత్యం తలవూపారు బాగుందని. "రాజుగారు కావాలనే దైవత ప్రయోగం చేశా"రని సత్యం పలికారు. కాని రాజుగారు దైవత ప్రయోగం దైవికంగా జరిగిందని నిజం చెప్పేసి సత్యం పలుకు సత్యంకాదని రుజువుచేశారు. కాని దైవికంగా పడిన దైవతం శాస్త్ర సమ్మతం కాకపోయినా కర్ణ సమ్మతంగనక, దైవతాన్ని పలికినది పలికినట్టుగా వుపయోగించడానికే నిశ్చయించుకున్నామన్నారు. శాస్త్రం కోసమనే, దైవతాస్త్రసన్యాసం కావిస్తే, వెనకటి కేదో సామ్యం చెప్పినట్లై కూర్చుంటుందన్న వ్యంగ్యోక్తితో తన నిశ్చయాన్ని బలపరుచుకున్నారు.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, సంప్రదాయబద్ధులై పోకుండా అందగించే స్వరసాంకర్యానికెంత మాత్రం వెనుకంజ వేయకుండా, ముందంజ వేసుకుంటూపోతారు. ఏమైనా "రాజు"గారుకదా?



దేనికీ కట్టుబడి వుండడం వీరిక నచ్చదు. ప్రతీ విషయంలోనూ సర్వ స్వాతంత్ర్యా న్నపేక్షిస్తారు. ఇబ్బంది లేనంతవరకూ "స్వ భావాలను" అమలు పరుస్తారు.



వచ్చిన కొత్తలో వీరు కొత్తగా కొన్న కారు ఆస్టిన్, మొదటిరోజునే డ్రైవరు వచ్చినట్టే వచ్చి వెళ్ళిపోయాడు. చెప్పకుండానే తనకున్న మిడిమిడి జ్ఞానంతోనే, వీరు సొంతంగా ధైర్యంచేసి, పక్కనున్న ఇద్దరు అసిస్టెంట్ల పిక్కబలంతో, కారు నెలాగో తోలి, కోడంబాకం గేటుదాకా గెంట గలిగారు. అవతల రీరికార్డింగుకని వాయిద్య గాండ్రు కాచుకుకూచుంటారని, అవసరంగా తొలడంలో, ఫస్టుగేర్ వేయబోయి లవర్సుగేరు వేసేసరికి, గేటు దగ్గర కొంచెం స్లోపేమో, కారు వెనక్కీ ముందుకీ ఊగిసలాడి ఉయ్యాల ఊపింది వీరిని. వెనకనున్న కార్ల డ్రైవర్ల గుండెలు గుభిల్లుమని, ఆత్మ సంరక్షణ పరాయణులై, వీరి కారు, నేరుగా వెనక్కి సాగి తమ బళ్ళని ఢీకొని వాటి షేపే మార్చేలోపుగా, వీరి కారుని ముందుకి నెట్టి ఎలాగో గేటు దాటించారు. కాని, "టాక్సీరాముడు" చిత్రం తాలూకు రీరికార్డింగు కావడం వల్లనో ఏమో, "టాక్సీ" ఎక్కాల్సిన అవస్థపట్టింది-మరికొన్ని గజాల దూరంలో ఆస్టిన్ ఆగిపోయి, ససేమిరా కదలనని భీష్మించుకునే సరికి! మొత్తానికి గంట ఆలస్యంగా చేరుకున్నారు గమ్యస్థానాన్ని.

ఇహ రీరికార్డింగు వ్యవహారం చూస్తే అంతా ఆయోమయం. అర్జంటుగా 'రిలీజు' తల పెట్టడం వల్ల వీరికి చివరి మూడురీళ్ళూ చూడ్డానికి, టైమింగూ అదీ నోట్ చేసుకోడానికి కుదరనేలేదు. ఏ థియేటరూ (స్టూడియోలో) ఖాళీ లేనందువల్ల డైరెక్టర్‌గారి హింట్సూ, పాయింట్సూ తీసుకుని, నిరాధారంగా యేదో వూహించు కుని, ఉజ్జాయింపుగా, బిట్స్, కంపోజ్‌చేసి, దైవం మీద భారంపడేసి, రికార్డు చేయించేశారు. తనిచ్చి బ్యాగ్‌గ్రౌండ్ మ్యూజిక్‌కీ, పిక్చర్లో సన్నివేశాలకీ, సరిగ్గా అతుకుతుందో లేదో అని గుండెలు బితుకు బితుకు మంటూనే వున్నాయి. ఫైనల్‌గా పిక్చర్ చూసేదాకా! చూసినమీదట, "బ్రహ్మాండంగా "మాచ్" అయిందని, అందరూ అనుకుంటున్నారని విని తనకు తనే అభినందించుకుని కాలరెత్తుకున్నారు.

ఇహ వీరి గీతాల్ని నెమరేసుకుందాం. "టింగురంగా"లో "టింగుటింగు టంగు టంగు" అనే హాస్య గీతం నల్ల రామ్మూర్తి, కనకం పాడగా పక్కలు చెక్కలయేట్టు నవ్విస్తుంది. శ్రీమంత్రవాది శ్రీరామమూర్తికి ఘంటసాల పాడిన "రాజా మహారాజా'' అనే శాస్త్రీయగేయం "హుసేని" రాగంలో తయారైన "హుసేన్" (అందమైన) గీతం. ఇదే పాటని అరవంలో కీ॥శే॥శ్రీత్యాగరాజ భాగవతార్ "రాజన్ మహరాజన్" అని జకారానికున్న దీర్ఘాన్ని హ్రస్వీకరించి, నకారప్పొల్లు, తగిలించి పాడారు మనోజ్ఞంగా, ''జీవప్రియా హేశ్యామలా'' అన్న ఘంటసాల గీతం మిశ్రశిలంగ్‌లో కూర్చారు "మిశ్రా" (కలకండ) లాగ. "బేలవుగా కనజాలవుగా" అన్న గీతాన్ని శ్రీరాజు "భీంప్లాస్" రాగంలో "ఏ" క్లాస్‌గా

తయారించగా శ్రీ కంఠసాల "బీ" (ఝుమ్మనే తేనేటీగ) క్లాస్‌గా, గానం చేశారు. శ్రోతలెల్లరూ తద్గానమదిరాపానం చేశారు. కైలాసనృత్యానికి శ్రీమతి వసంత కుమారి ఝంఝఘాటి హంసానంది, కానడ అది అద్భుత రాగాలలో, గళగానం చేశారు. "ఇదియేమి మాయో కదా" అని శ్రీమతి స్వరలక్ష్మి 'తిలక్ కామోద్" రాగానికి ప్రాణం పోశారు. పై గీతాలకి బలం శ్రీ తాపీ కలంకూడా.

శ్రీ తాతినేని చేతిలో మెరుగుంది. అందరూ మెచ్చిన 'పిచ్చిపుల్లయ్య" తెచ్చియిచ్చిన ఖ్యాతిలో కొంత రాజుగారి క్కూడా చెందుతుంది. కఠినపదాల వాడుకను అదుపులో కట్టిపెట్టి, గట్టి భావాలను సైతం ఒత్తులు లేని మెత్తని పదజాలంతోనే మృదువుగా, ముద్దుగా తెలపడంలో గట్టివారైన శ్రీ అనిసెట్టి కమ్మని రచన, రాజుగారి రాగాలకతన, సుగంధమబ్బిన సువర్ణమైంది. "బస్తీకి పోయేవటి ఓ పల్లెటూరి వాడా" అని శ్రీ పుండరీకాక్షయ్య గారిచే భావయుక్తంగా పాడించి, భావి నిర్మాతను, నాడు గాయకులుగా పరిచయం చేసిన ప్రతిష్ట రాజుగారిదే. "శోకపు తుపాను చెలరేగిందా?" అనే నేపథ్య గీతంలో, శ్రీ ఎం.ఎస్.రామారావుగారి నిజ గద్గదస్వరోద్గతాలైన అలల అలజడిలో కల్లోలితమై అల్లలాడింది శ్రోతల హృదయనావ, పెనుతుపానులో పయనించే పడవరీతిగా, శ్రీమతి సుశీలగారి "ఆనందమే జీవితాశ" గీతాన్ని మరాఠీ బాణీలో మలచిన విధాన్ని, స్వర్గీయ శ్రీ హెచ్.యం.రెడ్డిగారు, మీసాలు దువ్వుతూ మెచ్చుకున్నారట. భీంపలాస్‌లో "ఎల్లవేళలందు నీ చల్లని చిరునవ్వుకై" అని శ్రీ ఘంటసాల, శ్రీమతి బాలసరస్వతీ కలిసి చిగురింపజేసిన పల్లవి, తరుణీ మధురాధరోల్లసిత దరహాస చంద్రికయై వెల్లి విరిసింది.

ఆకాశవాణిగా శ్రీ ఘంటసాల అను మంద్రంలో ఆలపించిన "ఆలపించినా, అను రాగముతో" అనే ప్రేమగీతిక మలయానిలవీచిక. "ఓ పంతులుగారూ వినవేమయ్యా పిలిస్తే రావేమయ్యా" అనే యుగళగీతం పిఠాపురం, కోమలగారలు, రమణారెడ్డి కృష్ణకుమారిగార్లకు గొంతు అరువొసగి, లాస్యంతో కూడిన హాస్యం అందించారు.

"పిచ్చిపుల్లయ్య" పిమ్మట శ్రీ రాజు ఎన్.ఎ.టి. సంస్థలో పదిలంగా వ్యవస్థ ఏర్పరచుకున్నారు. నందమూరు సోదరుల ప్రేమాభిమాన బద్ధులై - తారకరామ త్రివిక్రమరావుగారల ప్రతిష్ఠావర్ధక నిర్మాణమైన "తోడుదొంగలు" చిత్రంలో నాలుగే నాలుగు నాణెమైన గీతాల్లో ఒకటి. నాటకంలో నాట్యసన్నివేశానికని శ్రీమతి కోమల కోమలంగా, పేశలంగా ఆలపించిన తిల్లానా, ఫిలిం పాలంలో



తన స్థలం బలంగా అచంచలంగా భద్రపరచు కున్న శ్రీ చలం క్లబ్‌లో ఆడుతూ పాడుతూ పాడే సందర్భంలో, శ్రీ పిఠాపురం నాగేశ్వరరావు, అనుభవజ్ఞులవలె, అందించిన సందేశం "పేకాట భలే ఆట" పాటవిని, మనం "శభాస్ బేటా" అనకుండా యెలా వుండగలం? "ఉన్న తీరునే



టి.వి.రాజుగారు స్వరపరచిన 'జయకృష్ణాముకుందా మురారీ' అనే అజరామరగీతాన్ని అభినయిస్తున్న ఎన్.టి.ఆర్ (పాండురంగమహాత్మ్యం చిత్రంలో)

వున్నది వుంది, నీదన్నది నీకేముందీ" అనే వైరాగ్య ద్యోతకమైన గేయం హృదయం తెలుసుకుని నడుచుకుంటే, అనూహ్యమైన భవతరణోపాయం లభ్యమౌతుంది. ఈ చిత్రంలోని గీతరచనా శైలి పరికిస్తే శ్రీ జూనియర్ సముద్రాల పేరుకి "జూనియర్" అయినా, కవితలో ఆరితేరిన "సీనియర్"గా తోచక మానరు. శ్రీ యోగానంద్ డైరెక్షన్లో, ఎన్.ఎ.టి.వారు నిర్మించిన "జయసింహ"కు అమరిన సంగీతం అజరం, అమరం. "బేగడ" రాగంలో పాలమీగడలా కమ్మగా, శ్రీమతి సుశీల తన కమ్మని కంఠంనుంచి కుమ్మరించిన మోహనగానం వినగా "నడిరేయి గడిచేను" అనేపాట పల్లవి "కల్ల" అనిపిస్తుంది. ఎందుకంటే ఈ పాటవింటుంటే నడిరేయెంతకీ గడవనే గడవదు. తీయని తలపు విడవదు. నిముషం కూడా నడవదు. శ్రీ రాజు శ్రీమతి కె.రాణిచేత "గీతారాయ్ బాణి"లో మత్తుగా, గమ్మత్తుగా పాడించిన "కొండమీద కొక్కిరాయీ, కాలుజారి కూలిపోయే" గేయం ఆలపిస్తూ శ్రీమతి అంజలి ప్రదర్శించిన నటన అమోఘం. ఒక వెంకటేశ్వరరావుగారికి (గుమ్మడి), మరో వెంకటేశ్వరరావు (ఘంటసాల)గారు పాడిన "జయజయ శ్రీరామా" అనే భక్తిరసపూరిత భజన గీతం సమ్యగాలాపితం, రసికజన మనోస్థాపితం. ఈ గేయం హిందీలో "మన్నాడే" వినిపించారు. సుభద్రార్జునుల ప్రణయలీలలకు సంగీత వాతావరణం సమకూర్చిన ఘంటసాల, లీలల కంఠస్వర మాధురీ ఝరిలోతనిసి సోలినవారికి "ఈనాటి ఈ హాయీ కలకాదోయి నిజమోయీ" అనిపించడంలో ఆశ్చర్యమే ముంటుంది? బాలసరస్వతీ కోమలల "మనసైనా చెలిపిలుపు" వినీకూడా "రావేల ఓ చందమామ" అని మరీమరీ బతిమాలించుకుని పిలిపించుకున్నా డంటే - ఆ చందమామ ఎంతటి మందమతియై యుండనోవు! "మదిలోని మధురభావం పలికేను మోహనరాగం" అని ఘంటసాలా, బాలబ్రహ్మ రాణీ, కళ్యాణీ మోహనరాగాల సమ్మిశ్రణం కావించి పలవించారు. శ్రీ రేలంగికి పిఠాపురం పాడిన గమ్మత్తయిన స్వరాల కసరత్తులో "నిసగమపా లోకం మోసం పమగరిస" అన్న పల్లవిలో స్వరాలు వాటి స్వస్థానాలలో వుండ కుండా (గాంధారం తప్ప), అన్యస్థలాల్ని ఆక్రమించి గలాటాచేయడం గమనీయమూ, కమనీయమూను.

ఎన్.ఎ.టి.వారి "పాండురంగ మహాత్మ్యం"లో సౌందర్యోపాసకులుగా అభినయ సౌందర్యం వెలయించిన హీరో ఎన్.టి.ఆర్. జోరుగా హుషారుగా వారు అశ్వంపై అధిష్ఠించి ఆలాపించిన "తరం తరం నిరంతరం నీ అందం" గీతం ఆనంతానందకరం. 'మోహన'లో

శ్రీ ఘంటసాల ఆరంభించి యెలుగెత్తి ఆలాపించిన "హే కృష్ణా ముకుందా, మురారీ", "అమ్మా, నాన్నా, అమ్మాయని పిలిచినా ఆదరించవేయమ్మా" (సింధు భైరవిలో) అనే పాటలు వింటే ఒళ్ళు జలదరిస్తుంది.

అంజలిగారికి, శ్రీమతి పి.లీల పాడిన "వెన్నెల చిన్నెల నెర, కన్నెల వేటల దొర" గీతానికి కట్టలేం ధర. రీటా నాట్యానికి, లీలగారు పాడిన "కనవేర మునిరాజమౌళీ" అన్న జావళీ చవులూరే చక్కెరకేళీ. శ్రీమతి సరోజాదేవికి, జిక్కీగారాలపించిన "ఆనందమిదేనోయీ సఖా" వింటే ఆనందమంటే యేమిటో తెలుస్తుంది.

స్వస్తిశ్రీ వారి "రేచుక్క - పగటిచుక్క"లో "భళిభళి దేవుడా భలేవాడి వేనురా" అని బాలకృష్ణ పద్మనాభాలకు పిఠాపురం, సత్యం, కలిసి ఏకకంఠాన దేవుడి మహిమను కొనియాడారు. జానకీ (షావుకారు) రాము (ఎన్.టి.ఆర్)లకు సుశీలా ఘంటసాలలు పాడిన "ఔనాకాదా" అనేపాట హిట్టైనా, కాదా అన్న సందేహానికి తావేలేని రీతిగా సంగీతీకరించారు శ్రీ రాజు.

"రాజనందిని' చిత్రంలో నగవుల నగయనదగు నగసుత శ్రీమతి గిరిజకు శ్రీమతి సుశీలగారు "నీ మీద మనసాయెరా" అని సింధుభైరవిలో వినిపించిన మధురభావం విని మన్మధుడుకూడా పూవింటినిచేగొని సమరాని కుద్యుక్తుడౌతాడు. అంజలీ, రామారావులుకు, రాజా, జిక్కీ గారలు పాడిన "అందాలు చిందుసీమలో వుందాములే హాయిగా" భాగేశ్వరిలో భాసిల్లిన భావమయ గేయం "చిక్కేవులేరా చక్కని రాజా" అని జిక్కీగారు పాడడం యెంత చక్కగా కుదిరింది! "హాస్య సమ్రాట్టు శ్రీ రేలంగి, పి.యస్.ఆర్. (శ్రీపెండ్యాలకాదు. పిఠాపురం నాగేశ్వరరావు) పాడిన "ఎందుకో చెప్పలేనుగాని, నే నెన్నటికీ మరువజాలను. "రంగేళీ రౌతంటే నీవేరా ధీరా" అని శ్రీమతి జి.వరలక్ష్మి నృత్యానికి సుశీలగారు చేసిన గానదానం, గగనయానం కలిగించే ఆనందం చేకూరుస్తుంది.

ఈ గీతాలన్నీ శ్రీ మల్లాది పదునైన కలం పసందుగా పలికినవే. "ఋష్య శృంగ"లో జానకీ ఘంటసాలలు ఆలపించి వెలిగించిన "అందాలు చిందు దీపం" వెండి తెరపై రాజసులోచనా, హరనాథుల ప్రణయ పథానికి వెలుగుచూపింది. "టాక్సీరాముడు"లో "మనలో మాట సుమా" అని శ్రీమతి సుశీల శ్రీమతి రాగిణి కొసగిన రాగిణి రసధారావాహిని. రాగిణికే జానకిగారు పాడిన "ఏమిటి కావలె కోరుకో" గీతం వరమైన వరం.

"రేలంగిరిజ"లకు జానకీ పిఠాపురం గారలు పాడిన శ్రీ కొసరాజు రచన "మావయ్యో తిర నాళకు పూడుస్తా" ప్రేక్షక శ్రోతలని పకపకల తికమకలోపడేసి, అభినయ జీవికయైన దేవికకు అమరిన సుశీలగారి సోలో "గోపాలబాలా కాపాడవేరా" వినినంతనే వేణుగోపాలుడు మింగుతున్న వెన్న వదిలి, బిరబిర పరుగిడి రావలసినదే!



శ్రీ రాజు సంగీత దర్శకులేకాక, నిర్మాతలు కూడా. ఆనాటి "బాలనాగమ్మ"ను పునరుజ్జీవింపజేసినవారిలో వీరు కూడా భాగస్వాములే. ఈ అభినవ "బాలనాగమ్మ" చిత్రంలో శ్రీమతి రాజసులోచన నాట్యానికి సుశీలగారి "అందము ఆనందం", "నీకేలరా" అనే గీతాలు, మయూరిని నర్తింపజేసే జలదుని చిలకరింపులు. వరుణుని పలకరింపులు, మేదిని పులకరింపులు.

శ్రీ ఘంటసాల రేలంగిగారికి ఆలపించిన "మజా మజా మధురసం", "ఇద్దరు పెళ్ళాలు వద్దురా శివుడా" అనే రెండు వినోదాత్మకమైన గేయాల్లోనూ, మొదటిది ప్రభుత్వ చట్టానికి (మద్యనిషేధానికి) ప్రతికూలం! రెండవది అనుకూలం (బహు వివాహ బహిష్కారానికి). "స్వయంప్రభ" చిత్రానికి, "మగరాయ కతమేమిరా" అనే ఒకే సాహిత్యానికి సంగీతం రెండు బాణీలలో (కర్నాటక, హిందూస్తానీ) నిండు నైపుణితో కాంభోజి, బేహాగ్‌రాగాలలో విడివిడిగా అమర్చి వినిపించారు. ఒకదానికొకటి తీసిపోకుండా.

నేను వీరి సంగీతంలో మానార్ ఫిలింస్ "మావూరు" కని స్వర్ణలతగారితో రెండు హాస్యయుగళ గీతాలు పాడాను. సరస్వతీ మూవీస్‌వారి "సింహాచలక్షేత్ర మహాత్మ్యం" చిత్రంలో శ్రీ అయస్కాంతారావుగారికి నేనూ, యదునందన తనూజ (కృష్ణకుమారి)గారికి జానకిగారు కలిసి ఆలపించిన గేయం "రావోయీ, రాజా."

మంగమ్మ శపథం, భామావిజయం, శ్రీకృష్ణ పాండవీయం, ఉమ్మడి కుటుంబం, తల్లా-పెళ్ళామా, కోడలుదిద్దిన కాపురం, వరకట్నం, భలేతమ్ముడు వంటి చిత్రాలెన్నో టి.వి.రాజుగారి 'గానాఖజానా'లో చోటు చేసుకున్నాయి.



## చంద్రబోసూ - సెల్‌ఫోన్ పీసూ

**కమ్యూనికేషన్ రంగంలో ఇటీవల సెల్‌ఫోన్‌లు ఎంతటి ప్రాధాన్యత ఎంతగా పెరిగిపోయిందో అందరికీ తెలుసు. అక్కినేని నాగార్జున సినిమా 'శివమణి' కి టాగ్ టైటిల్‌గా '98480 - 22338' అని ఉంచారు. 'నీది 98480' అంటూ 'యువరత్న' సినిమాలో చంద్రబోస్ సెల్‌ఫోన్ నంబర్లతో ఏకంగా ఓ పాటే రాసేశాడు. విచిత్రం ఏమిటంటే చంద్రబోస్ పారేసుకున్న సెల్‌ఫోన్‌లు ఇంకెవరూ పారేసుకొని ఉండరేమో...!? ఇంకా విచిత్రం ఏమిటంటే ఇన్ని పారేసుకుంటూ ఉంటూనే మొన్నామధ్య ఓ సెల్‌ఫోన్ పీస్‌కొని ఇంకా సిమ్‌కార్డు వేసి యాక్టివేట్ చెయ్యకుండానే పారేసుకున్నాడాయన. దాంతో వాళ్ళావిడ సుచిత్ర ఇలాక్కాదని చెప్పి తను దుబాయ్ వెళ్ళినప్పుడు - సెల్‌ఫోన్ పారేసుకోకుండా ఉండేలా, పడినా పాడైపోకుండా ఉండేలా - ఓ ప్లాస్టిక్ కవర్ కొని ఆయన మెడలో వేసేసింది. ఆ కవర్‌ని చూపిస్తూ - మీకో తమాషా చెప్పనా 'నీది 98480' పాటను రాసి బైటికొస్తూ కూడా ఓ సెల్‌ఫోన్ పోగొట్టుకున్నాను - అంటూ చెప్పాడు చంద్రబోస్ పడిపడినవ్వుతూ.**

## చిత్రం : మంగమ్మ శపథం

రచన: సి.నారాయణ రెడ్డి　　గానం: ఘంటసాల, పి.సుశీల

నీ రాజు పిలిచెను రే రాజు నిలిచెను
యీ రేయి నీదే కదా! చెలి
నా రాణి నీవే కదా!!
నా రాజు పిలిచెను రే రాజు నిలిచెను
యీ రేయి నాదే కదా! ఇక
నీ రాణి నేనే కదా!!
నిన్ను చూచీ, నీ వన్నె చూచీ
నను నేనే మరచేనులే
ఈనాటికైనా ఏనాటికైనా
నేనే నీలో, నిలిచేనులే ॥నీ రాజు॥
ఇన్నినాళ్లు ఈ నీలి కళ్లూ
ఏ కోనలో దాగెనో
నే కోరుకున్న నా స్వామి కోసం
ఈ కళ్లు, ఎన్నాళ్లు వేచేనులే ॥నీ రాజు॥

## చిత్రం : పిడుగురాముడు

రచన: సి.నారాయణ రెడ్డి　　గానం: ఘంటసాల, పి.సుశీల

అ: మనసే వెన్నెలగా మారెను లోలోన
వీడిన హృదయాలే కూడెను ఈవేళ ॥ఆ: మనసే॥
అ: విరిసే ఊహలలో పరువము నీదేలే ॥2॥
ఆ: మదనుడి కన్నులలో మగసిరి నీవేలే ॥2॥
అ: సైగలతో కవ్వించే జవ్వని నీవేలే ॥2॥
ఆ: తలపుల పందిరిలో కలలే కందామా ॥2॥
అ: తరగని కౌగిలిలో కాపురముందామా ॥2॥
ఆ: కనరాని తీరాలే కనుగొందామా ॥అ: ఆ: మనసే॥

## చిత్రం : రేచుక్క-పగటిచుక్క

రచన: జూ॥సముద్రాల　　గానం: ఘంటసాల

మనవి సేయవే
మనసార చెలికి నాదు ప్రేమ ॥మనవి॥
సందెవేళ సుందరాంగి
చిందులేయు వెన్నెలలో
సందు చేసుకొని నీవు
చందమామ చల్లగా ॥మనవి॥
ఆమె కురులు కదిపి నీవు
ఆడువేళ మారుతమా
చెలియ మనసు తీరు తెలిసి
చెవి లోన మెల్లగా ॥మనవి॥

## చిత్రం : తల్లా పెళ్లామా

రచన: సి.నారాయణ రెడ్డి　　గానం: ఘంటసాల, ఎన్.టి.ఆర్. బృందం

ప: తెలుగుజాతి మనది - నిండుగ వెలుగుజాతి మనది
తెలంగాణా నాది - రాయలసీమ నాది
సర్కారు నాది - నెల్లూరునాది
అన్నీ కలసిన తెలుగునాడు - మనదే - మనదే - మనదేరా ॥తెలుగు॥
చ: ప్రాంతాలు వేరైనా - మన అంతరంగ మొకటేనన్నా
యాసలు వేరుగ వున్నా - మన బాస తెలుగుబాసన్నా
వచ్చిండన్నా వచ్చాడన్నా వరాల తెలుగు వొకటేనన్నా ॥తెలుగు॥
చ: మహాభారతం పుట్టింది రాణ్మహేంద్రవరంలో
భాగవతం వెలసింది ఏకశిలానగరంలో
ఈరెంటిలోన ఏదికాదన్నా ఇన్నాళ్ల సంస్కృతి నిండుసున్న ॥తెలుగు॥
చ: పోచంపాడు ఎవరిది? నాగార్జునసాగరమెవరిది?
మూడు కోండ్రలూ కలిసి దున్నిన ముక్కారు పంటలు బండ్లకెత్తిన
అన్నపూర్ణమ్మ కన్నబిడ్డలౌ అయిదుకోట్ల తెలుగువారిది ॥తెలుగు॥
చ: సిపాయి కలహం విజృంభించి నరసింహాలై గర్జించాము
గాంధి నెహ్రూల పిలుపు అందుకొని సత్యాగ్రహాలు చేశాము
స్వరాజసిద్ధి జరిగిన పిమ్మట స్వరాష్ట్రమును సాధించాము
దేశభక్తిలో తెలుగువారికి దీటే లేదనిపించాము ॥తెలుగు॥
చ: ఇంటిలో అరమరికలు ఉంటే ఇల్లెక్కి చాటాలా!
కంటిలో నలక తీయాలంటే కనుగ్రుడ్డు పెరికివేయాలా!
పాలుపొంగు మన తెలుగుగడ్డను పగలగొట్టవద్దు!
నలుగురిలో మనజాతి పేరును నవ్వులపాలు చెయ్యొద్దు ॥తెలుగు॥

## చిత్రం : శ్రీ కృష్ణపాండవీయం

రచన: సి.నారాయణ రెడ్డి　　గానం: జిక్కి

ఛాంగురే బంగారు రాజా
ఛాంగు ఛాంగురే బంగారు రాజా
మజ్జారే మగరేడా మత్తైన వగకాడ
అయ్యారే....అయ్యారే నీకే మనసియ్యాలని వుందిరా...ఛాంగురే... ॥ఛాంగురే॥
ముచ్చటైన మొలక మీసముంది
భళా అచ్చమైన సింగపు నడుముంది
జిగిబిగి మేనుంది సొగసులొలుకు మోముంది
మేటి దొరవు అమ్మక చెల్లా
నీ సాటి ఎవ్వరుండుట కల్లా...ఛాంగురే... ॥ఛాంగురే॥
కైపున్న మచ్చె కంటి చూపు
అది చూపుకాదు పచ్చల పిడిబాకు
పచ్చల పిడిబాకో విచ్చిన పువు రేకో
గుచ్చుకుంటె తెలుస్తుందిరా
మనసిచ్చుకుంటె తెలుస్తుందిరా...ఛాంగురే... ॥ఛాంగురే॥
గుబులు కొన్న కోడె వయసు లెస్సా
దాని గుబాళింపు ఇంకా హైలెస్సా
పడుచుదనపు గిలిగింత
గడుసు వయసు పులకింత
ఉండనియ్యదేమి సేతురా
కైదండ లేక నిలువలేనురా...ఛాంగురే ॥ఛాంగురే॥











అ(జరా)మర గాయకుడు ఘంటసాల స్మారక తపాల బిళ్ల, కవరు 11.02.2003న హైదరాబాద్‌లో విడుదలయిన సందర్భంగా ఆ వేదికపై కలిసిన ప్రముఖ గాయనీ గాయకులు- మనో, జి.ఆనంద్, వి.రామకృష్ణ, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి.బి.శ్రీనివాస్, శైలజ, ఎస్.జానకి, పి.సుశీల, జిక్కి, పి.లీల-తో ఘంటసాల రత్నకుమార్ (ఎడమ నుండి తొలి వ్యక్తి).

